అట్ట లోపలివైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కన బడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిషికులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు భారత దేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది

నాగార్జున కొండ క్రీ శ 3వ శతాబ్దం

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యముతో)

# ఉమ్రావ్ జాన్ అదా

ఉర్దూమూలం

మిర్జా రుస్వా

తెలుగు సేత

దాశరథి రంగాచార్య



సాహిత్య అకాడెమీ

*Umrao Jan Ada* - Telugu translation by D Rangacharya
of Mirza Ruswa's Urdu novel of the same name
Sahitya Akademi 1990 Rs 25


First edition - 1971
Reprint - 1990

**సాహిత్య అకాడెమీ**
ప్రధాన కార్యాలయం
రవీంద్ర భవన్, 35 ఫిరోజ్‌షా రోడ్, న్యూడిల్లీ - 110 001
విక్రయ విభాగం
'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

ప్రాంతీయ కార్యాలయాలు
29, ఎల్డామ్స్ రోడ్, తేనాం పేట, మద్రాస్ - 600 018
జీవనతార భవనము (నాల్గవ అంతస్తు), 23A /44x, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053
172, ముంబయ్ మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, బొంబాయి - 400 014

రూ 25

*Offset reprint by* Welcun Press Madras

# కృతజ్ఞతలు

మిర్జా రుస్వా రచించిన ఉమ్రావ్ జాన్ అదా ఉర్దూ నవలకు ఇది అనువాదం. అనువాదం స్వీయరచనకంటె కష్టం అనే విషయం విదితమే. ఎందుకంటె రచయిత భావాలకు అనువాదకుడు భాష సమకూర్చాలి.

ఈ నవలలోని కవితాహృదయం తెలుసుకోవడానికి ఉర్దూ కాలేజ ప్రిన్సిపాల్ శ్రీ హుసేనీ షాహిద్ ఎంతో సహకరించగా తెలుగుచేతలో సహకరించినవారు మిత్రులు శ్రీ నార్ల చిరంజీవి. శుద్ధప్రతి సిద్ధంచేయడంలో తోడ్పడ్డారు మిత్రులు దేవరకొండ మాధవరావుగారు.

వీరందరికీ నా హార్దిక కృతజ్ఞతలు

అనువాదకుడు
దాశరథి రంగాచార్య

# ప్రస్తావన

ఏమున్నది స్వారస్యం
ఏ కథలో మాత్రం?
నా కథనే చెప్పనా,
శోకం వ్యథ విప్పనా?

మిర్జా రుస్వా సాహెబ్! ఇంత ఇదిగా అడుగుతున్నారే. నా దౌర్భాగ్యకథలో మీరు వినదగిందేముందని? నా జీవితానికి ఒక ధ్యేయం లేదు. ఒక లక్ష్యం లేదు. వంశం లేదు. అంశం లేదు. తెగిన గాలిపటాన్ని. అల్లాంటి నా కథలో ఇంపా? సొంపా?

అయినా అడిగారు కనుక వినండి. ఓపిగ్గా వింటారుగా?

తండ్రి తాతలపేర గొప్పతనం ఆపాదించుకోవడంవల్ల ఏం ప్రయోజనం? నిజానికి నా కవి గుర్తే లేవు. నాకు గుర్తున్నదల్లా ఫైజాబాదు చివర మా యిల్లు ఉండడం. ఇంటి కట్టడం గట్టిదే. ఇరుగుపొరుగున కొన్ని పెంకుటిండ్లు. పూరిండ్లూ ఉండేవి. వాటిల్లో ఉండేవాళ్ళూ అలాంటి వాళ్ళే. నీళ్ళు మోసేవాళ్ళు. మంగళ్ళూ, చాకళ్ళూ, కుమ్మర్లూనూ; మా యిల్లే ఆ వీధిలో ఎత్తయింది. అయినా ఎత్తయిన ఇల్లు మరొకటుండేది. అది దిలావర్ ఖాన్‌ది.

మా నాన్న ఉద్యోగం బహూబేగమ్ సమాధివద్ద. ఆ ఉద్యోగం పేరేమిటో, జీతం, బత్తెం ఎంతో తెలీదుకాని అంతా నాన్నను జమేదార్ అనడంమాత్రం గుర్తుంది.

పగలంతా తమ్ముణ్ణి ఆడించడం నా పని. వాడికి నేనంటే ప్రాణం. క్షణం ఉండేవాడు కాదు నన్ను విడిచి.

సాయంకాలానికి కొలువునించి వచ్చేవాడు మా నాన్న. అప్పుడు చూడాలి మా సరదా. అమాంతంగా నడుంపట్టుకు ప్రేలాడేదాన్ని. తమ్ముడంటావా? పరిగెత్తేవాడు. నాన్నా, నాన్నా అంటూ అంగీ పట్టుకునేవాడు. నాన్న ముఖం చాటంత అయ్యేది. నా వెన్నుతట్టి నిమిరేవాడు. తమ్ముణ్ణి ఎత్తుకునేవాడు. ముద్దులు కురిపించేవాడు. వట్టిచేతుల్తో వచ్చేవాడేకాదు. ఒకప్పుడు బత్తీసాలు. మరొకప్పుడు సుక్కియలుండలు ఇలా

ఎప్పుడూ ఏదో ఒకటి తెస్తూనే ఉండేవాడు వాటి పంపకంలో మా గొడవ చూడాలి అక్కడే కొట్లాడుకునేవాళ్ళం ఎంత బావుండేదో బత్తీసాలు లాక్కుపోయేవాడు తమ్ముడు నువ్వులుండలు లాక్కుపోయేదాన్ని నేను అమ్మకు వంటింటి పని అలా వచ్చి కూర్చుంటాడో లేదో తగాదా మొదలు నాన్నా బొమ్మలు తేలేదా? అని ఒకరు "నా గొలుసు కంసాలి ఇంకా తేనేలేదు పిన్నికూతురుకు పాలు మాన్పిస్తున్నారు నేనేం వేసుకొని వెళ్ళాలి అక్కడికి? నాన్నా ఏమైనా ఈద్ కు కొత్తబట్టలు కావల సిందే తెస్తావుకదూ తప్పక పాతబట్టలైతే కట్టేదిలేదు విన్నావా? అంటాన్నేను అమ్మ వంట ముగించిందంటే నాకు విముక్తి రొట్టెల పళ్ళెం కూరగిన్నె తేవడం దస్తర్ ఖాన్ పర్చడం నా పని వడ్డించడం అమ్మ నేను కలసి భోంచేసేవాళ్ళం అంతా నాన్న పడుకునే ముందు నమాజు చేసేవాడు నేను చప్పున లేచేదాన్ని మళ్ళీ మొదలు

నాన్నా! ఇవ్వాళమాత్రం బొమ్మలు తేవద్దు మరిచిపోతేం జామికాయలూ నారింజకాయలూ ఇన్ని తేవాలి

నమాజు ముగించి అల్లాను స్మరిస్తూ డాబామీదికి ఎక్కేవాడు పావు రాళ్ళను వదిలి గింజలు వేసేవాడు ఒకటి రెంటిని ఎగరవేసేవాడుకూడా అమ్మ పాచిపని వంటపని ముగించేది పొద్దు ఎక్కకముందే ఉద్యోగానికి వెళ్ళిపోయేవాడు నాన్న అమ్మ కుట్టుపనిలోనో మరొక పనిలోనో పడి పోయేది నేను తమ్ముణ్ణి ఎత్తుకొని వీథిలోకి వెళ్ళిపోయేదాన్ని ఒక పెద్ద చింతచెట్టుండేది అక్కడికి చేరేవాళ్ళు ఆడపిల్లలూ మగపిల్లలూ తమ్ముణ్ణి దింపి వాళ్ళతో ఆటల్లో పడిపోయేదాన్ని కమ్మని రోజులు చీకూ చింతా లేదు చక్కని భోజనం మంచిబట్టలూ ఉండేవి తోటి పిల్లలందర్లో నేనే మెరుగు మనసుకు దిగులులేదు చూపువిరుపు లెరు గదు మా ఇంటిముందు ఎదురుబొదురుగా రెండు వసారాలు పెద్ద వసారా ముందు రెండు పెంకుటిగదులు వసారాకు ఎదురుగా చిన్నిల్లు డాబామీద రెండు పెంకుటిగదులు ఇల్లు విశాలమైంది పాత్ర సామగ్రి అవసరాని కంటె ఎక్కువే ఉండేది మూడు నాలుగు పరుపులూ దుప్పట్లూ ఉండేవి వీథిలోవాళ్ళంతా ఇలాంటి వస్తువులకోసం మా ఇంటికే వచ్చేవారు వీథిలో ఆడవాళ్ళంతా నూతినుంచి నీళ్ళుతోడి తెచ్చుకునేవారు కాని మాకు పని మనిషి తెచ్చేవాడు మా నాన్న డ్రెస్సు వేసుకొని బయల్దేరాడంటే జనం వంగి వంగి సలాము చేసేవాళ్ళు వీథివాళ్ళంతా కాలినడకన పేరంటానికి వెళ్తే మా అమ్మ మేనాలో వెళ్ళేది

నిజానికి నేను అందగత్తెల్లో జమకాదు కాని తోటివాళ్ళలో అంద కత్తెనే అనాలి జామపండు చాయ వికారంకాని ముక్కూ, ముఖమూ కాస్త ఎత్తునొసలూ. పెద్దవైయిన కళ్ళు పాలబుగ్గలు వయసుకు తగిన పొడవులావూ బాగానే ఉండేదాన్ని ఇప్పటిలా మాత్రం కాదు ఇప్పుడు గాని అప్పుడుగాని నన్నెవరైనా చిన్నారుల్లో లెక్కేంకారు ఆ వయసులో చందారపు రంగు పైజామా చిన్నచిన్న పూలచొక్కా జరీ ఒణీ చేతికి మూడేసి వెండిగాజులు మెడలో గొలుసు బంగారపు ముక్కుపుడక— మిగతా అమ్మాయిలకు వెండిపుడక ఉండేవి అప్పుడే కుట్టించిన చెవులు— వాటికి నీలిరంగు దారం కట్టేవారు—పోగులు చేయడానికి బంగారం ఇచ్చారు కంసాలికి

నా పెళ్ళి నిశ్చయం అయింది వరుడు మేనత్తకొడుకే వర నిశ్చయం తొమ్మిది సంవత్సరాల వయసులోనే జరిగిపోయింది మా అత్తను నవాబ్‌గంజ్‌కు ఇచ్చారు మా మామ ఖూస్వాటు మాకంటే బాగా ఉన్న వారు మా అత్తవారు వరనిశ్చయానికి ముందు చాలాసార్లు అమ్మతో అక్కడికి వెళ్ళాను అక్కడి వ్యవహారాలు అదొక రకం ఇల్లు మట్టి గోడలదేగాని విశాలమైంది ఆవులు గేదెలు ఎడ్లు ఉండేవి పాడి సమృద్ధం ధాన్యం పుష్కలం మొక్కజొన్న కాలం వస్తే కండెలు బుట్టల్తో వచ్చేవి చెరుకు గుట్టలు గుట్టలుగా పడిఉండేవి ఎంతని తింటారు।

వరుణ్ణి చూశా అతనితో ఆడుకున్నానుకూడా నాన్న పెండ్లికి ఏర్పాటుచేశారు సమ్మ తక్కువపడింది ఒక్కటే నెలలో ముహూర్తం

రాత్రివూట అమ్మా నాన్నా పెళ్ళినిగురించి మాట్లాడుకుంటుంటే చాటుగా వినేదాన్ని లోపల్లోపలే సంబరపడేదాన్ని కరీమన్ నా స్నేహితురాలు దానికి నాతోపాటే మొగుడితకంటే నా ఎదుటే బాగున్నాడు ఆతడు ఎలా ఇతడు ఎరుపు అతనిది పెద్దగడ్డం, ఇతనికింకా మూతిమీసాలే అతడు మురికి దొవతి కట్టుకొని ఎర్రరంగు చొక్కా వేసేవాడు ఇక నా బావ ఎంత తీరుగా ఉండేవాడు వచ్చని చీటిలద్ద పైజామా ఎత్తైన టోపి, మఖ్మల్‌బూట్లు। కరీమన్ ఏడుదు తలకొక చిరిగినగుడ్డ చుట్టుకొని చెప్పుల్లేని వాళ్ళతో తిరుగుతాడు నా పరి స్థితికి పొంగిపోయాను పొంగకేం? అంతకంటే మంచిదశనుగురించి నేను ఊహించలేను నా ఆశలు, ఆశయాలన్నీ త్వరలోనే సిద్ధిస్తాయని పించింది

పుట్టింట్లో ఏలాంటి కష్టాలుపడ్డట్లు గుర్తులేదు ఒకసారి దాగుడు మూత లాడుతున్నాం వెండి ఉంగరం జారిపోయింది ఖరీదు అణాకు మించి ఉండదు ఇప్పుడా మాట చెబుతున్నాకాని అప్పుడు నాకింత జ్ఞానం ఎక్కడిది? ఏ వస్తువు ఖరీదుమాత్రం నాకేం తెలుసు? ఉంగరంకోసం ఎంత ఏడ్చానో ఏడ్చాను కళ్లుబ్బిపోయాయి పగలంతా అమ్మకు తెలియనీయలేదు రాత్రి అయింది వేలుకు ఉంగరం కనిపించలేదు అమ్మ అడిగింది చెప్పక తప్పలేదు అమ్మ చెంప పొంగేటట్లు కొట్టింది పెద్దగా ఏడ్చాను ఎక్కిళ్ళు వచ్చాయనుకోండి ఇంతలో నాన్న వచ్చేశారు నన్ను గద్దించారు అమ్మను కోపగించారు అప్పుడు నాకు ఊరట కలిగింది

అమ్మకంటే నేనంటే ఎక్కువ ఇష్టం నాన్నకు నాన్న ఎప్పుడూ నామీద చేయిచేసుకోలేదు అమ్మ మాటిమాటికి కొట్టేది అమ్మకు తమ్ముడంటే ఎంతో ఇష్టం తమ్ముడికోసం ఎన్నోసార్లు దెబ్బలు తిన్నాను అయినా వాడంటే నాకు ఎంతో ఇష్టం అమ్మమీద పంతంతో ఒక్కోసారి పగలంతా వాణ్ణి ఎత్తుకునేదాన్నికాదు అయినా అమ్మ కనుమరుగయితే వాణ్ణి అమాంతంగా ఎత్తుకొని ఒళ్ళో కూర్చోపెట్టుకుని ముద్దుపెట్టుకునేదాన్ని అమ్మ అలికిడి వినిపించిందా వెంటనే దించేసేదాన్ని వాడు ఏడ్చేవాడు నేనే ఏడిపించా ననుకునేది దెబ్బలు తగిలేవి నాకు

ఐనా కాస్త నా వేలు నొచ్చిందా అమ్మ ప్రాణాల్లో ప్రాణాలుండేవి కావు తిండీ నిద్రా ఉండేదికాదు కనిపించినవాళ్లల్లా మందడిగేది తాయెత్తులు తెచ్చేది

నా పెళ్ళికోసం మెళ్ళో గొలుసుతీసి నాన్నకు ఇచ్చేసింది దీన్లో వెండి కలిపి ఒళ్ళి చేయించమని కొత్తవాటికి మెరుగుపెట్టించమన్నది ఇంట్లో ఉన్న పాత్రలన్నింటిలో మూడు, నాలుగు అట్టేపెట్టి మిగతావన్నీ తీసింది వాటన్నింటికి కళాయి పూయించమన్నది ''రేపనేది ఉందా లేదా?" అడిగాడు నాన్న అమ్మ వింటేనా? 'మీ తోబుట్టువు ఆమీందారు భార్య ఆవిడకు తెలియాలిగా తోబుట్టువు తన కూతురుకు ఇన్ని ఇచ్చారని మీకు తోబుట్టువు అయితేమాత్రం అత్తారిల్లు అత్తారిల్లే నా కూతురు పెళ్లి చేటులో పెట్టే జనమంతా మాటిపోటిమాటలనరూ?" అన్నది

# 1

మిత్రా మహ్యాగాయా నా పుట్టింటి విషయమూ బాల్యం విషయమూ వివరించాను. ఆ పరిస్థితుల్లో సుఖంగా ఉండేదాన్ని. ఈ పరిస్థితుల్లో సుఖంగా ఉంటున్నానో మీరే అర్థంచేసుకోవాలి. నాకుమాత్రం ఆనాటి బ్రతుకే హాయిగా ఉంది.

దేశదిమ్మరి నైతినప్పుడు
చెదురుపోతు నైతినిప్పుడు
కాలము మేనెరుగుదు—కాని
గోడువిప్పజాల పెదలెదుట।

సానికులం సంగతి చెప్పనే అవసరంలేదు. వాళ్ళు పుట్టింది అలాంటి ఇండ్లల్లో. వాతావరణం అలాంటిది. పోషణ అలాంటిది. చెడు తప్ప మరో విషయానికి అక్కడ ఆస్కారంలేదు. కాని తలిదండ్రులు కన్న బిడ్డలో లేచిపోయి చెడిపోతారు। వాళ్ళను ఏంచేసినా పాపం లేదు.

నా కథ ఇంతవరకు చెప్పి ఆతరువాత నేను వ్యభిచారిణినైనాను అని చెప్పితే ఏమనుకోండి లోకం ఏమనుకుంటుంది? ఎంత రాక్షసి! పెళ్ళి కావడం ఆలస్యం అయిందని ఎవణ్ణో లేవదీసుకుపోయింది. అతడూ వదిలేశాడు. ఇంకెవణ్ణో ఉంచుకుంది. వాడితోనూ పడలేదు. క్రమ క్రమంగా వృత్తిలోకి దిగింది అని ఎందుకనుకోరు? వాస్తవంగా జరిగేది అలాగే. అనేకమంది ఆడపిల్లలు చెడిపోవడం కళ్ళారా చూశాను విన్నాను. అందుకు కారణాలు అనేకం. ఒకటి వయసువస్తుంది. తలిదండ్రులు పెళ్ళిచేయరు. రెండు నచ్చని వరునితో పెండ్లికాదు. ఎవడికో ముడిపెట్టేస్తారు. ఈడుజోడు చూడరు. అందచందం చూడరు. మనసునూ మనిషినీ గమనించరు. మొగుడితో పడదు. ఇల్లు విడిచి లేచిపోతారు. మూడు యవ్వనంలో మున్నువిరిగి నెత్తిన పడుతుంది. భోగం ముంతనైపోతారు. సహవాసం చచ్చిపోతుంది. ఎవడితోనో స్నేహం అయిపోతుంది. కాని నా విషయం అలాంటిది కాదు. నా దౌర్భాగ్యం నన్నిలా చేసింది. కాలం నన్ను కారడవిలో విడిచింది. దారి తప్పాను. తెగిన గాలిపటంలా తిరుగుతున్నాను. గత్యంతరం లేకపోయింది.

దిలావర్ ఖాన్ ఇల్లు మా ఇంటికి కొద్దిదూరంలో ఉంది అతడు చాల సంవత్సరాలు లక్నో జైల్లో ఉన్నాడు ఎవరి సిఫారసువల్లనో విడుదలై వచ్చాడు అతడికి మా నాన్నంటే తీరని పగ ఏమంటే అతడు ఫైజాబాదులో అరెస్టయినాడు అతని ప్రవర్తనగురించి సాక్ష్యం చెప్పడానికి మా వీధినుంచి మనుషులను పిలిపించారు నాన్నకూడా వెళ్ళారు మా నాన్న కల్లాకపటంలేని మనిషి సత్యవాది పైగా ఖురాను చేతికిచ్చి జమేదార్! ఉన్నదున్నట్లు చెప్పు ఈ మనిషి ఎలాంటివాడు? అని అడిగితే ఉన్నదున్నట్లు చెప్పారు అదీ అతని ద్వేషానికి కారణం అదే అతని గుండెలో ముల్లులా బాధిస్తోంది విడుదలై వచ్చాడు వట్టి దబ్బు పావురాళ్ళను సాకాడు ఒకరోజు మా పావురాన్ని పట్టేశాడు నాన్న పావురాన్ని అడగడానికి వెళ్ళారు పావలా ఇస్తానన్నారు అర్ధ రూపాయి కావాలన్నాడు నాన్న ఉద్యోగానికి వెళ్ళిపోయారు కాలమే అలాచేసిందో సర్వేశ్వరుని ఇచ్ఛ అలాఉందో నేను ఇంటినుంచి బయటికి వచ్చాను చింతచెట్టుక్రింద కనిపించాడు దిలావర్ ఖాన్ బిడ్డా! పద మీ నాన్న తెచ్చేశాడు పావురం తీసికెళ్ళు అన్నాడు ఎంతో చిక్కాను వెళ్లాను ఇంట్లో ప్రవేశించాను ఎక్కడ పిట్టమనిషిలేదు ఇల్లు పాడుపడినట్లుంది ఇటు నేను ప్రవేశించగానే అటు తలుపువేసి గొళ్ళెం పెట్టాడు అరుద్దామనుకుంటుండగానే నోట్లో గుడ్డలు కుక్కాడు రెండుచేతులూ కండువాతో కట్టేశాడు నన్ను అక్కడే కూర్చోబెట్టి దొడ్డిగుమ్మంనుంచి బయటికి వెళ్లి పీర్‌బక్ష్‌ను పిలిచాడు పీర్‌బక్ష్ వచ్చాడు ఇద్దరు కలిసి ఎడ్లబండిమీద వేశారు ప్రాణాలు బిగపట్టుకొని కూర్చున్నాను ఏం చేయగలను? రాక్షసుని గుప్పిట్లో ఉన్నాను బండిలో దిలావర్ ఖాన్ నన్ను మోకాళ్లమధ్య అదిమిపెట్టి కూర్చున్నాడు చేతిలో కత్తి కళ్లు రక్తం కురుస్తున్నాయి పీర్‌బక్ష్ బండి తోలుతున్నాడు బండి సాగిపోతూంది కొద్దిసేపట్లో సాయంకాలం అయింది చీకట్లు వ్యాపించాయి చలికాలం గాలి రివ్వున వీస్తోంది చలి ఎముకలు కొరుకుతూంది ప్రాణాలు ఎగిరిపోతున్నాయి కన్నీటిధారలు నిలవడం లేదు ఎలాంటి ఆపదలో చిక్కుకున్నాను! నాన్న కొలువునుంచి ఇంటికి వచ్చివుంటారు నా కోసం వెతుకుతూ ఉండవచ్చు అమ్మ ఎంత బాధపడుతూందేమో! తమ్ముడు ఆటల్లో ఏడుస్తుంటాడు వాడికేం తెలుసు నా గతి ఇలా అయిందని? అమ్మా నాన్నా ఇల్లు తమ్ముడు వసారా వంటిల్లు అన్నీ నా కళ్ళల్లో ఆడేయి ఈ ఆలోచనలన్నీ ఒక వైపు ప్రాణభయం మరొకవైపు దిలావర్ ఖాన్ చేతిలోని కత్తిచూస్తూ

దిలా : ఇస్తాం ఎలాగో.

పీర్ : ఎక్కణ్ణుంచి తెచ్చిస్తావు? నేను వేరేవిధంగా అనుకున్నాలే.

దిలా : ఇంటికి పద. ఎక్కడా దొరక్కుంటే పావురాలు అమ్మేస్తాను.

పీర్ : పావురా లెందుకమ్మాలి? ఒకమాట చెప్పనా?

దిలా : చెప్పు.

పీర్ : లక్నోకు వెళ్ళి దీన్ని దబ్బుచేసుకుందాం!

చావు నిశ్చయం అనుకున్నతర్వాత వారి మాటలు సరిగా చెవిని పడడంలేదు. ఎవరో కలలో మాట్లాడినట్లు వినిపిస్తున్నాయి. పీర్‌బక్ష్ మాటలు విని మళ్ళీ ప్రాణంమీద కొంత ఆశ కలిగింది. మనసులో పీర్‌బక్ష్‌ను దీవించాను. ఆ రాకసుడు ఏమంటాడో వినాలని ఊపిరి బిగపట్టి కూర్చున్నాను.

దిలా : సరి చూద్దాంలే నడువిక.

నాన్నెక్కడ ఆగుతాడేం? అదిగో ఆ చెట్టుకింద మంట కనిపిస్తూంది. నిప్పు తెస్తాను. హుక్కా నింపుకుందాం.

పీర్‌బక్ష్ నిప్పుతేవడానికి వెళ్ళిపోయాడు. అతను వచ్చేలోగా చంపేస్తాడేమోనని భయం పట్టుకుంది. ప్రాణభయం మహాచెడ్డది. గట్టిగా కేకవేశాను. దిలావర్‌ఖాన్ చెళ్ళుమని చెంపమీద కొట్టాడు. "హరామ్జాదీ! నోరుమూసుకొని ఉండలేవు? పొడిచేస్తా.... సఖరాలు...."

పీర్ ఇంకా ఆట్టేదూరం వెళ్ళలేదు. "సహీం భాయీ! అలాంటి పని చెయ్యొద్దు. నామీద ఒట్టు. నేను వచ్చేవరకూ ఆగు" అని అన్నాడు.

దిలా : సరే. వెళ్ళి నిప్పు తీసుకురా.

పీర్‌బక్ష్ నిప్పు తెచ్చాడు. హుక్కా నింపి దిలావర్‌ఖానుకు ఇచ్చాడు.

దిలా : [హుక్కా పీల్చి] అయితే ఇది ఎంతకు అమ్ముడు అవుతుం
దంటావు? ఎవరు అమ్మాలి? పట్టుబడ్తే చిక్కుల్లో పడిపోతాం.

పీర్ : ఆ బాధ్యత నాది. అరేమియాం అన్నీ నీ మాటలు! ఎవరూ పట్టు

కునేది? లక్నోలో ఇలాంటివి రాత్రింబవళ్ళు జరుగుతునేఉంటాయి. మా బావమరిది తెలుసుగా?

దిలా: కరీమా?

పీర్: ఆఁ. అతని బ్రతుకే దానిమీద. ఎందరో అమ్మాయిలను తీసికెళ్ళాడు. లక్నోలో వెండిబిళ్ళలు చేసుకున్నాడు.

దిలా: ఎక్కడ ఉంటున్నాడతను?

పీర్: ఎక్కడేమిటి? లక్నోలోనే. గోమతి అవతలివైపు అవని అత్తవారిల్లు. అక్కడే ఉండొచ్చు.

దిలా: అలాగా, అయితే పిల్లలు ఎంతకు అమ్ముడు అవుతారో?

పీర్: రూపాన్నిబట్టి.

దిలా: దీనికి ఎంత వస్తుంది?

పీర్: నూరు, నూటయాభై, నీ అదృష్టాన్నిబట్టి.

దిలా: ఏం భాయీ! ఈ సుఖానికా! నూరు వస్తే ఎక్కువే?"

పీర్: ఎంతైతే ఏంగాని తీసికెళ్తాం. చంపేస్తే ఏం లాభం?

తరవాత దిలావర్‌ఖాను పీర్‌బక్ష్ చెవిలో ఏదో చెప్పాడు. నాకు వినిపించలేదు. "అది నేను ముందే అనుకున్నాను. నువ్వు చేకూవ్వా?" అన్నాడు పీర్‌బక్ష్.

రాత్రంతా బండి నడిచింది. ప్రాణం గుప్పెట్లో ఉంది. కళ్ళముందు మృత్యువు తాండవిస్తూంది. శక్తి జారిపోయింది. వొళ్ళు మొద్దుబారింది. ఉరికంబంమీదకూడ నిద్రపట్టుందని మీరు వినేఉంటారు. కొంచెంసేపటికి కన్ను అంటుకుంది. పీర్‌బక్ష్ పయ. ఎద్దుల గొంగళీ కప్పాడు. రాత్రి ఎన్నోసార్లు ఉలిక్కిపడ్డాను. భయం. మెదలకుండా పడుకున్నాను. చివరకు ఒకసారి కంబళీ ముఖంమీంచి తొలగించి చూశాను. బండిలో ఒక్కర్తెనే ఉన్నాను. పరదాలోంచి తొంగిచూశాను. కొన్ని మట్టి ఇంట్లు కనిపించాయి....ఒక కోమటికొట్టు. దిలావర్‌ఖాను, పీర్‌బక్షా ఏదో కొంటున్నారు. ఎడ్లు ఎదురుగా ఉన్న మర్రిచెట్టుక్రింద పపుడు తింటు

న్నాయి. ఇద్దరు ముగ్గురు పల్లెవాసు మంట కాగుతున్నారు. ఒకడు చుట్ట కాలుస్తున్నాడు. ఇంతలో పీర్‌బక్ష్ బండిదగ్గరకు వచ్చాడు. కాల్చిన శనగలు పెట్టాడు. రాత్రంతా ఉపవాసం. శనగలు తిన్నాను. చెంబుతో నీళ్ళు తెచ్చిఇచ్చాడు. త్రాగాను. మెదలకుండా పడిఉన్నాను.

బండి చాలసేపు అక్కడ నిలిచింది. పీర్‌బక్ష్ బండి కట్టాడు. దిలావర్‌ఖాను హుక్కా పింపుకొని నాదగ్గరికి వచ్చి కూర్చున్నాడు. బండి కదిలింది. ఆరోజు అంతగా దౌర్జన్యం జరుగలేదు. దిలావర్‌ఖాన్ కత్తి కనిపించలేదు. గుద్దులు తగల్లేదు. వారిద్దరూ మధ్యమధ్య హుక్కా పీల్చారు. బాతాఖానీ సాగింది. మాటలతో అలసినపుడు పాటలు సాగించారు. ఒకడు పాడుతుంటే రెండవవాడు మౌనంగా వింటున్నాడు. వింటున్నాడని కాదు ఏం మాట్లాడాలా అని ఆలోచిస్తున్నాడు. మళ్ళీ మాటలు ప్రారంభం. మాటలు వాదనలోకి దిగాయి. ఇద్దరూ తిట్టుకున్నారు. హుక్కా చేతులు పైకెత్తారు. నడుములు బిగించారు. ఒకడు బండినుండి దూకాడు. మరొకడు గొంతు నులమడానికి తయారైనాడు. ఇంతలో ఇద్దరూ కిలా పడిపోయారు. సమాధానం కుదిరింది. మిత్రులైపోయారు. ఎన్నడూ పోట్లాతే ఎరగనట్లు మాటలు సాగించారు.

ఒకడు : మనం ఏ విషయంలో పోట్లాడుకున్నట్లు ?

రెండోవాడు : అపును ఏమిటా విషయం ?

మొదటివాడు : పోనీ ఆ మాటెందుకూ ఇప్పుడు ?

రెండోవాడు : సరే పోనీ.

# 2

బందిసైతి, తొలిరేయి, ఓ నిషాద :
ఎదులు మొకింత తెక్కలాడ్చుకొందు :

వట్టువెసి తొలిరేయి కథ విన్నారు. నాటి యాతన ఇప్పటి ఉన్నంత వివరంగా మరవలేను. ఎలా బతికానో, ఎందుకు బతికానో నాకే ఆశ్చర్యంగా ఉంది. ఎంత గట్టి ప్రాణం! ఎగిరిపోలేదు. ఓరీ పాపిసా! దిలావర్ ఖాన్! లోకంలో అనుభవించాల్సిన శిక్ష అనుభవించావు. అంతటితో నా ఆత్మ శాంతించిందనుకున్నావా? ఆ రాక్షసుణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ వేసినా బాధపడకపోయేదాన్ని. గోరీలో రేయింబవళ్ళూ నరకయాతనలు పడుతూనే ఉంటావు. అంతిమదినంనాడు అల్లా నిన్ను పెడతాడురా తీరని యాతనలు!

నా తల్లిదండ్రుల గతి ఏమైవుంటుంది! నీ ప్రాణానికి ఎంత పరితపించారో! మిర్జా సాహెబ్! బస్. ఇక చాలు. మిగతాది రేపు చెపుతాను. నా గుండె ప్రక్కలు అవుతోంది. పెద్దగా కేకలుపెట్టి ఏడవాలనిపిస్తోంది.

నా అవారా జీవితకథ విని ఏంచేస్తారు? విన్నది చాలు. దిలావర్ ఖాను నన్ను అప్పుడే చంపేస్తే బాగుండేది. పిడికెడు మట్టిలో నా శీలం దాగేది. తల్లిదండ్రుల గౌరవానికి కళంకం కలిగేది కాదు. లోకమూ, మతమూ నా ముఖానికి మసిపూసి ఉండేవికావు.

తరవాత ఒకసారి చూశాను అమ్మను—చాలకాలం తరవాత. ఇప్పుడు బతికేవుందో, చనిపోయిందో అల్లాకే తెలియాలి. తమ్ముడికి ఒక కుర్రాడు. దేవుని దయవల్ల పదిహేనేండ్లవాడయ్యాడు. ఇద్దరు ఆడ పిల్లలు. వాళ్ళను చూడాలని తపిస్తాను; ఒక్కొక్కసారి. ఏమంత దూరం కూడా కాదు. ఏధవ రూపాయి పారేస్తే ఫైజాబాదు చేరతాను. అయినా వివశను. రైళ్ళు లేనపుడు ఫైజాబాదునుండి లక్నో నాలుగురోజుల బాట. దిలావర్ ఖాను, నన్ను వెంటపడతారనే భయంతో ఏ డొంకతిరుగుడు దారిన వచ్చాడో ఎనిమిది రోజులు పట్టింది. దిలావర్ ఖాను, పీర్ బక్ష్ మాటల్నిబట్టి నన్ను వారు లక్నో తీసికెళ్తున్నారని తెలుసుకున్నాను. అప్పటికే ఆ పేరు వినివున్నాను. మా తాత అక్కడే ఒక రాజభవనంలో

సిపాయి పని చేశాడు. వారు ఒకసారి ఫైజాబాదుకూడా వచ్చారు. నాకోసం మిఠాయిలూ, బొమ్మలూ తెచ్చారు. వారి రూపం ఇప్పటికీ గుర్తుంది.

లక్నోలో గోమతి అద్దరిన ఉన్న కరీమ్ అత్తవారింటికి తీసికెళ్ళి నన్ను దింపాడు. ఇల్లు చిన్నది. కరీమ్ అత్త రాక్షసి. చండిక. నన్ను ఇంట్లోకి తీసికెళ్ళింది. కొట్లో బంధించింది. ఉదయం లక్నో చేరిందా న్నల్లా మధ్యాహ్నంవరకూ గదిలోనే పడిఉన్నాను. అప్పుడు తలుపు తెరుచుకుంది. ఒక యువతి—కరీం భార్య—మూడు చపాతీలు, ఒక మట్టి కప్పులో చిన్న గరిటెడు మినపపప్పూ, ముంతలో నీళ్ళు తెచ్చిపెట్టి వెళ్ళి పోయింది. అప్పటికి అదే పంచభక్ష్యపరమాన్నం అయింది. ఎనిమిది రోజుల్నించీ ఇంటి వంటే తినలేదు. శనగలూ, గుగ్గిళ్ళతో సరిపుచ్చు కున్నాను. సగం ముంతెడు నీళ్ళుతాగి పడుకున్నాను. ఎంతసేపు నిద్ర పోయానో! కొట్లో చీకటి. రాత్రీ, పగలూ తెలియడంలేదు. ఈలోగా అనేకసార్లు కళ్ళు తెరిచాను. చీకటి. నలువైపులా అంధకారం. ఒంటరి దాన్ని. దగ్గర ఎవరూ లేరు. మళ్ళీ దుప్పటి కప్పుకొని పడుకున్నాను. మళ్ళీ నిద్ర. మూడవసారో, నాల్గవసారో మెలకువ వచ్చినపుడు మళ్ళీ నిద్రరాలేదు. ఈలోగా కరీం అత్త—రాక్షసి—అరుస్తూ, కేకలు వేస్తూ లోనికి వచ్చింది. "ముండా! ఎంత నిద్రే! రాత్రంతా అరిచీ అరిచీ గొంతు పగిలిపోయింది. కదిపి కదిపి లేపితే శ్వాసకూడ లేదు. ఊపిరి ఉన్నట్లు కనిపించలేదు. పురుగు ముట్టిందేమో అనుకున్నా!" లేచి కూర్చున్నాను.

మౌనంగా విన్నాను. అరవాల్సినంత అరిచి అడిగింది "కప్పు ఏదీ?" అని. చేతికి అందించాను. తీసుకొని వెళ్ళిపోయింది. తలుపు మూసేసింది. కాస్సేపటికి కరీమ్ భార్య వచ్చింది. గదికి ఒక దిడ్డి ఉంది. అది తెరిచింది. నన్ను బయటికి తెచ్చింది. పాడుపడిన గోడలు కనిపించాయి. ఇక్కడ ఆకసాన్ని అవలోకించే అదృష్టం లభించింది. మళ్ళీ ఆ కాలకూటంలో పడ్డాను. ఈరోజు తొస్సనస్త్రపూ, కందిపప్పూ లభించాయి.

అలా రెండు రోజులు గడిచిపోయాయి. మూడోనాడు మరొక అమ్మాయి వచ్చింది. వయసులో నాకంటే రెండు మూడేళ్ళు పెద్దది. కరీమ్ మోసగించి తెచ్చాడో, బుజ్జగించి తెచ్చాడోకాని ఆ అమ్మాయి వెక్కి వెక్కి ఏడిచింది. ఆవిడ రావడం నాకు కొస్త నయం అయింది. ఏడుపూ, అరుపూ అయిపోయింతరువాత మెల్లగా మాటలు సాగాయి.

కోమల్ల పిల్ల. పేరు రామదేయి. సీతాపూర్‌దగ్గర ఏదో ఊరు వాళ్ళది. చీకట్లో ముఖం కనిపించలేదు. తెల్లవారి దిడ్డి తెరిచినప్పుడు చూశాను. ఎరుపురంగు. ముక్కూ ముఖం తీర్చిదిద్దినట్లున్నాయి. అంద మైంది.

నాలుగవరోజు ఆ అమ్మాయికి చీకటికూపంనుంచి విముక్తి లభించింది. నేను అక్కడే ఉండిపోయాను. మళ్ళీ ఒంటరినయ్యాను. మూడవరోజు రాత్రి దిలావర్‌ఖాను, పీర్‌బక్ష్ వచ్చి నన్ను బయటికి తీశారు. వెంట తీసి కెళ్ళారు. వెన్నెలరాత్రి. ముందు ఒక మైదానం. తరవాత ఒక బజారు నుంచి వెళ్ళాం. వంతెనమీదికి వచ్చాం. నదిలో తరంగాలు ఊగు తున్నాయి. చలిగాలి వీస్తుంది. వణికిపోతున్నాను. వంతెన దాటి ఇరుకు గొందిలో చాలదూరం నడిచాం. కాళ్ళు అలసిపోయాయి. అక్కణ్ణుంచి మరొకవీధిలో ప్రవేశించాం. జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. దారి దొరకడమే కష్టంగా ఉంది.

మిర్జా రుస్వాగారూ! అది ఏ బజారో గుర్తించారా? నా మాన మర్యాదలు అమ్ముకున్న దుకాణం అక్కడే ఉంది. అది చౌకు. అగౌరవం, గౌరవం, అపఖ్యాతి, ఖ్యాతి లభించిన ఇల్లే ఆ ఇల్లు. ఖానుమ్‌జాన్ ఇంటి తలుపు తెరిచిఉంది. కొద్దిదూరంలో మెట్లున్నాయి. పైకి వెళ్ళాము. అంగ ణంలో ప్రవేశించాను. పెద్దవసారాకు కుడివైపు పెద్దగదిలో ఉన్న ఖానుమ్ జాన్ దగ్గరికి వెళ్ళాను.

మీరు ఖానుమ్‌గారిని చూసేఉంటారు. అప్పటికి ఆవిడ వయసు సుమారు 50 సంవత్సరాలు. భారీ శరీరం. చామనచాయ. అలాంటి స్త్రీని మళ్ళీ చూడలేదు. ముఖంమీద పడిన తెల్లని ముంగురులు ముఖానికి ఎంతో అందాన్ని ఇచ్చేవి. సన్నని తెల్ల మల్మల్ ముసుగు, నీలిరంగు పట్టు పైజామా, చేతులకు బంగారు మురుగులు. విలువైన చెవులదిద్దులు— ఆనాటి ఖానుమ్ రూపం ఈనాటికీ నా కళ్ళలో ఆడుతూంది. మంచానికి ఆనుకొని రత్నకంబళీమీద కూర్చునిఉంది.

పద్మాకారమైన దీపం వెలుగుతూంది. చెక్కడపు పనిగల పెద్ద తాంబూలపేటిక తెరిచి ముందు పడిఉంది. పొడవైన గొట్టంతో హుక్కా పీలుస్తూంది. ఒక చామనచాయ పిల్ల—బిస్మిల్లా—నృత్యం చేస్తూంది. మేము వెళ్ళగానే నాట్యం ఆగిపోయింది. మగవాళ్ళు గదినుంచి వెళ్ళిపోయారు. అంతా మొదలే నిశ్చయం అయిపోయింది.

ఖానమ్‌జాన్ : ఈ పిల్లేనా ?

దిలావర్‌ఖాన్ : జీ హాఁ, అవును.

నన్ను దగ్గరకు పిలిచింది. తూచ్చోబెట్టింది. ముఖం ఎత్తిచూచింది.

ఖానమ్ : అచ్ఛా ! నేను అన్నది ఖాయం. రెండో అమ్మాయి ఏది ?

పీర్‌బక్ష్ : ఆ వ్యవహారం ముగిసింది.

ఖానమ్ : ఎంతకు ?

పీర్ : రెండు వందలకు.

ఖానమ్ : అచ్ఛా. ఎక్కడ ?

పీర్ : ఒక బేగం తన కొడుకుకోసం ఖరీదుచేసింది.

ఖానమ్ : ముక్కూ, ముఖం బాగుంది. అంత నేనూ ఇచ్చేదాన్నే. తొందరపడ్డారు.

పీర్ : నేనేం చేయను ? ఎంతో చెప్పాను. కరీం వినలేదు.

దిలా : దీని ముక్కూ ముఖమూ బాగానే ఉన్నాయి. మీకు నచ్చాలి.

ఖానమ్ : సరే కుక్కపిల్లేం కాదుగా ! మనిషిపిల్ల.

దిలా : ఉన్నదేదో మీముందుంది.

ఖానమ్ : మంచిది. మీమాటే నెగ్గనీ, అని హూసేనీని కేకవేసింది.

బొద్దుగాఉన్న వామనపాయ నడివయసు స్త్రీ వచ్చి ముందు నుంచుంది.

ఖానమ్ : హూసేనీ !

హూసేనీ : ఖానమ్ సాహెబ్ !

ఖానమ్ : పెట్టె తీసుకురా.

హూసేనీ వెళ్లి పెట్టె తెచ్చింది. ఖానమ్ పెట్టె తెరిచి చాల రూపాయిలు దిలావర్‌ఖాను ముందు పోసింది. తరవాత తెలిసింది నూటపాతికని.

వాటిలో కొన్ని రూపాయలు లెక్కించి పీర్‌బక్ష్ కొంగున కట్టుకున్నాడు. యాభై అని విన్నాను. మిగతావి దిలావర్‌ఖాను సైతాను తీసుకున్నాడు. ఇద్దరూ సలామ్ చేసి వెళ్లిపోయారు. అప్పుడు గదిలో నేను, ఖానమ్, బువాహుసేనీ ముగ్గురం మాత్రమే మిగిలాం.

ఖానమ్ : ఖరీదు ఎక్కువ ఏమీ కాదనుకుంటా.

హుసేనీ : ఎక్కువా ? చాల చవక అంటాను.

ఖానమ్ : చవకకూడా కాదు. సరే అయిందేదో అయింది. అమాయకు రాలుగా కనిపిస్తూంది. ఎవరి అమ్మాయో అల్లాకే తెలియాలి. పాపం తలిదండ్రులు ఎంత తల్లడిల్లుతున్నారో. ఈ రాక్షసులు ఎక్కణ్ణుంచి తెస్తారో. ఏమాత్రం భగవంతుని భయంలేదు కదా !

హుసేనీ : మనం ఏ పాపమూ ఎరగం. పాపం అంతా వాళ్ళకే చుట్టు కుంటుంది. మనకేం. మనం కొనకుంటే వేరేవాళ్ళు కొనేదేగా. ఖానమ్ సాహిబ్, వీళ్ళు ఇక్కడే సుఖంగా ఉంటారు. భార్యల మధ్య పనికత్తెల గతులు మీకు తెలియనివా ?

ఖానమ్ : తెలియకేం ? ఇవ్వాళ్టి విషయం. సుల్తాన్ జహాఁబేగమ్, తన భర్తతో పనికత్తె మాట్లాడుతూఉండడం చూసింవట ఇంకేముంది ! ఇనప సీకులతో కాల్చి చంపేసిందట !

హుసేనీ : ఇహంలో వారి ఇష్టంవచ్చినట్టు చేస్తారు. అంతిమ దినం నాడు ఈ భార్యల ముఖాలు మాడ్తాయి.

ఖానమ్ : ముఖాలు మాడడం కాదు. భగవంతుని కొరడాలు తగులుతాయి.

హుసేనీ : అంతే కావాలి. చచ్చినోళ్ళు. వాళ్ళకు అదే శిక్ష.

తరవాత మిక్కిలి వినయంగా విన్నవించుకుంది " ఈ పిల్లను నాకు ఇచ్చేయండి. సాకుతాను. నరుకు మీది. తనుకే సమర్పించుకుంటాను."

ఖానమ్ : మంచిది నీవే సాకు.

అంతసేపూ నుంచునిఉన్న బువాహుసేనీ వచ్చి నా పక్కన కూర్చుంది.

హుసేనీ : అమ్మాయీ ! ఎక్కణ్ణుంచి వచ్చావు ?

నేను : (ఏడ్చి) బంగళానుంచి.

హుసేనీ : బంగళా ఎక్కడ ? ఖానమ్‌ను అడిగింది.

ఖానమ్ : ఓహో....పసిపాపవే. ఫైజాబాదును బంగళా అనికూడా అంటారు.

హుసేనీ : మీ నాన్న పేరు ? నన్నడిగింది.

నేను : జమేదారు.

ఖానమ్ : నువ్వొక పిచ్చిదానివి. పసిపిల్ల. దానికేం తెలుస్తుంది ?

హుసేనీ : నీ పేరు ?

నేను : అమీరన్.

ఖానమ్ : ఈ పేరు నాకు నచ్చలేదు. నేను ఉమ్రావ్ అని పిలుస్తాను.

హుసేనీ : విన్నావా అమ్మాయీ ! ఉమ్రావ్ అని పిలిస్తే పలకాలి. అమ్మగారు "ఉమ్రావ్" అన్నప్పుడు "జీ" అనాలి. ఆరోజు నుంచీ నేను "ఉమ్రావ్" అయిపోయాను. కొంతకాలం తరవాత వేశ్యల లెక్కలోకి వచ్చినపుడు "ఉమ్రావ్ జాన్"ని అయిపోయాను.

ఖానమ్‌గారు చచ్చేవరకూ ఉమ్రావ్ అని పిలిచారు. బువాహుసేనీ ఉమ్రావ్ సాహెబా (గారు) అనేది. ఇదంతా అయింతరవాత బువాహుసేనీ నన్ను తన ఇంటికి తీసికెళ్ళింది. మంచి మంచి పదార్థాలు తినిపించింది. మిఠాయీ తిచ్చింది. ముఖం కడిగించింది. తనదగ్గర పడుకోబెట్టుకుంది.

ఆ రాత్రి అమ్మా నాన్నా కలలో కనిపించారు. నాన్న కొలువు నుంచి వచ్చారు. తమ్ముడు ఆడుతున్నాడు. వాడికి మిఠాయీలు ఇస్తు న్నారు. నేను వేరే గదిలో ఉన్నట్లు నాన్న నన్నుగురించి అడుగు తున్నారు. అమ్మ వంటింట్లో ఉన్నది. ఇంతలో నాన్నను చూశాను. పరిగెత్తుకొని వెళ్ళి చుట్టిపేశాను. ఏడుస్తూ నా కథంతా చెప్తున్నాను.

కలలో ఏడ్చి. ఏడ్పి ఎక్కిళ్ళు వచ్చాయి. బువాహుసేనీ ఓదార్చింది. కళ్ళు తెరిచి చూస్తే ఆ ఇల్లూకాదు వాకిలీకాదు. అమ్మా లేదు. నాన్నా లేడు. బువాహుసేనీ ఒళ్ళో పడి ఏడుస్తున్నాను. బువాహుసేనీ కన్నీరు తుడుస్తూంది. దీపం వెలుగుతూంది. బువాహుసేనీని చూచాను. కన్నీటి పొలుప కనిపించింది.

ఖువాహుసేనీ చాల మంచిది. నా విషయంలో ఎంతో వాత్సల్యం కనబరిచింది. కొద్దిరోజుల్లో అమ్మనూ, నాన్ననూ మరిచిపోయాను. మరిచిపోక చేసేదిమాత్రం ఏముంది? అందుకు కారణం ఒకటి గత్యంతరం లేకపోవడం. రెండవది కొత్త పద్ధతులు, కొత్త జీవితం. తినడానికి రుచికరమైన పదార్థాలు, కలలో సహితం ఎరగని మంచి మంచి బట్టలు లభించాయి. ఆడుకోవడానికి ఖుర్షీద్ జాన్, బిస్మిల్లాజాన్, అమీర్ జాన్. రాత్రింబవళ్ళు నృత్యగానాలు—సంతలు, వనవిహారాలు—అంచని ఆనందం అంటూ లేందే!

మిర్జాగారూ! ఆటపాటల్లో పడి అంత త్వరగా తలిదండ్రులను మరిచిపోయానంటే మీరు నన్ను కఠినురాలు, కృతఘ్నురాలు అనుకోవచ్చు. నా వయసు అప్పటికి చాల తక్కువ. కొత్తకోడలు అత్తవారింటికి వెళ్తుంది. ఒకటి రెండు రోజులయితాక బ్రతికినన్నినాళ్ళూ అక్కడే ఉండిపోవాలని తెలుసుకుంటుంది. అలాగే నాకూ తెలిసిపోయింది. ఖానమ్ ఇంట్లో జీవితాంతం గడపాలని అర్థం అయింది. తోవలో దొంగవెధవలు ఎన్నో బాధలు పెట్టారు. ఖానమ్ ఇల్లు స్వర్గంలా కనిపించింది. తలిదండ్రులను చూడడం అసంభవం అని అర్థంచేసుకున్నాను. అసంభవం అని తెలిసినతరవాత ఆశ నశిస్తుంది. ఫైజాబాదు లక్నోనుంచి 40 కోసులు దూరం మాత్రమే అయినా నాకేదో అనంతమైన దూరంలా కనిపించేది.

చిన్ననాటి ఆలోచనలకూ, ఈనాటి ఆలోచనలకూ ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది.

ఖానమ్ ఉస్తాద్ జీ! ఏమది? రామ్‌కలీలో ఉచ్చారణ ద్యుతం ఆ స్వరమే సరియైంది ద్యుతం కోమలమా శుద్ధమా?

గురువు కోమలం

ఖానమ్ అమ్మాయి ఏ స్వరంలో ఆలపించింది

గురువు శుద్ధం

ఖానమ్ ఎందుకు ఆపలేదు?

గురువు ధ్యాస లేదు

ఖానమ్ ధ్యాస లేదు అందుకే రెండోసారి అనిపించాను అప్పటికి పూల్లాదలేదు ఇదేనా మీరు చెప్పే చదువు? తెలిసినవారిముందు ఇలాగే పాడితే నా నోట్లో ఊయరూ?

గురువుగారు తలవంచారు మాల్లాడలేదు మౌనంలో ఉంచు కున్నారు ఉస్తాద్ జీ తమను నానక్ గా భావించేవారు వాస్తవంగా వారి ప్రతిభ అలాంటిది ఖానమ్ గద్దింపు పహించలేకపోయారు

ఒకనాటి వృత్తాంతం సుని పాడుతున్నాను ఖానమ్ కూడా ఉన్నారు నేను ఉస్తాద్ జీని అడిగాను గాంధారం కోమలమా? అతి కోమలమా? అని

గురువు అతికోమలం

ఖానమ్ ఖాఁ సాహబ్! మాషా అల్లా! (అయ్యో) నా మొండే?

గురువు ఏం?

ఖానమ్ పన్నే అడుగుతున్నారా ' సోహ ' లో గాంధారం అతి కోమలమా? చెప్పండి మీరే

గురువు గాంధారం కోమలం నావాలి

ఖానమ్ ఒప్పుకున్నారా? అతికోమలం అనేగా అమ్మాయికి తప్పు చెప్తున్నారు? ఖాఁ సాహెబ్! గొంతు తప్పు చేస్తే చెవులు వస్తే పోయి నేను మాహూలవాళ్ళదగ్గిర నేర్చుకున్నానసుకుంటున్నా రేమో! మియా గులామ్‌రసూల్ ఖాఁ పేరు వినేఉంటారు ఇవన్నీ

మీకు చెప్పి ఏం ప్రయోజనం" చెప్పాలనుకుంటే మనసుంచి చెప్పండి లేదా క్షమించండి వేరే ఏర్పాటు చేసుకుంటాను అమ్మాయిలను మాత్రం నాశనం చేయకండి

గురువుగారు 'మంచిది' అని లేచి వెళ్ళిపోయారు వారం రోజుల వరకు తిరిగి రాలేదు ఖానమ్ స్వయంగా చదువు చెప్పారు ఖలీఫాజీ మధ్యవర్తిత్వంతో తగాదా పరిష్కరించబడింది గురువుగారు సరిగా చెప్పసాగారు చెప్పక ఏంచేస్తారు గురువుగారు ఖానమ్ ఈ ఇద్దరిలో ఎవరు ఎక్కువ విద్యావంతులో ఇప్పటికి అర్థంకాలేదు ఖానమ్ కొన్ని విషయాలు చెప్పేది గురువుగారిని అడిగితే చెప్పలేకపోయేవారు వారికి తెలియదా ? తెలిసీ చెప్పరా ! ఇది సతమతం అయినా గుట్టు బయటపెట్టే వారు కారు సంగీతం విషయంలో నాకు శ్రద్ధ ఎక్కువైంది ఏమాత్రం సంశయం వచ్చినా అడిగేదాన్ని ఉస్తాద్ జీ దార్లించేసేవారు వారు లేనప్పుడు ఖానమ్‌ను అడిగేదాన్ని నా శ్రద్ధను చూచి చాలా సంతోషం చేది బిస్మిల్లాను తిట్టిపోసేది బిస్మిల్లా విషయంలో చాల కృషిచేసింది కాని టప్పా ఠుమ్రీ తప్ప ఏమీ రాలేదు ఖుర్షీద్ గొంతు మంచిదికాదు రూపంలో అప్సరస గొంతు పగిలిన వెదురుబొంగు నాట్యం బాగా చేసేది నేర్చిందికూడాను అదే ఆమె కచ్చేరీ అంతా నాట్యమే ఒకటి రెండు పాటలు పాడేది పేరుకు

ఖానమ్ వేశ్యల్లో బేగాజాన్‌ది సంగీతంలో అందెవేసిన చేయి కాని ముఖం ! రాత్రికి చూస్తే దడుచుకోవాల్సిందే రొట్టెలపెంకు మసూచి మచ్చలు ఎరుపు కళ్ళు. చట్టి ముక్కు లావు పెదవులు పెద్దపెద్ద పళ్ళు పైగా పొట్టి. కానిగొంతు ! పాట పాడ్తే అమృతం కురిసేది "మూర్ఛన" ఆమె పాడగానే వినాలి నేను ఆమె గదిలో ప్రవేశిస్తే ప్రాణం తీసేదాన్ని అది చెప్పమనీ. ఇది చెప్పమనీ

నేను ఒక్కసారి సరిగమలు అనరూ ?

బేగా విను సా రి గ మ ప ద ని

నేను ఊఁ హూఁ అంతేనా శృతులు వేరుచేసి చూపాలి

బేగా చాల సతాయిస్తావు మీ గురువును అడుగకూడదు ?

నేను ఊహూ మీరే చెప్పాలి

బేగా   సా రి గ మ ప ద ని
       4 3 2 4 4 3 4

చూశావా ఇరవై రెండు అయినాయి

నేను   (కొంటెగా) అయ్యో వినలేదు మళ్ళీ

బేగా   అవను

నేను   అనిపించండే కదలను

బేగా   (మళ్ళీ అనేసింది) విను ఇక సతాయించకు

నేను   ఇప్పుడు సరిగ్గా ఇరవై రెండున్నాయి

బేగా   సరే వెళ్ళు రేపు రా

నేను   తంబూరా తెస్తాను ఒక్క పా

బేగా   ఏం పాడాలి?

నేను   ధన్యాసి

బేగా   ఏం పాడాలి? అస్థాయీ, ధ్రుపద్ తరానా?

నేను   ధ్రుపద్ పాడండి

బేగా   సరే విను

తన్ కీ తప్‌తప్ హై మిటే జబ్ ప్యార్ కా దృష్టిభర్ దేఖ్ లూఁ
జబ్ దర్శన్ పావూఁగీ ఉస్‌కీ తప్ హై జనమ్ అప్నా దేఖూఁగీ
అష్టజామ్ మోహీపా కో రహత్ హై వహాఁ సే కబ్ దర్శన్
సిఘూంగి
జో కో ప్రభూ ప్యార్ సే మిలాదే వాకే పాయన్ మే సీస్ టేకోఁగి

ఖానమ్‌జాన్ వేశ్యలకు ఆటపాటలేకాక చదువు నేర్పే బడికూడా ఉండేది మౌల్వీ సాహెబ్ కొడుకు మామూలు ప్రకారం నేను బడికి వెళ్లాను కాంతివంతమైన వదనం తెల్లని కత్తిరించిన గడ్డం సన్యాసుల్లాంటి దుస్తులు వ్రేళ్ళకు వైడూర్యపచ్చపు నీలిపచ్చపు ఉంగరాలు. వెండి పొన్నుగల అందమైన వంకర కర్ర ఒక చేతిలో జపమాల పట్టమంచు తప్ప ఇప్పటికీ ఆ రూపం కళ్ళముందున్నట్లుంటుంది

ఎంత నిష్కల్మషులు మనుషులు! మంచి హృదయం! అలాంటి ఖువా హాసేనీతో ఆకస్మికంగా ఏదో జరిగిపోయింది దాన్ని చెప్పేందుకు వీల పడ్తారు. ఖువాహాసేనీ సైతం వారిని భర్తగా భావించేది—వాళ్ళు [illegible] ముసలివాళ్ళు చమత్కారంగా మాట్లాడుకునేవాళ్ళు వారి మాటలు యువకు లకుసైతం ఉత్తేజం కలిగించేవి ఇల్లు ఎక్కడో [illegible] దేవు డిచ్చిన భూమి ఎక్కువ ఉన్నాయి భార్య పెద్దపెద్ద బిడ్డలు ఉన్నారు విద్యార్థులై ఎక్కడెక్కడో ఉంచేశారు ఇక్కడే ఉండిపోయారు ఖువాహా మూడు నాలుగుసార్లు ఇంటికి వెళ్ళుతుంటారు మిత్రులు బంధువులు ఇక్కడికే వచ్చేవారు ఇంటినుంచికూడా ఆప్ ఇఫీ వస్తుండేవి నా మ పది రూపాయిలిచ్చేవారు అది ఖువాహాసేనీ చేతికి ఇచ్చేవారు వంటి బ్రాగుడు వాళ్ళు ఎల్లమంది ఖువాహాసేనీ సమకూర్చేది ఇంటి బాధ్యత ఖువాహాసేనీది లెక్కలు లేవడం, ఖర్చుపెట్టడంకూడా ఆమే చేసేది ఖానంగారికికూడా మౌల్వీ సాహెబ్ అంటే ఎంతో గౌరవం వారిమూలాన ఖువాహాసేనీనికూడా గౌరవించేది

నా పోషణబాధ్యత ఖువాహాసేనీ వహించిందని చెప్పాను అందు వల్ల మౌల్వీ సాహెబ్ నా విషయంలో ప్రత్యేక శ్రద్ధతీసుకునేవారు విశేష వాత్సల్యం కనబరచేవారు వినయవిధేయతలు ప్రత్యేకం ఇతరుల విష యంలో నా విషయంలో కట్టుదిట్టాలు ఎక్కువగా ఉండేవి పాషాణం లాంటి నన్ను మనిషినిగా తయారుచేసింది వారే వారి పాదముల అను గ్రహంవల్లనే ఎంత పెద్ద అమీర్ల అధికారుల గోష్ఠికి వెళ్ళినా నా అంతస్తు కంటే ఎక్కువ గౌరవం లభించింది వారి దయవల్లనే ఇలాంటి విద్యా వంతుల సమావేశాల్లో పెదవి కదిపే ధైర్యం వచ్చింది రాజుల దర్బారు లలో పాల్గొనే అదృష్టం లభించింది గొప్పగొప్ప బేగముల సౌధాల్లో ప్రవేశం కలిగింది

మౌల్వీ సాహెబ్ ఎంతో శ్రద్ధతో నన్ను చదివించారు "అలిఫ్ బే" అక్షరాలు పూర్తిఅయినంతరవాత 'కరిమా'. "మహమూద్ నామా" 'వర్నేరవాం' చదివించి "అహమద్ నామా" కంఠోపాఠం చేయించారు తరవాత గులిస్తాం ప్రారంభించారు రెండు పాఠాలు చదివించి నోటికి జ్ఞాపకం చేయించేవారు ప్రతిపద్యానికి ప్రతిపదార్థ తాత్పర్యాలు చెప్పేవారు. చదవడం, వ్రాయడం విషయంలో కష్టపడ్డాను ఉచ్చారణ విషయంలో శ్రద్ధచేశారు. ఉత్తరాలు వ్రాయించారు, గులిస్తాం తరవాత పారశీక పుస్తకాలు లెక్కలు ప్రారంభమైనాయి. కొంత అరబ్బీ. కొంత తర్కం చదివాను [illegible] మౌల్వీ సాహెబ్ దగ్గర చది

ఒక కుర్రాణ్ణి అడిగి పంజరం తెప్పించేవాడు మాతతీసి పక్షులను ఎగిరేసేవాడు తల్లి విసిగిపోయింది మసీదులో ఉండే పంతులుదగ్గర కూర్చుంటపెట్టింది అక్కడా ఆ వ్యవహారాలు విరుపలేదు ఒళ్ళో పిల్లలనందరినీ ఏడిపించేవాడు ఒకని చొక్కాలో కప్పను ఎగిరేసేవాడు ఒకని టోపీ లాక్కునేవాడు ఒక అమ్మాయి బూటుతీసి నూతిలో వేశాడు

ఒకరోజు పంతులుగారు నమాజు చేస్తున్నారు ఈ కొంటెకోణంగి వారి కొత్తబూటు నీటితొట్టిలో వేశాడు అది తేలియాడుతుంటే తమాషా చూస్తూ కూర్చున్నాడు పంతులుగారి వళ్ళు మండింది నాపటాదారు చెంపదెబ్బలతో ముఖం ఎర్రపడింది చెవిపట్టి అమ్మా ఇంటికి లాక్కుపోయారు వాకిట్లో నుంచుని తల్లీ! ఇదిగో ఓ పుత్రుడు! వీడికి నేను చదువు చెప్పలేను అని పెద్దగా కేకవేసి చెప్పి కుర్రాణ్ణి అక్కడే వదిలి వెళ్ళిపోయారు గోహర్ మిర్జా పెద్దగా ఏడుస్తూ ఇంట్లోకెళ్లాడు లోపల బువాహుసేనీ అమ్మాతో మాట్లాడుతోంది గోహర్ మిర్జా చేష్టలు ఆవిడకేం తెలుసు అతని స్థితిచూచి జాలిపడింది పంతులుగారిని ఎన్నో మాటలు అనేసింది

బువాహుసేనీ ఏరేం పంతులా కసాయివాడా! అయ్యో! ముఖం వాచేట్టు కొట్టేవాడు ఇదిగో చెంపలు కూడా ఎర్రబడినాయి తల్లీ! ఇలాంటి పంతులుదగ్గర చదివించే రాతను ఎందుకమ్మా! మా మౌల్వీ సాహెబ్ కూడా చదువు చెప్తారు అయ్యో పాపం ఏదో అదిరించి బెదిరించి చెప్పాలి గాని—ఇలాగా

అమ్మా అయితే — మౌల్వీగారి దగ్గరికే తీసికెళ్ళమ్మా! పీడ వదిల్యాం ఉంటుంది

బువాహుసేనీ మంచిది తీసికెళ్తా నాని వాళ్ళ ముఖం।

అమ్మా ఉదయం — అబ్బాతో పంపిస్తాను సాయంకాలం అతని వెంటనే వచ్చేస్తాడు

బువాహుసేనీ అయితే పంపించు

మౌల్వీగారిని అడగవలసిన పనిలేకుండాను ఈమె ధర్యాన్ని నిర్ణయించింది మౌల్వీగారు కాదనరని తెలుసు ఆమెకు

రెండవరోజు బువాహుసేనీ అబ్బ అటెండెన్స్ ఉదయాన్నేతోసహా గోహర్ మిర్జాను వెంటపెట్టుకొని బువాహుసేనీ ఇంటికి వచ్చాడు బువా

మానేసి ఒకాయి నుంచి ఉమ్రావ్‌ని ఖాన్సాగారింట్లోకి తీసుకువచ్చిపెట్టింది.

గోహర్‌మిర్జా ఎన్నో ఏడ్పులు ఏడిపించేవాడు. ఖాన్సాగారు ఎంత తిట్టినా కొట్టినా కొంటెతనం మానలేదు. అలా ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. ఆఖరికు మా ఇద్దరికీ సంధి కుదిరింది. అంటే నేను సతాయింపుకు అలవాటుపడిపోయానని అర్థం.

గోహర్‌మిర్జా వయసులో నాకంటే ఒకటి రెండు సంవత్సరాలు పెద్ద కావచ్చును. అప్పటికే నాకు పదమూడేళ్ళు, అతనికి పద్నాలుగు, పదిహేనేళ్ళు ఉండవచ్చు. నాకు గోహర్‌మిర్జా సతాయింపు ఒకవిధంగా మధురంగా తోచేది. ధ్వని ఎంతో బావుండేది. పాటకత్తె సంతానం కావడాన లయ స్వతస్సిద్ధంగా వచ్చేసింది. కంఠం ఎత్తాడంటే వినేవారు బొమ్మలు కావలసిందే. నాకేమో లయ, స్వరం వచ్చిందేగా, ఖాన్సాగారు లేనప్పుడు ఇల్లా: నేను పాడేదాన్ని, అతడు తాళం వేసేవాడు. ఒక్కొక్కప్పుడు అతడు పాడితే నేను తాళం వేసేదాన్ని. గోహర్‌మిర్జా పాటంటే వేశ్యలు పడిచచ్చేవారు. ప్రతిగదికి పిలుచుకునేవాళ్ళు. అతనితో నేనుండటం తప్పనిసరి. నేను లేకుంటే సంగీతం రాణించేది కాదు.

అందరినీ మించి అతనంటే అమీర్ పడిచచ్చేది.

మిర్జాగారూ! మీకు అమీర్‌జాన్ గుర్తుండవచ్చు.

గుర్తుంది చెప్పండి అన్నారు రుస్వా.

"అమీర్‌జాన్ అప్పుడు ముక్కుపచ్చలారని రోజుల్లో ఉండేది. ఆమె వర్ణం. మిసమిసలాడుతున్న యౌవ్వనం. చంపకంలాంటి మేను, అహా ఏమి వర్చస్సు. మోహింపచేసే అందం, ఆ చురుకు, ఆ మెరుపు, ఎంతెసి చూపులు, నాజూకైన చేతులు కాళ్ళు. భగవంతుడు అందాన్ని మూసలో పోసి తయారుచేశాడనుకోండి."

రుస్వా: నేను చూచే సరికి ఆమె అందం హరించిపోయింది. ఆరేసిన బట్టలా ఉండేది. చూడలేనంత వికారం వచ్చేసింది.

ఉమ్రావ్: ఎప్పుడు చూశారు?

రుస్వా: వాళ్ళ ఇంట్లోనే. ఆ గదిలోంచి "షాహ్ సాహెబ్" పేరు హిసాబు ఖాతాలు పట్టుకొని కూర్చుని ఉండేవారు. ఎవరైనా కనిపిస్తే సలాము చేసేవారు. ఎన్నడూ ఎవరితోనూ మాట్లాడి ఎరుగరు.

రుస్వా: హాస్యానికి రాత్రంతా మిగిలిఉంది. మీ కథ చెప్పండి ముందు.

ఉమ్రావ్: అచ్ఛా. వినండి.

ఉదయంనుంచి పదకొండు గంటలదాకా మౌల్వీగారిదగ్గరనుంచి కదిలే ధైర్యం ఉండేదికాదు ఎవరికీ. ఆతరువాత మౌల్వీగారు భోజనానికి వెళ్ళేవారు. అప్పుడు విశ్రాంతి. మేము ఒక్కొక్క గదికి వెళ్ళేవాళ్ళం. ఈరోజు అమీర్‌జాన్ గది. రేపు జాఫ్రీ గది. ఎల్లుండి బిబ్బన్‌పద్ద. ఎక్కడికి వెళ్ళినా కావలసినంత మర్యాద. పండ్లు. మిఠాయీలు. హుక్కా, పాన్.

రుస్వా: అయితే మీరు చిన్నప్పటినుంచే హుక్కా పీల్చేవారా?

ఉమ్రావ్: జీహాఁ. గోహర్‌మిర్జాను చూచి నాకూ ఇష్టపుట్టింది. [1]'షోఖియా' వాడేదాన్ని. తరవాత 'నగోరీ' అలవాటైంది.

రుస్వా: గోహర్‌మిర్జా మహాశయుడు "చందూ" కూడా తాగేవాడు. మీకు అందులోకూడా ప్రవేశం........?

ఉమ్రావ్: భగవంతుడు నేటివరకు దానినుండి రక్షించాడు. నిజం. నల్లమందు తోడు. ప్రామిసు. అదికూడా ఈమధ్యనే ప్రారంభించాను. పూజ్యమైన [1]కర్బలాకు వెళ్ళివచ్చినతరవాత చచ్చే జలుబు చేసింది. ఊపిరాడని పరిశం. వైద్యుడు నల్లమందు తినమన్నాడు.

రుస్వా: అదేం జలుబుకు మంచిదా?

ఉమ్రావ్: ఆ మాట మరి చెప్పకండి.

రుస్వా: ఏమి, అలవాటైపోయిందా?

ఉమ్రావ్: చాల కాలంనుంచి.

వలదు వలదని ఒట్టేసుకొంటి, కాని
కలవీ గుండెగూడులో కోటి కోర్కెలు!

---

[1] షోఖియా, నగోరీ, చందూ- నల్లమందులను వివిధరూపాలలో సేవించడం.

[1] ఇరాక్‌లో పడమటి ఎడారితీరాన గల ప్రముఖ నగరం. క్రీ.శ. 680 లో ఈ ప్రదేశంలో షియా, సున్నీ అను రెండు మహమ్మదీయ తెగలకు భీషణ సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో షియాల నాయకుడు "హుసేన్" హత మార్చబడినాడు. అప్పటినుంచి అది షియాలకు పవిత్రస్థలం అయింది.

అతి ఒప్పేయించుకొమ్ము, కాని
ఒక్క చషకం మద్య మిప్పించి పొమ్ము!

రుస్వా: ఎంత చక్కని పద్యం! ఒట్టు పెట్టించడానికి నేనున్నాను. త్రాగడం, త్రాగకపోవడం మీ ఇష్టం.

ఉమ్రావ్: తాముకూడా సేవిస్తే.

రుస్వా: తౌబా (పశ్చాత్తాపసూచకంగా చెంపలు వేసుకోవడం)

ఉమ్రావ్:
నీలిమబ్బు రారాదె.
మలయానిలం పారాదె.
మధురస్మృతుల గోల చెలరేగ లోలో!

రుస్వా: ఆ విషయం ఎత్తకండి. ఆపులింతలు వస్తున్నాయి.

ఉమ్రావ్: సరే. పోనివ్వండి.

రుస్వా: హాస్యానికికూడా ఆ విషయం ప్రస్తావించకండి.

ఉమ్రావ్:
జ్ఞాపకం వస్తే రానీ.
దానిజోలికి పోనేపోను!

రుస్వా: ఒహోహో! ఉమ్రావ్‌జాన్! బాగా చెప్పారు!

ఉమ్రావ్: తస్లీం (స్వీకరించాం)

రుస్వా:
ప్రేమికు లిట పెనునిద్దుర పోలిరి చెలీ!
లాలా, గులాబులు గుర్రొస్తున్నాయ్ పడేపడే!

ఉమ్రావ్: జోరుగా ఉందే. పడుచుదనపు ప్రస్తావన ప్రభావమేమో?

రుస్వా: కాదు. మదిర ప్రస్తావన ప్రభావం.

ఉమ్రావ్:
ఓ విద్యాగరిష్ఠ! నీకు శత్రువులు
మగువ మదిర మాకు పరమమిత్రులు!

రుస్వా: ఓహో ఎంత బాగా చెప్పారు.

మరతునని మక్కాలో ఒట్టేశాను!
మరలి దారితప్పి, ఒట్టే మరచాను!
వలపు, మదిర, జ్ఞాపకం వస్తే రానీ!

ఉమ్రావ్ — ఎంత బాగా చెప్పారు రుస్వాగారు, మక్కానుండి మరలి

రుస్వా — వెరతునని మక్కాలో ఒట్టేశాను ।
మరలి దారితప్పి ఒట్టె మరచాను ।
వలపు మదిర జ్ఞాపకం వస్తే రానీ ।

ఉమ్రావ్ — బావుంది

రుస్వా — హంస నడల — నీ నెనకు
లేడి కనుల — నీ వనకు
వెల్లువలా జ్ఞాపకం వస్తే రానీ ।

ఉమ్రావ్ — బాగానే ఉంది

రుస్వా — ఈ కవిత వింటే

గంధానిలం ఉండాలి
కరిమబ్బులు ఉండాలి
వర్షపు తోట నిచ్చిన మద్యం ఉండాలి
వగలబడే వయోమదనం ఉండితీరాలి ।

ఉమ్రావ్ — వాహ్ మిర్జాగారూ । చంపేశారు సరే మొత్తంమీద అలాగే చాల సంవత్సరాలు ఖానమ్ ఇంట్లో గడిచిపోయాయి ఈలోగా వివరించదగిన విషయం ఏదీ జరగలేదు ఆ జ్ఞాపకం వచ్చింది బిస్మిల్లాకు సంబంధించిన "మిస్సీ"[1] ఉత్సవం ఎంతో ఆడంబరంగా జరిగింది నాకు తెలిసినంతవరకు నాటినుంచి నేటివరకు అలాంటి ఉత్సవం రాజుల ఇళ్ళల్లోకూడా జరుగలేదు దిలారామ్ బారాదరీ (నలువైపుల పన్నెండు ద్వారాలు గల మహాసౌధం) ఈ ఉత్సవం కోసం అలంకరించబడింది దీపాలంకరణ జరిగింది పట్నపు వేశ్యలు గాయనీ, నర్తకీమణులు కాశ్మీరపు భట్లు వచ్చేరారు మారుప్రాంతాలనుంచి భోగం మేళాలు పిలిపించబడినాయి. ప్రఖ్యాత సంగీత విద్వాంసులు ఢిల్లీనుంచి వచ్చారు వారం రోజులు రాత్రిం బవళ్ళు ఆటలు, పాటలు । ఉదారంగా ఖర్చుచేసింది ఖానమ్ ఎన్నో దానధర్మాలు చేసింది వాటి కీర్తి నేటికీ మాయలేదు బిస్మిల్లా ఖానమ్ ఒకే కూతురు ఏ లోటూ రానివ్వలేదు నవాబ్ ఉమ్దా అల్లాఖాంబేగమ్ గతించారు నవాబ్ ఛబ్బన్‌గారు వారి ఆస్తికి

---

[1] యువతిక — వృత్తిప్రవేశోత్సవము

వారసులయ్యారు సవాబ్ జాదా (పిల్లనవాబు) వయసుకు చాల చిన్నవాడు ఆ భగవంతునికే తెలియాలి ఖానుమ్ ఎన్ని మాయ వేషాలు వేసిందో! నవాబును బుట్టలో వేసుకుంది పాపం నవాబు చిక్కిపోయాడు ఆతని డబ్బు ఇరవై అయిదు ముప్పయి వేలు ఈ ఉత్సవానికి ఖర్చయింది తరవాత బిస్మిల్లా నవాబు కొలువులో చేరిపోయింది ప్రాణంతో సమానంగా చూచుకునేవాడు

మిర్జాగారూ! మీరు అడిగినవాటన్నింటికీ సమాధానాలు చెప్పటం కష్టం భోగంవాళ్ళకు సిగ్గు లజ్జ ఉండవనేది నిజం అయినా కాలం బలీయం అయింది

వయసుకూడా ఒకటి ఉంది మాతంతి యవ్వనోద్రేకంలా హద్దులు గుర్తుంచవు వయసు ఉడుగుతుంటే అవికూడా ఉడిగిపోతాయి తప్పదు ఎంతయినా వేశ్యలది స్త్రీజాతి అనే విషయం మరువరాదు అలాంటి విషయాలు అడిగితే మీకేం ప్రయోజనం?

రుస్వా నేను అడుగుతానంటె ఏదో ప్రయోజనం ఉండటంవల్లనే మీరు చదువురానివారైతే ఇలాంటి విషయాలు వినిపించడానికి అభ్యంతరం ఉండాలి విద్యావంతులకు ఇంత సిగ్గు పనికిరాదు

ఉమ్రావ్ అయితే విద్యావంతుల సిగ్గు జారిపోతుందా?

రుస్వా అచ్ఛా అచ్ఛా వృధా మాటల్తో నా కాలాన్ని నష్టపరచకండి

ఉమ్రావ్ పత్రికల్లో వేయిస్తారా ఏం?

రుస్వా మరేమనుకున్నారు?

ఉమ్రావ్ హాయ్ అల్లా! నన్నుకూడా మీలాగే రుస్వా (అపవాదుల పాలు) చేస్తారా?

రుస్వా మీరు నాతోపాటు రుస్వా అయితే వచ్చే హాని లేదు

పలుపులుట్టుట చెప్ప నేరవిదానా!
రుస్వా పరిచయానికి తహతహ లేలనే!
చూడు, నిన్నిక రుస్వా పాలు
చేయక వదలను! వదలను!

ఉమ్రావ్ : ఛీ. మిమ్మల్నెవతె ప్రేమిస్తుంది?

సాధువుతోనైన, భోగిసన్యాసితోనైన
హాస్యః ప్రేమాయణమే పల్లించువాడు సదా!

రుస్వా : ఎవరి కవిత?

ఉమ్రావ్ : ఎందుకడుగుతారు? అర్థం అయింది. ఈ గజల్ విన్నారా?

వలపుసంచిలో ఉసురు అమ్మవచ్చాను,
ఐనా, అందాన్ని చేరమాడక మానను!

రుస్వా : ఆ కవిత గుర్తుందా "దగాదా లేకుండా"

ఉమ్రావ్ : సర్వం ఇస్తానని పాడువాగ్దానమియ్యని,
పట్టి పిండినతప్ప ఇసుమంత జార్చని మోసకారి!

రుస్వా : ఇంకేమైనా కవిత జ్ఞాపకం ఉందా?

ఉమ్రావ్ : గుర్తు రావడంలేదు.

రుస్వా : ఇది చాల పెద్ద గజల్. చూడండి. ఎక్కడైనా పడిఉందేమో! కనిపిస్తే నాకు చూపించాలి.

ఉమ్రావ్ : వారితోనే తెప్పించుకోకూడదూ?

రుస్వా : స్వయంగా వెళ్ళి వ్రాసితెచ్చుకోవాల్సిందే. వారుమాత్రం వ్రాసి ఇవ్వరు.

ఉమ్రావ్ : అలాగా?

రుస్వా : జీహాఁ. మీకు తెలీదు. చిత్తువ్రాయడంతప్ప ఎత్తివ్రాయడం తెలీదు. ఒట్టు.

ఉమ్రావ్ : ఒకరోజు మీరు, నేనూ వెళ్దాం. ఇంకో పద్యం గుర్తుకు వచ్చింది.

అపనిందల పాలైతి,
అలపుటించిపోయితి,
అందరితో నా ముచ్చటలే
గుసగుసలాడును వాడు!
వినండి.

ప్రేమించి వదరాని పలుపాట్ల పాలుజేసి
కడకు అపనిందల పాల్జేసి ముంచివేయు :

రుస్వా : ఇలాంటి గజల్ నాదికూడా ఉంది. ఏమైందో తెలీదు. మకుటం మాత్రం గుర్తుంది.

ఉమ్రావ్ : మకుటం : అయితే వినిపించండి.

రుస్వా :
వలపు ముచ్చట చెప్ప నేరవిదానా :
రుస్వా పరిచయానికి తహతహలేలనే :
చూడు, విన్నిక రుస్వా పాలు
చేయక వదలను : వదలను :

ఉమ్రావ్ : అమోఘంగా ఉంది. మీ [1]తఖల్లుస్ ప్రభావం చూపింది.

రుస్వా : తఖల్లుస్ విషయం తీశారండి. ఒక ఉదారుని ఉదారతతో నగరంలో చాలమంది రుస్వాలున్నారు. జనులు అనవసరంగా మంచి మంచి తఖల్లుసులు వదిలి నిష్కారణంగా రుస్వా అయిపోతున్నారు. కాకుంటే ఏమిటీ చిత్రం. పేర్లుకూడా మార్చుకోవాలా ? మంచిదే. ఇంగ్లీషువారి ఆచారం ప్రకారం తండ్రికొడుకుల పేర్లు ఒకేరకంగా ఉంటాయి. వీరంతా నాకు ఆత్మసంతతి. సంతతి ఎంత పెరుగుతే నా పేరు అంత వెలుగుతుంది.

ఆ చర్చ ఇప్పుడెందుకుగాని నేను అడిగిన విషయం చెప్పకపోవుదు.

ఉమ్రావ్ : ఏమిటి బలవంతం : సిగ్గుపడేటటువంటి మాటలు అడుగుతారు.

రుస్వా : పెండ్లిళ్ళల్లో పాడే బూతుపాటలకంటే సిగ్గుపడేటటువంటి విషయమా ?

ఉమ్రావ్ : మీ లక్నోలో వేశ్యలు బూతులు పాడరు. పాటకత్తెలు పాడ్తారు. అదీ స్త్రీలగోష్ఠిలో. పెద్ద భోగంవాళ్ళు పురుషుల ముందు కూడా పాడాల్సివస్తుంది. మర్యాదగా : పద్ధతిగా. పట్నంవాసీ ఈ ఆచారం మాత్రం మంచిదికాదు.

రుస్వా : మీరు కాదంటే ఆగుతుందా ? మేము ఈ కళ్ళతో చూశాం. ఈ చెవులతో విన్నాం. మహామహా మగవాళ్ళుసైతం ఆడవాళ్ళలో మారి ఆనందంగా తిట్లుతింటారు. తల్లులనూ. అక్కచెల్లెళ్ళను

[1] ఉర్దూ కవులే స్వంతపేరుకాక కవిత్వానికి ఒకటి ఎంచుకోవడం ఆచారం. దాన్ని తఖల్లుస్ అంటారు.

తిప్పుకున్నా అనుకుంటాను. ముఖాలు వేలు ఎదురౌతాయి. అల్లా ఈ రోజులు చూపించాడు. చూపించకుంటే ఎంతో బాగుండేది. పెళ్ళిళ్ళలో రాత్రింబవళ్ళు ఈ సిగ్గుదేశాలు జరుగుతాయి. పతివ్రతలైన పడుచులుంటే ఇల్లాంటివి జరుగుతుంటాయి. పోనీండి ఆ పర్వం. మీ కథ చెప్పండి. మేమేమీ సంస్కృతిలం రాసు వినిపించడానికి.

ఉమ్రావ్ : వంతం విడుచుడు. సరే వినండి.

బిస్మిల్లా మిస్సీ ఉత్సవమూ, ఖుర్షీద్‌జాన్, అమీర్‌జాన్ గార్లు చూశాను. నా హృదయంలో కొత్తకొత్త కోర్కెలు చిగిరించాయి. ఒక ప్రత్యేక ఉత్సవం తరవాత బిస్మిల్లా, బిస్మిల్లాజాన్ అయింది. ఖుర్షీద్, ఖుర్షీద్‌జాన్ అయింది. తిరిపెం పట్టా పొందింది. స్వాతంత్ర్యం లభించింది. నాతో పనిపోయారు. ఇప్పుడు వారు కొందరు మాత్రం చూడసాగారు. పురుషులతో నవ్వులాటలూ, హాస్యమూ సాగించారు. వారివేళ గదులు అలంకరించబడినాయి. గచ్చుమీద రత్నకంబళాలు, దానిమీద పంచం. నగిషీ పక్కాకుల పెట్టె, అలంకార పేటిక, బట్టల పెట్టె. గోడలకు వగల్‌దాన్, నిలువుటద్దాలు. మంచిమంచి పటాలు. కప్పుకు గాజుబుగ్గలు. వాటిలో సాయంకాలం కాగానే వెలిగించే దీపాలు. ఇద్దరిద్దరు దాసీలు. ఇద్దరిద్దరు పనివాళ్ళు చేతులు కట్టుకొని నుంచోటం తమాషాగా ఉండేది. నవాబుల పుత్రులు, అందమైన యువకులు విలాసాలకు చేరేవారు. వెండి హుక్కా ఎప్పుడూ పక్కనుండేది. ఎదురుగా మూత తెరిచిన పక్కాకుల పెట్టె. ఆకులకు సున్నం రాచి అందిస్తుండేవారు. సందడి. రేయింబవళ్ళూ జనం "బిస్మిల్లా" అనేవారు. కదిలితే వేలమంది చూపులు పరచేవారు. ఆ బొంగసాని లక్ష్యమే చేసేదికాదు. ఆమె మహారాణి. పెదవి కదిపితే వానలిస్తుంది ప్రత్యక్షం. అడుగకుండానే గుండెలు అరచేతిలో పెట్టి అందించేవాళ్ళు. కొందరు ప్రాణాలు అర్పించడానికి సైతం సంసిద్ధులు. అయినా లెక్కలేదు దానికి. ఏ బహుమానానికీ విలువలేదు. రాణీగారికి ప్రాణాలు అమూల్యాలు కావు. నిర్మాల్యాలు. రాజ్యాన్ని కాలదన్నేంత దర్పం. తొలగని గర్వం. అయినా తొలగించేవారు తొలగిస్తారు. ప్రాణాలు తీసే హొయలు. అయినా పోయేవారి ప్రాణాలే పోతాయి. క్షణంలో నవ్వించడం. క్షణంలో ఏడిపించడం. ఒకరి ఎద వడికిట్లో నలుగుతూంది. ఇంకొకరి గుండె కాలికింద అణుగుతూంది. మాటకు కోపం. మూతి ముడిచింది. ఓదారుస్తున్నారు జనం. ఒకరు చేతులు జోడిస్తున్నారు. ఒకరు బ్రతిమాలుతున్నారు. మాట ఇచ్చి మరచింది.

ఒట్టు పెట్టుకొని నిడిచింది గోష్టిలో అందరి చూపులూ ఆమెమీదే ఆమె కన్నెత్తి చూడదు ఆమె చూపు తిరిగితే జనం చూపులు తిరుగుతాయి వేలమంది చూపులు ఆమెయిరనే జనం ఈర్ష్యతో కాలి చస్తారు ఈమె ప్రాణాన్ని ప్రాణంతో నాటుస్తూంది హృదయం మాత్రం రిక్తం ఏముంది ! అంతా ఉత్తుత్తి వట్టి నటన అమాయకుడు ఎవరైనా వస్తారో ఇంకేముంది చోట్లా

నేనంటే ఆమెకు చాల ఇష్టం
శత్రువులకు మాత్రం శిశిరం

వస్తువుగాక ఆవిడ శత్రువులు చివరకు చంపేసింది అప్పటికి గాని గుండె చల్లబడలేదు పాపం ఇంట్లో ఏడ్పులు ఈమె ప్రియులతో పకపకలు

మిర్జాగారూ! ఆ విషయం నాకంటే మీకే బాగా తెలుసు చెప్ప గలరుకూడా కాని అదంతా చూచి నా హృదయం ఏమైందో నాకే తెలుసు ఆడదానికి ఆడదంటే అంతులేని ఈర్ష్య చెప్పడానికి సిగ్గుగా ఉంది పిలవేవాళ్ళంతా నన్నే పిలవాలనుకునేదాన్ని నన్ను చూచి ప్రాణా లర్పించాలనుకునేదాన్ని కాని ఒక్కడూ కన్నెత్తి చూడడు బువాహుసేనీ ఇంటి గోడలూ కప్పూ పొగచూరి నల్లగా ఉండేవి కుక్కి మంచం అందులో నేనూ బువాహుసేనీ పడుకునేవాళ్ళం గదిలో ఒకపక్క పొయ్యి దానిపక్కనే రెండు కుండలు కళాయి గిన్నెలు రొట్టె పెంకు, పళ్ళాలు, గిన్నెలు చిందరవందరగా పడివుండేవి ఒకమూలకు పిండికుండ దానిమీద రెండు మూడు కుండల్లో పప్పులు, ఉప్పు మసాలాలు పక్కనే వంటచెరుకు రోలు, రోకలి వంట చేసేటప్పుడు ప్రమిద దీపం పెట్టుకునేందుకు పొయ్యికి పైన గోడకి రెండు మేకులు ప్రమిదలో సన్నని వత్తి గుడ్డిగా వెలుగుతుండేది ఆ అందానికి రెండు ఉట్లు ఒకదాన్లో ఉల్లిగడ్డలు రెండవదానిలో చపాతీలు పప్పు, కూరలు మౌల్వీగారికోసం ఈ ఉట్లలో ఉల్లిపాయలది పొయ్యిమీద, రెండవది నా నెత్తిమీదా ఉండేది మంచంనుంచి ఏమాత్రంగా లేచానో కూరగిన్నె నెత్తికి కొట్టుకునేది

ఉదయం తొమ్మిది గంటలదాకా మౌల్వీగారి గద్దింపులు సాయంకాలంనుంచి రాత్రి తొమ్మిది గంటలదాకా మళ్ళీ తిట్లూ తన్నులు ఇదీ మా చదువు అయినా నా చేష్టలు మానలేదు

తొలిసారి అద్దంలో చూసుకోవాలనే కుతూహలం కలిగింది. బువా హుసేనీ కనుమరుగైతే చాలు, బుట్టలోంచి అద్దం తీసి చూసుకునేదాన్ని. నా ముక్కూ ముఖం ఇలా వేళ్ళలతో పోల్చుకునేదాన్ని. నా ముఖంలో వికారం ఏమీ కనిపించేది కాదు. అందరినీ మించిన అందకత్తె ననుకునేదాన్ని. వాస్తవం మాత్రం అది కాదు.

రుస్వా : అయితే మీది కురూపం అనా? ఇప్పటికి ఎంతమందికంటే అందంగా ఉన్నారు. వయసులో ఇంకెంత ఇదిగా ఉన్నారో!

ఉమ్రావ్ : సరే. ఇది పొగడ్తలకు సమయం కాదు. క్షమించండి. అప్పుడు మాత్రం నేను అలా భావించేదాన్ని. అదే నా ప్రాణం మీదికి తెచ్చింది. 'నాలో ఏం లోపం ఉందని ఖుదా నావైపు కన్నెత్తి చూడడు?' అనుకునేదాన్ని.

రుస్వా : ఈ విషయంలో ఎవరిదృష్టి పడకపోవడం ఆశ్చర్యమే. లేదా కాకపోతే "మిస్సీ కాలేదు ఖానమ్ అంటే ఎంతో భయపడేవారు" అందువల్ల వ్యక్తపరచలేదనుకుంటా.

ఉమ్రావ్ : కావచ్చు. కాని అంత విచక్షణ నాకెక్కడిది? తోటివాళ్ళను చూసి ఉడికిపోయేదాన్ని. తిండి విషయంలో విద్ర వాదు. తల దువ్వుకునేప్పుడు ఒక పెద్ద బిస్మిల్లాకు నవాబ్ ఛుట్టన్ స్వయంగా తల దువ్వేవాడు. అది చూసినపుడు గుండెమీద పాములు పాకినట్లుండేది. నాకు తల దువ్వేవారు? ... అనేవారు. ఆవిడను తీరికలేకుంటే చంపి తలతోనే తిరిగేదాన్ని. మొదటు నేనే నేర్చుకున్నాను. పెద్దలు రోజూ మూడునాల్గు బట్టలు మార్చేవారు. ఇక్కడ ఎనిమిది రోజులకు మార్చడానికికూడా గతిలేదు. వారికి ఖరీదైన బట్టలు, ఇక్కడ ఆపే మామూలు దుస్తులు.

బట్టలు మార్చుకుంటే మగవాళ్ళల్లో కూర్చోవాలనిపించేది. ఒక్కొక్కసారి బిస్మిల్లా గదిలో, ఒక్కొక్కసారి అమీర్‌జాన్ గదిలో వెళ్ళేదాన్ని. కాని కూర్చోనిచ్చేవాళ్ళు కారు. వారికి ఉన్న విలాసాలు ... సృష్టి ... పంపించేసేవారు.

కూర్చోనివ్వకపోవడానికి మరొక కారణం ఉంది. ఆ రోజుల్లో నాలో కొంటెతనం ఎక్కువ. పరాచికాలాడేది. ఎక్కడైనా కూర్చున్నా చిటికెలు వేయడం, వెక్కిరించడం, మగవాళ్ళను రామని తిరగడం

ఆ స్థితిలో గోహర్ మిర్జా గొప్పగా కనిపించాడు నాతో చనువుగా మాట్లాడేవాడు పరిహాసా లాడుతు నేవాళ్ళం నేనంటే ఆతని కెంతో ఇష్టం ఉదయం బడికి వచ్చేప్పుడు జేబులో రెండు నారింజకాయలు వేసుకొని వచ్చేవాడు నాకిచ్చేవాడు ఒక్కొకసారి మిఠాయీలు తెచ్చేవాడు తినిపించేవాడు ఎక్కణ్ణుంచి తెచ్చాడో తెలియదు ఒకరోజు రూపాయి తెచ్చిచ్చాడు జీవితంలో వేల రూపాయీలు లెక్కించాను కాని ఆ ఒక్క రూపాయి నాకిచ్చిన ఆనందాన్ని మరువలేను అంతకుముందు నాకు పైసలు చాల దొరికాయి కాని రూపాయి దొరకడం అదే మొదటిసారి దాన్ని చాలకాలంవరకు భద్రంగా ఉంచాను ఖర్చుచేసే అవసరమూ కలుగలేదు ఖర్చుచేస్తే ఎక్కణ్ణుంచి వచ్చిందని అడుగుతారని భయం రహస్యం అర్థం ఆయింది వయసుతోనే ఆ విచక్షణ వస్తుంది నేనా వయసుకు వచ్చేశాను

# 5

నా ప్రక్క పనికిమాలినవాళ్ళు పడి గుర్రుపెట్ట
కొల్లగొనిపోయె నా వలపుమీద కొంత చతురచోరుడు।

వానాకాలం ఆకాశం మబ్బులతో నిండిపోయింది మింటికి మంటికి ఏకధారగా వర్షం కురుస్తోంది ఉరుములు మెరుపులు బువా హుసేనీ గదిలో ఒంటరిగా పడిఉన్నాను ఖానమ్ వెంట బువాహుసేనీ హైదరీ ఇంటికి వెళ్ళింది దీపం ఆరిపోయింది అంధకారం కన్ను పొడుచుకున్నా కనిపించడంలేదు

ఇతర గదుల్లో విలాసాలు ఒకచోట పాటలు ఒకచోట హాస్యాలు నేనో? చీకటి ఒంటరితనం ఏడ్పు దగ్గర ఎవరూలేరు మనసుబాధ మనసుకే తెలియాలి మెరుపు మెరుస్తే దుప్పటి కప్పుకునేదాన్ని ఉరిమితే చెవుల్లో వ్రేళ్ళుపెట్టుకోడం ఈ స్థితిలో కన్ను మలిగింది ఎవరో గట్టిగా చేయిపట్టుకున్నట్లనిపించింది చైతన్యం వచ్చింది నోట మాట రాలేదు తరకు స్పృహలేకుండా అయింది

తెల్లవారి దొంగకోసం వెదకడం ఎక్కడ దొరుకుతాడు? ఖానమ్ మూతి ముడుచుకొని కూర్చుంది బువాహుసేనీ కేకలు వేసింది నేను మాత్రం కదలక మెదలక కూర్చున్నాను అడిగి అడిగీ విసిగిపోయారు నాకు తెలుస్తేగదా చెప్పడానికి?

రుస్వా తెలిసినా ఎందుకు చెప్పాలి అనరు కదా?

ఉమ్రావ్ ఎందుకా? సూటిపోటుమాట?

ఆనాటి ఖానమ్ ఆతురత బువాహుసేనీ దీనత తలచుకుంటే నవ్వు వస్తుంది

రుస్వా ఎందుకు రాదు। వారి ఆశలన్నీ మట్టిపాలు అయితే మీకు పరిహాసం।

ఉమ్రావ్ ఆశలు అడియాశలు కావడం। ఖానమ్ సంగతి మీకు తెలియదు బయటికి పొక్కనీయలేదు అణచేసింది

ఆ రోజుల్లో ఒక పెద్ద నవాబు కుమారుడు చదువుకోసం లక్నో వెంచేశారు తండ్రి లంచాలు నజరానాలతో లక్షలు ఆర్జించాడు చనిపోయేప్పుడు ఒక జాగీరు కొడుకు ఖర్చుకోసం ఏర్పాటుచేసిపోయాడు కొన్ని రోజులు చదివారు తరవాత లక్నో గాలి తగిలింది దుర్వ్యసన విద్యలో పండితుడూ ధూర్తవిద్యలో విద్వాంసుడు అయిపోయారు నామధేయం రాషిదలీ రాషద్ తఖల్లుస్ లక్నోలో ఒక గురువు వారిని కవిని చేశాడు తఖల్లుస్ అంటే వారికెంతో గర్వం

ఊరినుంచి వచ్చిన సేవకులు రజబ్‌మియాం అనేవారు లక్నోవారు 'రాజా' బిరుదం ఇచ్చారు ఆ బిరుదు అంతగా నచ్చలేదు లక్నో వాతావరణం అంటే పడిచచ్చేవారు కొద్దిరోజుల్లోనే నవాబ్ సాహబ్ అయిపోయారు ఇంటినుంచి వచ్చినపుడు గడ్డం ఉండేది లక్నోకు వచ్చి కత్తిరించారు తరవాత పిల్లిగడ్డం అయింది కొద్దిరోజుల తరవాత నున్నగైంది

అసలే విన్నముఖం గడ్డం పోవడంతో విహారం అయింది అందులోనే సొగసు ఉందనుకున్నారు తెల్లని రంగు స్ఫోటకం మచ్చలు చట్టి ముక్కు చొక్కుకుపోయిన చెంపలు మెడ పొట్టి మనిషి పొట్టి ఆ మహాశయునికి మాత్రం ఇవన్నీ సౌందర్య చిహ్నాలకిందే లెక్క రాను రాను అలంకారాలపట్ల అభిరుచి చూపేవారు అద్దం ముందు గంటల తరబడి గడిపేవారు మెలిపెట్టడంవల్ల మీసాలు విచిత్ర శోభగా తయారైనాయి జులపాలు పెంచి ఉంగరాలు తిప్పించారు పడక టోపీ పొడవైన అంగరఖా వదులు పైజామా ఈ అలంకార విశేషాలన్నీ వేశ్యల దర్బారుకు వెంచేయడానికి

స్వయంగానే విలాసపురుషుడు పైగా సహచరులు ఇంకా సహాయాలు కొద్దిరోజుల్లోనే ఉన్నత వేశ్యాగృహాలకు ప్రవేశం లభించింది స్వేచ్ఛ ఎక్కువైంది చొరవ కలిగింది ఖుర్షీద్‌జాన్ 'అత్తి అంటు పోతుంది ''బిగ్గన్' మొట్టికాయలు వేస్తుంది 'హుస్నా' జుట్లు లాగి పారేస్తుంది పిల్ల నవాబు ఇహిహీ అని నవ్వుతుంటాడు వేశ్యా మాతలంటే వారికెంతో గౌరవం ఒక సాని ఇంట్లో ఒక రాత్రి గడిపితే చాలు ఆ వేశ్యమాతను తల్లిని చేసుకునేవారు గోష్ఠిలో ఆవిడను 'అమ్మా జాన్'' అని వంగి వంగి సలామ్ చేసేవారు కోట గెలిచానని సూచించడానికి దాన్ని సంకేతంగా భావించేవారు

రెండు మూడు గడియల రాత్రి తరువాత ఖానమ్‌గారు కొలువుతీర్చేవారు. వారి సేవకు ఒక దాసి హాజరుగా ఉండేది. ఈ మహాశయుడు అక్కడ ప్రత్యక్షం. సంగీతంతో బాగా ప్రవేశం ఉండేది. స్వయంగా ఠుమ్రీలు రచించేవారు. రాగం కల్పించి పాడేవారు. భావం ప్రదర్శించేవారు. తన ప్రజ్ఞ ప్రదర్శించేవారు. నోటితో తబలా వాయించేవారు. మిత్రులు పరిహసించేవారు. అయినా అర్థం అయ్యేదికాదు. కవి సమ్మేళనాల్లోకూడా తయారు. పద్యం చదివితే పొగిడి చంపేవారు. మహాకవులతో పోల్చేవాళ్ళు. గజల్ చదివితే సదస్యులంతా ఉలికిపడేవారు. ఆతవారి పాటలకు ముందు వీరు తమ పదాలు చదివేవారు. జనం పొట్టలు ఉబ్బేట్టు నవ్వేవారు. హేళనను పొగడ్తగా భావించేవారు. వంగి సలాములతో స్వీకరించేవారు.

కొడుకు విద్వాంసుడై వస్తాడని తల్లి లెక్కలేనంత డబ్బు పంపేది. ఏది కావాలని వ్రాస్తే అది వచ్చేది. లక్నోలోని సోమర్లు పోకిరీ చిల్లర గాళ్ల పనికిమాలిన వాళ్లు మొత్తం వెంటపడ్డారు. వారి సహవాసంవల్లనే కోర్కెలు మొదలై వ్యసనాలుగా పరిణమించాయి. వలపుతో మొదలై పిచ్చికి దిగింది. ఇటు ఖానమ్ త్రిప్పివేయసాగింది "ఇప్పుడే కాదు! అది ఇంకా చిన్నపిల్ల" అనేది. ఈ మహాశయుని ప్రార్థనలు ఎన్నోపాటు ఆతురత నాకు ఇప్పటికీ జ్ఞాపకం ఉన్నాయి. మంత్రాలు తాయెత్తులు మందులు మాకులు అయింతరవాత అయిదువేలకు బేరం తెగింది. డబ్బు కోసం ఊరికి వెళ్ళాలి వచ్చింది. తల్లి పాటుగా రెండు ఊళ్ళు కుదువపెట్టి ఇచ్చె. ఇరవై అయిదు వేలతో లక్నో చేరారు.

డబ్బు తీరు ద్వారా ఖానమ్‌గారి ఖజానాకు చుట్టుకట్టుతోంది. బువా హుసేనీ చేయి చాపింది. అయిదు వందలు పట్టేసింది. మొత్తంమీద ఖానమ్‌గారి ఇల్లు బాగుపడింది. ఆరు నెలలు లక్నోలో ఉన్నారు. నెలకు నూరు రూపాయలు ఇచ్చేవారు. అడిగి ఇచ్చుకున్నది లేదు. రహస్యంగా నా పేర ... సేపికి ఇచ్చేదాన్ని. వాటి విషయం ఖానమ్‌కు తెలియదు. ఇప్పుడు నేను స్వతంత్రురాలను. నా కొలువులో ఇద్దరు దాసీలు ఇద్దరు నౌకర్లు ఉన్నారు. గేటువద్దగది నాకోసం అలంకరించబడింది. నలుగురు నలుగురు పురుషులు—కుర్చీల ఉద్దయా సవాలు వీడకుండా వచ్చి కూర్చుంటున్నారు.

గౌహర్ మిర్జా వస్తుండేవాడు. నవాబు మహాశయునికి అతడంటే మంట. వాళ్ళు ఇష్టుడు కాబట్టి అడ్డుపెట్టేవాడు కాదు. ఈరోగా గౌహర్

మిర్జా తండ్రి గతించాడు. వచ్చే డబ్బు నిలిచిపోయింది. అమ్మా మునలిదై పోయింది. అతిథి అర్భుల బాధ్యత నామీద పడింది.

ఒకర్ని తమవాణ్ణి చేసిపెట్టుకోవడం వేశ్యల రివాజు. అతనివల్ల అనేక ప్రయోజనాలుంటాయి. ఎవరూ లేనపుడు వినోదానికి పనికివస్తాడు. సరుకులు తెప్పించుకోవడంలో హాయి. మనిషిని పంపితే కొంత తినేస్తాడు. వీరు మెహర్బానీకని మంచివి తెస్తారు. జబ్బున పడితే సేవలు చేస్తారు. రాత్రంతా కాళ్ళు పిసుకుతారు. ఉదయం మందు తాగిస్తారు. మందు తెస్తారు. మిత్రులముందు, గ్రాహకులముందూ కీర్తిస్తారు. పిట్టల్ని పట్టి తెస్తారు. పెళ్ళిళ్ళలో నాట్యప్రదర్శనల ఏర్పాట్ల బాధ్యత తీసుకుంటారు. కచేరీలకు తీసికెళ్తారు. నాట్యం జరుగుతుంటే సదస్యుల్లో కూర్చొని పొగడుతుంటారు. ఆమె నాట్యం చేస్తుంటే వీరు తాళం వేస్తుంటారు. ప్రతి భంగిమకూ "ఆహా" అంటారు. ప్రతి తానానికీ "వాహ్" అంటారు. ఆమె భావం వ్యక్తపరుస్తుంది. వీరు వ్యాఖ్యానిస్తారు. వారి వల్లనే మంచి మంచి భోజనాలు లభిస్తాయి. గౌరవమూ మర్యాద కలుగుతాయి. నవాబులూ అమీర్లతో కలిసినపుడు ఇనాములు దొరుకుతాయి. వీరికి సాంగత్యపు ఆనందం వారివలన పెరుగుతుంది. వేశ్య తానంటే ప్రాణం ఇస్తోంది అనుకుంటారు వీరు. ఆవిడ బొంకుతుంది 'నేను వారి కట్టుబాట్లోదాన్ని. వివశనై వచ్చేస్తాను మీదగ్గరకు. వారు వచ్చేవేళ అయింది. వెళ్ళిరండి. వెళ్ళనివ్వండి. వారు ఎల్లప్పటివారు. మీరేం పోషిస్తారు?' ఇలాంటి మాటలకే ఐనం లొంగేది. తగాదా జరిగితే ఎంతకైనా తయారు. నగరంలో వంకరటింకర వాళ్ళందరితో వారికి పరిచయం. కేక వేస్తే యాభై అరవైమంది సిద్ధం అవుతారు. విటులకుకూడా వారంటే భయం—ఏ క్షణాన తవింటికి తాము తిరిగి వెళ్ళిపోతుందో అని.

అమీర్‌ఖాన్‌కు బాణిమలిమీద ప్రాణం. ఏండ్లతరబడి డబ్బు ఇచ్చింది. ఒకసారి ఆరువాడు వందల ఖరీదైన బంగారు కడియాలు తీసి ఇచ్చేసింది. ఎవరో లాక్కుపోయారని ఉదయం గగ్గోలుపెట్టింది. ఇంకొకసారి వద కొందరు వందల దిద్దుల జతలో ఒకటి ఇచ్చేసి "ఐష్‌బాగ్ జాతర" లో పోయిందని బొంకింది. అలా వేలరూపాయిలు ధారపోసింది. ఖుర్షీద్‌కు ప్యారెసాహెబ్ అంటే ఇష్టం. పిచ్చిల్లాడు చెలికాడు లేదు. నిర్లక్ష్యం ఆమె స్వభావం. ఎవరి కట్టులోనూ ఉండేదికాదు.

తావఫ్ఫగారు యాభై. యాభై అయిదు సంవత్సరాల వయసులో మీర్ బౌలాదర్ అంటే పడిచచ్చేది. మీర్ [illegible]. [illegible] సంవత్స

రాలవాడు అందమూ వయసూ ఉన్నాయి కసరత్తు చేసిన శరీరం అందరినీ ఆకర్షించేవాడు కాని ఖానమ్ అంటే ఎందుకు పలకరించే ధైర్యం ఉండేదికాదు పాపం పేదవాడు చద్దిఅన్నం గతిలేకుండేది ఖానమ్ వల్లే కుటుంబం యావత్తూ జీవించేది వేయిన్నూర వెచ్చించి పెళ్ళిచేసింది పెళ్ళినాటి రాత్రితప్ప రాత్రిళ్ళు ఇంట్లో పడుకునే అదృష్టం కలుగలేదు రాత్రింబగళ్ళు ఇక్కడే ఉండేవాడు గడియ రెండు గడియలు ఇంటికి వెళ్ళివచ్చేవాడు

మరొక మిర్జాగారు ఉండేవారు—నడుము వంగి తెల్లయి పండినవాడు నోట్లో పళ్లు లేవు పొట్టలో ప్రేవుల్లేవు ఖానమ్‌గారి పూర్వ ప్రియుడు ఇప్పుడు ఆరితో సంపర్కం ఏమీలేదు అయినా ఇంటి మనిషిలా ఉంటాడు రెండుపూటలా ఖానమ్‌తో భోజనం చేసేవారు బట్టలు నల్లమందు సిగరెట్ల ఖర్చులన్నీ ఖానమ్ భరించేది ఒకరోజు మేమంతా ఖానమ్ దగ్గర కూర్చునివున్నాం ఖుర్షీద్‌జాన్ ఏడుపుముఖం పెట్టుకొనికూర్చుంది

షా రెసాహెబ్ పెళ్ళి అవుతుంటే నీ నెత్తిన ఏడుపు కూర్చుందా?

ఏమోనమ్మా! ఈకాలపు ప్రేమలే విచిత్రం ముందు రెంతో మిండలంతే మా కాలంలోనా చూడండి (మిర్జాగారిని చూపించి) ఇప్పటికీ ఇక్కడే ఉన్నారు వయసులో కలిశాం తల్లిదండ్రులు పెండ్లి కుదిర్చారు పెళ్ళి బట్టలతో వచ్చారు నాకు చూపడానికి పెళ్ళిబట్టలు ముక్కలు ముక్కలుగా చించేశాను పోనివ్వమని చేయిపట్టి కూర్చోబెట్టాను అరవై సంవత్సరాలైపోయింది ఇప్పటివరకు ఇంటికి వెళ్ళలేదు చెప్పండి ఇలాంటివారున్నారా మీకు అంది ఖానమ్

అంతా ఆలకించుకున్నాం

# 6

తొలి ఆటపాటలు బిస్మిల్లా మిస్సీలోనే జరిగాయి. కాని తొలి కచ్చేరి నవాబ్ షుజాత్ అలీఖాన్ కొడుకు పెళ్ళిలో. ఆ సభస్సు మరువరానిది. నవాబు బంగళా రమ్యంగా అలంకరించబడింది. విలువైన గాజు దీపాలతో రాత్రి పగలుగా మారిపోయింది. శుభ్రమైన గచ్చుమీద పారసీకపు రత్నకంబళ్ళు పరచబడినాయి. జరీపనిచేసిన పెద్దపెద్ద బాలీసులు.

పూలవాసనలతోను అత్తరు పరిమళంతోనూ భవనమంతా గుబాళించింది. హుక్కాల పొగ ఊదుబత్తీల ధూపమూ పరిమళించాయి. అప్పటికి నా వయసు పద్నాలుగు సంవత్సరాలు. ఆ కాలంలో బరోడానుంచి ఒక గాయని వచ్చింది. ఆమె ఖ్యాతి నగరమంతా వ్యాపించిపోయింది. సంగీతంలో అందెవేసిన చేయి. గొప్పగొప్ప సంగీత విద్వాంసులు మూల పడ్డారు. ఆవిడ గొంతు శ్రావ్యం అయింది. గొంతెత్తి పాడితే నాలుగు వీధులకు వినవచ్చేది. ఖానమ్ ఆలోచించింది. ఆవిడ తరవాత నా పాట పెట్టింది. నాకు ఏమీ అర్థంకాలేదు. జనం ఆశ్చర్యపోయారు. ఏమిటీ ఖానమ్ పిచ్చి? బరోడా బాయి ముందు ఈ అమ్మాయి ఏం నిలుస్తుంది? అనుకున్నారు.

మొదటి ఆవర్తం ప్రారంభం అయింది. సదస్సు యావత్తూ నావైపు చూచింది. పొంగుతున్న యవ్వనం. ముఖం బాగాలేదు. కాని చురుకుదనం కొంటెతనం ఉండేవి.

యౌవనమెట్టిదని అడుగనేల?
రంగురంగుల శక్రచాపమ్మది సుమా!

కొద్దిసేపు నాట్యంచేయగానే ఖానమ్ మరొక గజల్ ప్రారంభించింది.

ఆఖరీ సభకు అరుదెంచుపియా।
చూడవయా అస్తై వింతవింతలు।

ఈ గజల్ సదస్యులమీద మంచి ప్రభావం కలిగించింది. తరవాత మరొక పదం ప్రారంభించి పాటపాడిస్తే సభ ఊగిపోయింది.

బాధ మరువ — క్రొత్తబాధను రగిలించు
బాధ సహాయమున్న — అలిగిపోవు ప్రియుడు!

ఈ పదంతో చిచ్చురేగింది

కనురెప్పలు వాలె మాపులు వంకరాయె
గురితప్పి బాణాలు నేలగూలె!

ఈ కవిత ఎంత ప్రభావం వేసిందో చిత్రగించండి

వలపు నింపుకొని కోర్కెల చంపుపెట్టు?
ఉసురులు తీసి హాయమును విలువపెట్టు?

తరవాత ఈ పద్యం

అదమరచి నా సోదచెప్పుకొంటి ఎతనికి
అయ్యో! ఇపుడు మాటమార్చినంత ఫలమేమి?

సదస్సు సాంతం ఊగిపోయింది ప్రతివాడు సావధానంగా వింటున్నాడు ప్రతి పదానికి వాహ్ వాహ్ అంటున్నారు ప్రతి భంగిమను మెచ్చుకుంటున్నారు ఒక్కొక్క పదం ఎనిమిది పదిసార్లు చదివించారు ఆయినా సంతృప్తి కలుగలేదు ఆ గజల్‌తో కచేరీ ముగిసింది

రుస్వా సదస్సుల గతి ఏమైందో కాని ఈ గజల్ ఇంకేమైనా వినిపించండి ఎవరి రచన?

ఉమ్రావ్ తెలీదా?

రుస్వా - అర్థమైంది

ఉమ్రావ్ వినండి

కోర్కెతీరక 'వచ్చెద' నటంచు విలపించె!
కోర్కె తీరువేళ గోరికి చేరుకొనియె!

రుస్వా సుభానల్లా! (బాగు బాగు)

ఉమ్రావ్ తలం విరిచేశారు కాగితం చించేశారు అయినా ఫలకలేదు

ఊర్పునకు శక్తియేమాత్ర మున్నగాని
వేలమాటలు నిట్టూర్చు విడిచియుండు

రుస్వా ఇది వేదాంతం వారికే అర్థంకావాలి

ఉమ్రావ్ వినండి

వాని కేసు సర్వసుర్పింప దలచితి గాని
గుండెముల్లు గ్రుచ్చుకొని పాథాత్యు త్రపతిలి

రుస్వా ఇదికూడా వేదాంతమే వారికే అర్థంకావాలి

ఉమ్రావ్ వినండి

సొరచెప్ప నావిప ప్రస్తలు చేయకు!
ఎవయను అర్థాలు మన్నది నీవే, నీవే,

రుస్వా మేము ఈ లోకంవాళ్ళం మాకెందుకు వేదాంతం! అయినా "అర్థాన బాగుంది శైష

ఉమ్రావ్ మకుటం వినండి

వలవంత మానుషు సొద వెళ్ళబోయుటయు,
అలిగి చక్కబోవు విర్దయుడా పలుకువాడు!

రుస్వా ఆదిపాదమే మకుటం చేసినట్లున్నారు పాపం తీరిక లేదేమో!

ఉమ్రావ్ వారికి తీరికెక్కడ?

మొదటి కచేరీ జరిగింతరవాత మరునటిరోజు ఖవాహాపేసీ నా గది లోకి వచ్చింది వెంట ఒక సేవకుడున్నాడు

ఖవాహాపేసీ "ఉమ్రావ్‌గారూ! ఇతని విన్నపం వినండి" అని గదిలోంచి వెళ్ళిపోయింది

సేవకుడు (సలామ్ చేసి) నన్ను నవాబ్ సుల్తాన్‌గారు పంపారు రాత్రి సభలో వచ్చిన పాగాతో వరుసకి కుడిపక్కన కూర్చున్న వారు ఏకాంతంగా తమదగ్గరికి వస్తానని కబురిచ్చారు రాత్రి తాము పాడిన గజలు ప్రతి దయచేయవలసిందని కోరారు

నేను నవాబుగారికి సలాములు తెలియజేయి వారు సాయంకాలం ఎప్పుడైనా వేంచేయవచ్చు ఎవరైనా ఉంటే వెళ్ళిపోతారు గజల్ కోసం రేపు పగలు వస్తే వ్రాసిఉంచుతాను

రెండవరోజు మధ్యాహ్నం సేవకుడు వచ్చాడు గదిలో ఒంటరిగా ఉన్నాను వ్రాసఉంచిన గజల్ అతనికి ఇచ్చేశాను అయిదు సవరనులు తీసిఇస్తూ ఇది తమకు యోగ్యమైంది కాదు అయినా తాంబూలపు ఖర్చు వకుగాను మా తరఫున స్వీకరించండి ఈరోజు దీపాలు పెట్టింతరవాత వస్తాం అని నవాబుగారు విన్నవించమన్నారని చెప్పి సలామ్ చేసి సేవకుడు వెళ్ళిపోయాడు తరవాత బువాహుసేనీని పిలిచి సవరనులు ఇచ్చి ఖానమ్‌కు అప్పగించమని అందామనుకున్నాను సవరనులు మెరుస్తున్నాయి కొత్త బంగారు సవరనులు మనసు వాటిని వదల్లేకపోయింది చూచాను పెట్టె ఎక్కడా కనిపించలేదు మంచపు కోడుకింద దాచేశాను

# 7

ప్రతి ఆడదాని జీవితంలో తనను వలచేవాడు కావాలనే ప్రాయం వస్తుంది  అది తాత్కాలికం కాదు  యౌవనోదయంతో ప్రారంభమై వయసుతో పెరిగి పెద్దది అవుతుంటుంది

గోహర్ మిర్జాకు నేనంటే ఇష్టమే  అతని ప్రేమలో ఒక లోపం ఉంది  పౌరుషం తక్కువ  పురుషులకు కావలసిన ధైర్యసాహసాలు లేవు  తల్లి పాటకత్తె  ఆ లక్షణాలు వచ్చాయి  అతని సంపాదనంతా వారిదగ్గర లాక్కున్నారే  నాకు ఒక్కరూపాయి తప్ప ఇచ్చి ఎరుగడు  ఆ రూపాయి విషయం ఇదివరకే చెప్పాను  అందువల్ల నా హృదయం ఒక ప్రేమికుణ్ణి అన్వేషించసాగింది  అతడు నా గౌరవానికి తగినవాడు కావాలి  డబ్బు ఇవ్వాలి  నవాబ్ సుల్తాన్‌గారి రూపం అందమైంది  వేలమంది స్త్రీలను వలచేంతటి ఠీవి ఉంది వారి ముఖాన  స్త్రీకి అచ్చం పురుష స్తుతి ప్రేమప్రస్తావన మాత్రమే పసందు అనుకుంటారు కొందరు  అది వాస్తవం కాదు  ముఖస్తుతి వలపు స్త్రీకి ఇష్టమేకాని దానిలో నిజత్వం ఉండరాదు  కొందరు వేశ్యలను వెదుక్కుంటూ వస్తారు  ఆవిడ తమను ప్రేమించాలని భగవంతుని ప్రార్థిస్తారు  తరవాత ఆవిడ తమ ఇంట్లో పడివుండాలి  సర్వస్వం అతనికిచ్చేయాలి  వంటచేసి పెట్టాలి  అతని పిల్లల చెప్పులు తుడవాలి  ప్రతి పురుషుడు [1]హజ్రత్ యూసుఫ్ కావడం గానీ ప్రతి స్త్రీ పురుషునిమీద పడి చావడంగాని సాధ్యంకాదు  స్త్రీపురుషులు పరస్పరం ప్రేమించుకుంటారు  కాని ఆ ప్రేమమాటున ఏదో స్వార్థం ఉంటుంది  నిస్వార్థప్రేమ లైలామజ్నూ, షీరీఁ ఫర్హాద్ కథల్లో మాత్రం కనిపిస్తుంది  ప్రేమ అనేదే లేదంటారు కొందరు  అలాంటి వాళ్ళనూ చూశాం  ప్రేమను అర్థంచేసుకోవడానికి మనసు కావాలి  ప్రేమ అనేది లేనిపక్షంలో స్త్రీలూ పురుషులూ పిచ్చివాళ్ళు కావడం ఎందుకు ?

---

[1] అరాబు దేశపు రాణి జులేఖా అతిలోకసుందరి  భగవదంశగల హజ్రత్ యూసుఫ్ గొప్ప అందగాడు  అరాబు వీధుల్లో అతణ్ణి చూచి వలచింది జులేఖా  ఆమె నిద్ర ఎగిరిపోయింది  చెలికత్తెలు ఆమెను వెక్కిరించారు  ఆమె వారికి ఒక పరీక్ష పెట్టింది  అందరికీ ఆపిల్స్ కత్తులు ఇచ్చింది  యూసుఫ్ ఆ దారిన వెళ్ళేప్పుడు కోయమంది  యూసుఫ్ దాటిపోయిన తరవాత చూస్తే అందరి వేళ్ళు తెగి రక్తం కారుతూంది

రెండవరోజు రాత్రి నవాబుగారు విచ్చేశారు. వివాహానికి మామూలు ప్రకారం బేరం సాగించింది. నిర్ధారణ జరిగి డబ్బు నిర్ణయం అయినతర్వాత గదికోతున్న ఇతరులు నిర్గమించారు. నవాబుగారు నన్ను కొలువుపెట్టుకోలేదనీ అప్పుడప్పుడు రాత్రిళ్ళు గంట రెండుగంటలు మాత్రం వస్తుంటారని తెలిసింది. వారు అమాయకులు. వయసు పద్దెనిమిది సంవత్సరాలుంటుంది. తలిదండ్రుల కట్టుదిట్టాల్లో పెరిగారు. మోసాలు కుట్రలు తెలియవు. సేవకుడు పరిచయం చేశాడు కాబట్టి సరిపోయింది. అందుకుకూడా ఆయన తడబడేవారే. కొద్దిసేపట్లోనే వారి ఇబ్బంది మారించేశాను.

పలువుమాటలు సాగాయి. నేను ప్రేమోన్మత్తురాలినయ్యాను. నవాబుగారి రూపమే అలాంటిది. రాతిగుండెలుసైతం కరిగిపోతాయి. గులాబీలాంటి ఎర్రని రంగు. పొడవైన ముక్కు. పల్చని పెదవులు. అందమైన ఉంగరాల జుట్టు. ఎత్తయిన నొసలు. పెద్దపెద్ద కళ్ళు. విశిష్టమైన బాహువులు. వ్యాయామం చేసిన దృఢశరీరం. భగవంతుడు బంగారాన్ని మూసలో పోసి తీసినట్లుంది విగ్రహం. పైగా ముద్దుముద్దు పలుకులు. మాటకొక పలువు పదం. చాలవరకు స్వంత రచనలే. పద్యం చదవడంలో విలక్షణత ఉంది. వారిది కవుల వంశం. తండ్రితోపాటు కవి సమ్మేళనాల్లో చదివేవారు.

పలువు కవిత చదవడానికి కవులు వెనకముందాడరు. ఎవరిముందైనా సరే చదివేస్తారు. పెద్దలముందు చిన్నలు, చిన్నలముందు పెద్దలు వేరే మాటలు మాట్లాడటానికి వెనకముందాడుతారు కాని పద్యం చదవడానికి కాదు. ? రసంలో అనుకూలని భావాలుసైతం పద్యాల్లో చదివేస్తారు. మొత్తంమీద ఆ రాత్రి సాహచర్యంలో ఆనందించాం.

నవాబు — ఏ పయారం నన్ను మోహింపజేసింది. మిమ్మల్ని చూడకుండా ఉండలేకపోతున్నాను.

నేను — మీ దయ. కాకుంటే అల్పురాలనైన నేనెక్కడ? తామెక్కడ?

నవాబు — ఓహో! నీకు చదువు ఉన్నట్లుందే?

నేను — జీహా! ఏదో కొద్దిగా చదువుకున్నాను.

నవాబు — వ్రాతకూడా వచ్చా?

నేను  అవును వ్రాస్తాను

నవాబు  అయితే ఆ గజల్ మీచేత్తో వ్రాసిందేనా?

నేను  చిరునవ్వు నవ్వాను

నవాబు  ఓహో! ఎంత ముద్దుగా ఉంది వ్రాత! చాల సంతోషం. మనసులోని మాటలు పెదవులతో చెప్ప వెంపడం బావుండదు. ఇప్పుడిక అక్షరభాషతో ముచ్చటించుకోవచ్చు సాధ్యమైనంత వరకు ఇలాంటి విషయాల్లో పరుల జోక్యం ఉండరాదు మమ్మల్ని కోరేది అది

నన్నైకాద! నీకు నాకు దాయరగినది లేనేలేదు,
మన వలపువంతల నడుమ వేరొకరి మంతనాలేల?

నేను  ఇది తమ రచనా?

నవాబు  జీ నహీ, కీర్తిశేషులు పితృపాదులు శలవిచ్చారు

నేను  రమ్యంగా శలవిచ్చారు!

నవాబు  మాషా అల్లా మీకు కవిత్వంలో కూడా అభిరుచి ఉందా?

సౌందర్యమొసగిన దైవము
సద్గుణము లీయవలె,
వాగ్విలాసములకు తోడు
జ్ఞానమనుగ్రహించాలె!

నేను - ఎవరి పద్యం?

నవాబు  వారిదే.

నేను - గొప్పగా శలవిచ్చారు

నవాబు: వారు ఇలాంటివే రచించారు. మీ యోగ్యతకు అనుగుణంగా ఉన్నాయా?

నేను  అబ్బా! ఇది పెద్దల అనుగ్రహం!
నాకున్న నేర్పెంత? నా ఉనికేది?

నవాబు  వాహ్ ! ఎంత సరళంగా చెప్పారు !

నేను  అనుగ్రహం

నవాబు  అయితే మీరు పద్యాలు చెపుతారా ?

నేను  జీ నహీ ! తమలాంటివారితో చెప్పించుకుంటాను

ఈ మాటమీద నవాబుగారు ముందు తడబడ్డారు తరవాత చిరునవ్వు చూచి నవ్వారు

నవాబు  బాగా చెప్పారు వేశ్యలు చాలమంది విటులతో చెప్పించుకొని తామే వ్రాశామని చదువుతారు

నేను  వేశ్యలేనా ? మగవారు చేయరా ?

నవాబు  నిజం నాన్నగారి మిత్రులలో ఒక్క పాదంకూడా వ్రాయని వారున్నారు కాని ప్రతి సభలో పద్యాలు చదవడానికి తయారు ! నాన్నగారి పద్యాలే చదివేవారు ఎక్కువగా అప్పుడప్పుడు నావి కూడా చదివేసేవారు అందులో ఏమిటి ఆనందం ? మా తండ్రిగారు గురువుగారి రచనలనుకూడా తమ సంకలనంలో చేర్చలేదు "అబద్ధపు సౌగత్తులు ఆనందాన్నెలా ఇస్తాయి" అనేవారు

నేను  ఆదాబ్ చెప్పి

నవాబు  మీరు చదివిన గజల్ ఇంకేమైన జ్ఞాపకం ఉంటే చదవండి

నేను

వలచి వలపించుకొన్నప్పుడే
కలత కెరువైన — నిద్దురమొంతవలె !
మొదలే ముందు వెన్కాలరయవలె కాని
ఇపుడు నెత్తి నోరు కొట్టుకొన్న ఫలమేమి ?

నవాబు  ఓహో ! చాల బాగుంది కొత్తగా చెప్పారు మరొకసారి.

నేను  తమ అనుగ్రహం (మళ్ళీ చదివాను)

నవాబు : కవిత బాగుంది మరేదన్నా చదవండి

నేను . ఇది నా గజల్ కాదు చివరి రెండు ద్విపదలు నావి

నవాబు — ఇది మీదా? ఇలాంటి పద్యాలా? మరేదన్నా గజల్ చదవండి

నేను — ఇక నాను శలవివ్వాలి అందుకే ప్రారంభించాను

నవాబు — మనవిచేస్తాను మీరుమాత్రం గజల్ చదవాలి

ఈలోగా తలుపు తెరుచుకొని 50 55 ఏండ్ల వృద్ధుడు గదిలో ప్రవేశించాడు నలుపు రంగు పెద్దగడ్డం వంకర తలపాగ నడుముకు కత్తి వ్రేలాడుతూంది గదిలోకి వచ్చి నా పక్కనే కూర్చున్నాడు నవాబు నావైపు చూశారు తల వంచుకున్నాను కత్తిపేటుకు రక్తంలేదు ఏకాంతంగా ఉంటుందని నవాబుతో ఒప్పందం ఎంత చక్కని సంభాషణ! మంచి హాస్యం! రక్కసిలా వచ్చి కూలాడు

ఎంత హాయి అయిన స్నేహం! పానకంలో పుడకలా వచ్చాడు మూర్ఖుడు నవాబ్ గజల్ చదివేవారు నేను చదివేదాన్ని నన్ను పొగిడేవారు హృదయానికి ఎంత ఉల్లాసం! ఎంత ఆనందం ఒలికిపోయింది! ఇప్పుడే రావాలా ఈ రాక్షసుడు! ఈ పీడ త్వరగా దూరం అయితే బాగుండును వాణ్ణి చూచాను నా గుండె అదిరింది నా ప్రాణానికి పీడ మరొక దిలావర్‌ఖాను అయినాడు వాని నడుమునకున్న కత్తి నా గుండెనే చీలుస్తుందో నవాబు కేమైనా నష్టం కలిగిస్తుందో అని వణికిపోయాను. భగవంతుడా! ఎక్కడినుంచి తెచ్చావు నాయనా ఈ ఆపద! అని తిట్టుకున్నాను

నాకేమీ తోచలేదు బువాహుసేనీని కేకవేశాను ఆమె వచ్చింది. గ్రహించింది బువాహుసేనీకికూడా అతనిని గురించి తెలిసినట్లు తెలిసింది

బువాహుసేనీ — ఖాన్‌సాహెబ్! కాస్త ఇటు విచ్చేయండి మీతో ఒక విషయం విన్నవించాలి

ఖాన్‌సాహెబ్ — చెప్పాల్సింది అక్కడినుంచే చెప్పు మేము కూర్చున్న చోటునుంచి కదలం.

హుసేనీ — దౌర్జన్యమా!

ఖాన్ — దౌర్జన్యమేమి! భోగం కొంప ఒకరి జాగీరా! ఏమిటి దౌర్జన్యం. మేము కదలం చూస్తా ఎవరు కదిలిస్తారో!

హుసేనీ — జాగీరు ఎందుకు కాదు! తప్పుచ్చుకొనవిది వేశ్య. ఇప్పుడెవరూ రావడానికి వీల్లేదు.

ఖాన్ మేమేం డబ్బు వెచ్చించలేమా ?

హుసేనీ అయినా ఇది సమయం కాదు మరొకసారి విచ్చేయండి.

ఖాన్ నీకేం అర్థంకావడంలేదా ? చెప్పేశాం కదంమని

నవాబు ముఖం కోపంతో ఎర్రబారింది ఇప్పటిదాకా మౌనంగా ఉన్నారు పెదవి కదపలేదు

హుసేనీ సరి బిడ్డా నీవు లేచి ఇలా రా (నవాబును సంబోధించి) మీకు విశ్రమించే సమయం సౌధానికి వెంచేయండి

నేను లేద్దామనుకుంటుండగానే దుర్మార్గుడు నా చేతిని గట్టిగా పట్టుకున్నాడు ఏం చేయాలి ?

నవాబు ఖాన్‌సాహెబ్ ! మీ క్షేమంకోసం చెబుతున్నాను ఆవిడ చేయి వదలండి ఇది వేశ్యాగృహం అని ఇంతసేపట్నుంచీ ఊరుకున్నాను కాని ఇప్పుడు

ఖాన్ కాని ఇప్పుడు ఇప్పుడేం చేస్తావో చూస్తా విడిపిస్తావా ?

నేను (గట్టిగా చేయి విదిలించి) సరి వదలండి నే నెక్కడికీ వెళ్లను. (ఖాను చేయి వదిలాడు )

నవాబు మాటలు మంచిగా రానివ్వండి మీకు సత్పురుషుల స్నేహం లభించినట్లు లేదు.

ఖాన్ : నీకు లభించిందా చాలు ఏం చేసుకుంటావో చేసుకో

నవాబు మీరు పోట్లాటకి వచ్చినట్లున్నారు కాని ఇది వేశ్యాగృహం. గరడీశాలకానీ మైదానంగానీ కాదు ఇంతటితో ముగించి ఇక్కడి నుంచి నిష్క్రమించడం మంచిది. లేకుంటే

ఖాన్ : లేకుంటే నన్ను మింగేస్తావా ? వెళ్ళిపోండి అని నన్నే అన్నావు. నువ్వెందుకు వెళ్ళవు ?

నవాబు : ఖాన్‌సాహెబ్ ! అమీరులంటే నాకెంతో గౌరవం . నేను నా గౌరవాన్ని కాపాడుకోవాలి తల్లిదండ్రులు, బంధువులు, మిత్రుల గౌరవంకూడా కాపాడాలి అలా కాకుంటే మీ దురుసుదనానికి ఎప్పుడో ఫలితం చూపించేవాడ మళ్ళీ చెబుతున్నాను అనవసరపు మొండితనం మాని ఇక్కణ్ణుంచి వెంచేయండి

ఖాన్ భోగం కొంపకు వచ్చి తల్లికి భయపడతావు? ఏమిటా దుడుకుతనం? నేను నీ తండ్రి నౌకరును నువ్వు అతని కొడుకువు అయితే మాత్రం భోగం కొంపలో నీవూ కూర్చున్నావు నేనూ కూర్చున్నాను మా ఇష్టంవచ్చినప్పుడు వెళ్ళిపోతాం అనవసరంగా నువ్వే పంతు చేస్తున్నావు నన్ను కదిలించినవాణ్ణి ఇవ్వాళ్టికి చూడలేదు

నవాబు కదిలించడం కష్టమా? సేవకులను పిలిస్తే మెడమీద చేయివేసి బయటికి గెంటేస్తారు

ఖాన్ సేవకుల బలం చూసుకొని పొంగకు చూశావా కటారి?

నవాబు ఇలాంటి కటార్లు చాల చూశాం సమయానికి పనికివచ్చింది కటారి మీ ఒరలోంచి కటారి వచ్చేలోపల తల మెడనుంచి వేరవుతుంది చూశాం తరవాత

ఖాన్ అయ్యో పాపం! అయితే ఇంటికి వెళ్ళు అమ్మ జ్ఞాపకం చేస్తుంటుంది

నేను చూస్తూఉండిపోయాను నవాబు ముఖం ఎర్రగా కంది పోయింది కోపంతో వణికిపోతున్నారు అయినా గౌరవంగా సంబోధిస్తున్నారు ఆ దుష్టుడు ఎంత పేలినా "మీరు" అని మాట్లాడుతున్నారు ముందు నవాబు బెదిరారనుకున్నాను కాని అలా కాదు వారికి తమ గౌరవంమీద దృష్టి ఎక్కువ సౌమ్యంగా పరిష్కారం కావాలని చూస్తున్నారు కాని ఆ దుష్టుని ప్రేలుడు ఎక్కువ అవుతూంది నవాబు మెత్త పడుతుంటే వాడు పులి అవుతున్నాడు

నవాబు: అదా, ఖాన్‌సాహబ్, పదవండి అయిష్‌బాగ్‌కు అక్కడ పోట్లాడుదాం

ఖాన్: (వెర్రిగా నవ్వి) కుమారా! ఇంకా బుగ్గల పాలు చిమ్ముతున్నాయి మగవారితో పోట్లాడే ధైర్యం వచ్చిందా? కూలావో మీ అమ్మ మొత్తుకుంటూ తిరగాల్సివస్తుంది

నవాబు దుర్మార్గుడా! నీ దౌష్ట్యాలు హద్దుమీరాయి "ఈ దుర్మార్గానికి ఇదిగో శిక్ష" అని జేబులోనుంచి పిస్తోలు తీసి "ధన్" అనిపించారు ఖాను నేల కూలాడు.

నేను మొద్దుబారిపోయాను గన్నుపేల్చిన శబ్దపు మరుగు బువా హుసేనీ బొమ్మలా నిలబడిపోయింది ఆ ధ్వని విని ఖానమ్ మిర్జా, మీర్ ఖుర్షీద్ అమీర్‌జాన్ బిస్మిల్లాజాన్ దాసదాసీలు అంతా పరిగెత్తు కొనివచ్చేశారు నా గది నిండిపోయింది ఒక్కొక్కరు ఒక్కొకరీతిగా చెప్పుకున్నారు ఒక నవాబు నౌకరు షంషేర్‌ఖాన్ నవాబు చేతిలోని పిస్తోలు తీసుకొని "హుజూర్! తాము ఇంటికి దయచేయండి ఇది నేను చూసుకుంటాను" అన్నాడు

నవాబు నేను వెళ్ళను అయిందేదో అయింది కావలసింది అవుతుంది

షంషేర్‌ఖాను దొర్లించి చురకత్తి లాగి 'జనాబ్ అమీర్ అలీ ఉస్సలాంతో గుండెలో గుచ్చుకుంటాను వాడంటారా ఇక్కడినుంచి దయచేయండి తామిక్కడ ఉండటం మంచిది కాదు' అన్నాడు

ఇంతలో ఖానుకు గుండు ఎక్కడ తగిలిందో మావారు జనం ప్రాణం పోలేదు భుజానికి తగిలింది

షంషేర్ నేను విన్నవించుకుంటున్నాను తాము దయచేయండి ఈ పేదవకోసం తామెందుకు బదలాం అవుతారు!

నవాబుగారు ఏమి అనుకున్నారో లేదారు మా మనిషి వెంట వెళ్లారు వారు ఇంటికి వెళ్లారు ఖానమ్ మిర్జా అలీబేగ్‌కు కబురంపింది. చౌకిలోనే ఉన్నారు వెంటనే వచ్చారు ఖానమ్ అతన్ని చాటుగా తీసి కెళ్ళి చెవిలో ఏమో చెప్పింది అక్కణ్ణుంచి వస్తూనే మిర్జా "దుర్మార్గుణ్ణి అవతల పారేయించి చూదాం" అన్నారు అయినా ఖానును అవతల పారేయలేదు భుజానికి కట్టుకట్టి డోలీ పిలిపించాం ఈలోగా ఖానుకు కొద్దిగా తెలివి వచ్చింది ఇంటిని గురించి అడిగితే "మురగ్‌దావా" లో ఉంటారని తెలిపింది డోలీమీద వేసి ఇంటికి పంపించాం మనుషులతో ఇంటిదగ్గర దింపిరావలసిందని చెప్పాం వారు అలాగే చేశారు

బాల కోతలదాకా సుల్తాను గారుగాని, వారి మనిషిగాని రాలేదు. కొత్యాముగా వారివల్ల నాకు కొంత కలిగింది వారు రారని నిశ్చయించు కున్నాను. అలాగే జరిగింది. మానమర్యాదలు గల మనిషి. మొదట తప్పున్నచే మనిషితో అనేక కష్టనిష్ఠూరాలను గురించి చెప్పదలచాను. సమయం ఉండటని ఘూహాడూ సేసి మాట ఇచ్చింది. చాలాపాటు జరిగింది,

కాపలి ఉంచలేదు. దుర్మార్గుడు ఖాను ఎక్కడినుంచి వచ్చాడో ఊడి పడ్డాడు. గాలిమేడ కూలిపోయింది. నాలుగైదు రోజులతరవాత ఒక పెళ్ళిలో మేళం ఏర్పాటైంది. అక్కడికి సుల్తానుగారుకూడా విచ్చేశారు. కచేరీ తొమ్మిది గంటలకు మొదలైంది. సభలో ఎలా మాట్లాడ్డం? సంజ్ఞ చేసే అవకాశంకూడా లేదు. విలువైన బట్టలు ధరించిన తొమ్మిది సంవత్సరాల కుర్రాడు సుల్తానుగారిదగ్గర కూర్చొనిఉన్నాడు. మేజువాణీ పూర్తి అయింది: వేరే గదిలో బట్టలు మారుస్తున్నాను. కుర్రాడు లేచాడు. సైగ చేసి పిలిచాను. వచ్చాడు. దగ్గర కూర్చోబెట్టుకున్నాను. తాంబూలం ఇచ్చాను.

వేను : సుల్తానుగారు తెలుసా?

కుర్రాడు : ఏ సుల్తానుగారు?

వేను : పెళ్లికొడుకు పక్కన నీతో కూర్చున్నవారు.

కుర్రాడు : వారు మా అన్నగారు. వారిని సుల్తానుగారు అనవద్దు.

వేను : సరేకాని నేనిచ్చింది వారి కిస్తావా?

కుర్రాడు : కోప్పడితే?

వేను : కోప్పడరు.

కుర్రాడు : ఏమిస్తారు? తాంబూలమా?

వేను : "తాంబూలం కాదు. ఇదిగో ఈ కాగితం ఇవ్వు" అని అక్కడ పడిఉన్న కాగితం తీసి పద్యం వ్రాసి ఇచ్చాను.

వలపు వగలు వీడి నన్ను విస్మరించితి వెన్నడో!
నేను రగిలింతు నీ విందు సభలో విన్న!

కాగితం వారు చూడకుండా వారి ముందు పెట్టవలసిందని చెప్పాను. కుర్రాడు అలాగే చేశాడు. నేను తలుపుచాటుగా చూస్తున్నాను. సుల్తాను గారు కాగితం తీసి చూశారు. వారి ముఖంలో ఆలోచన వ్యక్తమైంది. మళ్ళీ కాగితం చదివారు. జేబులో పెట్టుకొని సైగచేసి షబ్బీర్‌ఖానును పిలిచారు. అతని చెవితో ఏదో చెప్పారు. షబ్బీర్‌ఖాను మా గదిలోకి వచ్చి "మీ వద్రావిక జనాబు ఇంటికి వెళ్ళి వ్రాసిపంపుతామన్నారు" అని చెప్పాడు.

మరుసటి రోజు ఉదయం మళ్ళీ కచేరీ జరిగింది  సభలో నవాబు గారు లేరు  వారు లేని సభ రిక్తంగా కనిపించింది  పాడ బుద్ధికాలేదు కచేరీ ముగిసింతరవాత ఇంటికి వచ్చాను  షమ్షిర్ ఖా కోసం నిరీక్షణ పగలు గడిచింది  సాయంకాలం అయింది  దీపాలు వెలిగాయి  అప్పుడు వచ్చాడు  నవాబుగారి పత్రం అందించాడు  అందులో ఉన్న విషయం ఇది

హృదయంలో అణగిఉన్న అగ్నిని మీ పద్యం ప్రజ్వరిల్లజేసింది విన్నా ప్రేమించాను  అది నిజం  రీతులు నియమాలు బలవత్తరం అయినవి  మీ ఇంటికి రావడం అసంభవం  నవాబ్‌గంజ్‌లో నాకొక ఆప్తోస్య మిత్రుడున్నాడు  రేపు అక్కడ్నించి కబురంపుతాను  పిలుస్నప్పుడు వచ్చేయి  మనం కలుసుకొనేందుకు ఇదొక్కటే మార్గం—అదీ రాత్రి తొమ్మిది పది గంటవరకు

ఒక్క కనుచూపుకై పడిగాపులు పడియుంటి
ఎక్కించుకొంటి నీ మధుర సమాగమక్షణమ్ము।
కాని — వలపుతేనె లానుట మానివైచి
ఎంతర మాటల తెగనాడుకో సమయమేది

నాటినుంచి సుల్తానుగారు ఖానమ్ ఇంటికి రాలేదు  వారానికి రెండు మూడు సార్లు నవాబ్‌గంజ్ బన్నేగారి ఇంటినుంచి కబురంపేవారు  అది వింత స్నేహం  అందులో సొగసుంది  అందం ఉంది  ఒకప్పుడు కవిత్వ చర్చ జరిగేది  ఒకప్పుడు నవాబు బన్నే సాహెబ్ తబలా వాయించేవారు నేను పాడేదాన్ని  రాగం తాళం తెలియకున్నా సుల్తానుగారుకూడా పాడేవారు  తమ గజళ్ళు తామే పాడేవారు

చూపుల పంటె మింతై అంతై ఎంతో పెరిగె।
నేను ప్రియుని చూచితి, అతడు చూచెనా చూపుల।

ఆ గోష్ఠిని తలుచుకుంటే అంతా ప్రత్యక్షంగా కనిపిస్తుంది  వేసవి రోజులు  వెన్నెల రేయి  తోటలో తెల్లని చాందినీ పరచిఉంది  బాలీసులు. విలాస సామగ్రికి కొదువలేదు  విచ్చిన మల్లెలు  రకరకాల పూలు చమేలి పరిమళం మనసులో గుబాళిస్తోంది  నింపిఉన్న హుక్కాలు ఏకాంత గోష్ఠి  మనసుకు నచ్చిన మనుష్యులు, ప్రేమ్య  ఆ వాతావరణంలో మునిగితే కాదు దేన్నికూడా మరిచిపోతాం  ఎంత వేగంగా గడిచిపోయి

నట్లుంటుంది ఆ కాలం కాని స్మృతిపథంలో అవి జీవితాంతం బాధపెడు తుంటాయి

మేమిరువురమూ ప్రేమించుకున్నాం మా ఇరువురి ప్రవృత్తులూ ఒకలాంటివే జీవితమంతా కలిసివున్నా విసుగులేదు సుల్తానుగారికి కవిత్వమంటే ఆసక్తి నాకా పిచ్చి చిన్నతనంనుంచే వట్టుకుంది మా మన సులు కలిసిపోయాయా అదే ప్రేమకు కారణం కావచ్చు కాని విధి అలాంటి మధురకాలాన్ని క్షణాలుగా మార్చి అంతం చేసింది

ఎలపు నంత తిరిగి రోషినై తిని పో
స్వర్గమందు నీ స్మృతులె వెంటనంటి వగిలించె।

వారు మాటమాటకు పద్యం చదివేవారు నేను పద్యంతోనే జవాబిచ్చే దాన్ని నాతో కలిసిపోయినంతగా సుల్తానుగారు ఎవరితోనూ కలిసి పోలేదు అదే మా ప్రేమకు కారణం కావచ్చు కాని దైవం బలీయం అయింది అలాంటి సమావేశాలన్నింటినీ ఇట్టే భగ్నంచేస్తుంది

విందు ఉన్నమరేయి వింగివి చూచి నిట్టూర్పితి
ఎన్నెన్ని పలపు రేయవిరేలు చెదిరిపోయినవి।

రుస్వా అదంతా నిజమే కాని మీకు పాపం పెట్టింపవాలు ఫన్నమై పోయి ఉండాలే।

ఉమ్రావ్ వాహ్ మిర్జాగారూ। అయితే వారికి నేను శత్రువునా?

రుస్వా ఆ మాట అంటేను గాని తమ పాదం పడినచోటల్లా కూస్య మయింది।

ఉమ్రావ్ మీ ఇష్టం ఎన్నైనా అనుకోండి ఈ విషయం తెలిపితుండే నా కథ వినిపించేదాన్నే కాదు తప్పయింది క్షమించండి

రుస్వా తప్పు జీవితంలో మీరు చేసిన పని అదొక్కటే మంచైనా చెడుఅయినా దానితోనే మీ పేరు లోకంలో ఏలిచిపోతుంది అదలా ఉండనివ్వండి ఆ గజలులోని రెండు మూడు చరణాలు చదవండి

ఉమ్రావ్ మీ పరిహాసం బాగుంది

రున్వా బాగుందక। మరో గజల్ వినిపించండి

ఉమ్రావ్ మంచిది వినండి ఆదిచరణాలు తరవాత కొన్ని జ్ఞాపకం ఉన్నాయి

మనోవ్యధ దుఃఖనిశలు గడువ తీర్చరె
వలపు విస్తరించుకొందది చింతలు చిన్నవయ్యె।
కురులు విప్పి శోకమూర్తి యవనొప్పె ఆమె
కాంక్షలెల్ల ఒకటొకటి శోకసీరధి మున్గె।
అవకశునాలు మొదలె విరహమందు తోచె
ఎలపు కలయక ముందె చెదరె చెలిమి తీవె।

# 8

ఆ కాలంలోనే జాఫరలీఖాను కొలువుంచుకున్నారు. వారి వయసు సుమారు 70 ఏండ్లు. నోట్లో ఒక్క పన్ను గాని తలమీద ఒక్క వెంట్రుక గానీ లేదు. నడుము వంగి పోయింది. అయినా ప్రేమవ్యవహారంలో దక్షుణ్ణి అనుకునేవాడతడు. అతని వలువలు అంగరఖా పైజమా టోపీ మరువలేను.

ఆ వయసులోను ఆ స్థితిలోను వేశ్యను ఉంచుకోవాల్సిన అవసరం ఏమిటి అనుకోవచ్చు మీరు. అది ఆ కాలపు ఫేషను. వేశ్యలేని అమీరు గాని జాగీర్దారు గాని ఉండేవాడు కాదు. తమ వైభవానికి తగిన ఇతర సామగ్రితోపాటు నవాబుల దర్బారులలో నృత్యం చేసే ఇతరుల్లో ఒక వేశ్య కూడ ఉండేది. ఆమెకు నెలకు డెబ్బయి అయిదు రూపాయల జీతం. గంట రెండు గంటల సాహచర్యం తరవాత వెళ్ళిపోయేది. ఈ నవాబు ముసలివాడు. తొమ్మిది గంటల తరవాత దివాన్‌ఖానా (కొలువుకూటము) లో కూర్చోలేకపోయేవారు. పొరపాటున ఎప్పుడైనా ఆలస్యం అయితే దాది వచ్చి వారిని తీసుకెళ్ళేది. నవాబుగారి తల్లి ఇంకా జీవించి ఉన్నారు. ఆరేండ్ల కుర్రాడిలా భయపడేవారు తల్లికి. భార్య అంటే ఎంతో ప్రేమ. శబరాత్రము మొహర్రంలో తప్ప ఇతర రాత్రులలో వేరుగా పడుకునేవారు కారు.

మీరు నవ్వుతారుగాని నమ్మరిగితే అతడు ప్రేమించతగినవాడే. ఆ వార్ధక్యంలో కూడా విరహగీతం పాడితే గుండె నిండిపోయ్యేది.

సంగీతంలో వారికి ప్రావీణ్యం ఉండేది. వారి ముందు పాట పాడే ధైర్యం ఎవరికీ లేదు. మంచి మంచి సంగీత విద్వాంసులు నిలతీశారు. పట్టాపొందిన సంతాప సంగీత విద్వాంసులవంటి ప్రజ్ఞ గలది. సంతాప గీతాలంటే ఎంతో ఇష్టం వారికి. వారి కొలువులో ఉండి వందల సంతాప గీతాలు నేర్చుకున్నాను. నా కీర్తి మూలమూలలకు వ్యాపించింది.

నెలంతా మొహర్రం (పీరుల) పండుగ చేసేవారు. కాని నవాబ్ అందరికంటె అట్టహాసంగా చేసేవారు. ఇమామ్ బాడా (మఠము) గాజు

మొగ్గలతో అలంకరించబడేది. మొహర్రం పది రాత్రులు సభలు జరిగేవి. పదవరోజు పందలమంది ఉపవాసాలుండేవారు. నలభై రోజులవరకు ప్రతి లక్ష్మీవారము సమావేశం జరిగేది.

సంతాప గీతాల్లో నాదే ఖ్యాతి. మహా మహా సంతాప సంగీతజ్ఞులు నా ముందు నోరు కదపలేకపోయేవారు. ఈ సంతాపగీత పాండిత్యంవల్లనే నాకు నవాబు మలికా కిషోర్ రాజప్రాసాదంలోకి ప్రవేశం లభించింది. జహాంపనా స్వయంగా నన్ను పొగిడారు. రాచ దొక్కసంనుంచి నాకు ప్రతి మొహర్రంలో చాల చాల బహుమతులు లభించేవి.

(మొహర్రం పండుగలో షియాలు మనుషులను పెట్టి ఏడిపిస్తారు.) ఏడ్పుకత్తెలలోకూడా నా పేరు ఉండేది. రాత్రికి ఇమామ్ బాడాలో శోకం అయిపోయింతరవాత ప్రాసాదానికి వెళ్ళేదాన్ని. రాత్రి రెండు గంటలకు అక్కడినుంచి రావటం.

బిస్మిల్లా ముస్సీ జరిగినప్పుడు నవాబు ఛబ్బన్‌గారి దాదాయి తీర్థ యాత్రలకు వెళ్ళారు. ఆరు నెలలతరవాత కర్బలానుంచి వచ్చేశారు. వారి అమ్మాయితో నవాబుగారికి ప్రదానం జరిగింది. బిస్మిల్లాజాన్ వారి ఇంట్లో తిష్ఠవేసింది. అబ్బాయిగారు పెళ్లి నిరాకరించారు. కాని ఈ నవాబు గారి ఇష్టంతో ఎవరికీ పని? అది రాజుల కాలం. అమ్మాయి ఒకరిపై పోయింది. నవాబు మాటలను దాదాయి పట్టించుకోలేదు. లెక్కచేయ లేదు. ఒకనాటి రాత్రి నవాబు ఇంటికి వచ్చారు. బిస్మిల్లా నవాబు ఒడిలో కూర్చునివుంది. ఆ రాత్రి బిస్మిల్లా వెంట నేనూ వెళ్ళాను.

నవాబుకు ఎదురుగా కూర్చొని పాడుతున్నాను. నవాబుగారు తంబూరా మీటుతున్నారు. నవాబుగారి అంతరంగిక మిత్రుడు దిలేర్ హుసేను తబలా వాయిస్తున్నాడు. ఇంతలో వార్తాహరుడు పెద్ద నవాబు గారు (నవాబుగారి దాదాయి) విజయం చేస్తున్నారని కబురు తెచ్చాడు. ఒస్తే అంతఃపురంలో బేగమ్ (నవాబు తల్లి) గారి దగ్గరికి వెళ్తారనుకు న్నారు నవాబు. మేమూ అదే అనుకున్నాం. కాని వారు దీవాన్‌ఖానా లోనికి చొచ్చుకొనివచ్చారు. చూస్తే ఏముంది. గోష్ఠి. మండిపోయారు. వారి రాకతో పాట నిలిచిపోయింది. నవాబుగారు లేచి నిలుచున్నారు.

పెద నవాబు: సరి. మీ వినయవిధేయతలు అలా ఉండనివ్వండి. తమతో ఒక విషయం విన్నవించాలని వచ్చాం. కాకుంటే మీ భోగ విలాసాలకు అంతరాయం కలిగించేవాళ్ల కాము.

నవాబు    శెలవివ్వండి

పెద్ద నవాబు    ఇది ఇంకా చిత్రంగా ఉంది మీకు తెలియదు నా సోదరుడు యశస్కరుడు నవాబ్ మీర్ అహమదీఖాను కీర్తిశేషులైన తల్లికి ముందే గతించారు అందువలన మీరు తల్లికి ముద్దుబిడ్డలు ప్రస్తుతం తమ హక్కు భుక్తంలోఉన్న ఈ ఆస్తిమీద మీకు ఏమీ అధికారం లేదు కీర్తిశేషురాలైన తల్లిగారు మిమ్ము పుత్రునిగా అంగీకరించిన మాట వాస్తవం ఆమె గతించేప్పుడు ఆస్తి మీ పేరున పెట్టింది అయినా ప్రయోజనం లేదు ఆమె మీ పేర పెట్టినా పెట్టకున్నా ఆస్తిలో మూడవభాగం మీకు చెందుతుంది జనులు చెప్పేదాన్నిబట్టి నేను ఎప్పుడోవినిబట్టి కాదు మూడవ భాగంకంటే ఎక్కువే ఖర్చుచేశారు మూడవభాగమే కాదు ఇంకా మీరు ఖర్చుచేసినదాన్నిగురించికూడా పట్టించుకోము ఎందుకంటే మీతో రక్తసంబంధం ఉంది ఆ తరవాత పెద్ద నవాబుగారి తండ్రి చిందులువేస్తున్నాయి అయినా కోపాన్ని దిగమింగాడు "ఈ ఆస్తి మీద కలకాలం మీ హక్కు ఉండేది మీ ఖర్చులకు మాత్రం జాగ్రత్తపడేవాళ్ళం ఆ ఆస్తికికూడా తామే వారసులయ్యేవారు మీ ప్రవర్తన చూచి ఈ ఆస్తినుండి బేదఖలు చేయాల్సివస్తున్నది. పెద్దలు ఆర్జించిన ఆస్తి ఇలా నాశనంచేయడానికి కాదు నావెంట ముప్పైపుష్తాలా మనుషులున్నారు వారు ఈ ఇల్లు ఖాళీచేయిస్తారు తాము తమ సహచరులతోనూ, మిత్రులతోనూ దయచేయండి"

నవాబు    అయితే నాకు ఈ ఆస్తిలో ఏమీ హక్కులేదా?

పెద్ద నవాబు    జీ నహీఁ, లేదండీ

నవాబు    మూడో భాగానికి హక్కుందిగా?

పెద్ద నవాబు    అది ఎప్పుడో తీసుకున్నారు కావాలనుకుంటే న్యాయస్థానానికి వెళ్ళండి నాదగ్గర మీది ఒక్క పైసా లేదు

నవాబు    అయితే తల్లిగారివికూడా వెంట తీసికెళ్తాను.

పెద్ద నవాబు    వారు మిమ్మల్ని వదిలేరాదు నాతో కలసి వస్తున్నారు

నవాబు    అయితే నేను ఎక్కడికి వెళ్లేది?

పెద్ద నవాబు: మాకేం తెలుసు? మీ సహాయకుడు నౌకరు ప్రియురాళ్ళు ఉన్నారు వారి నడగండి

నవాబు: అయితే నా బట్టలు సామాను ఇచ్చేయ్యండి

పెద్ద నవాబు: ఈ ఇంట్లో ఏ సామగ్రిగాని బట్టలుగాని లెవు

తరవాత ముస్నపుర్దౌలా మనుషులు దివాన్‌ఖానాలోకి వచ్చారు. నవాబుగారిని సపరివారంగా బయటికి పంపించేశారు.

మేము ఇంటినుంచి వెళ్ళగానే డోలీలు అద్దెకు తీసుకొని చౌకుకు వెళ్ళిపోయాం. నవాబు అతని పరివారం ఎటు వెళ్ళారో భగవంతునికే తెలియాలి.

నవాబు పరివారంలోనివారంతా ఎవరి దారి వారు చూసుకున్నారని విన్నాం. మక్దూమ్ బక్ష్ నవాబు తండ్రికి పాత నౌకరు. పనికిరానివాడని నవాబుగారు అతన్ని కొలువునుంచి తీసేశారు. దోవలో అతడు కలిశాడు. నవాబు పరిస్థితి తెలుసుకొని తన ఇంటికి తీసికెళ్ళాడు.

నవాబుగారి ఇంటినుంచి వచ్చిన రాత్రి బిస్మిల్లా గదిలో గోష్ఠి జరిగింది. మియాఁ హుస్నా నవాబుగారికి అంతరంగికుడు. సహచరుడు. మిత్రుడు. ప్రాణస్నేహితుడు. నవాబు స్వేదబిందువు రాలితేచోట రక్తం కురిపించగల ఆప్తుడు. గోష్ఠికి వచ్చాడు. కొత్తేం కాదు. నవాబుగారి చాటుగా అప్పుడప్పుడూ వస్తూనే ఉండేవాడు. ఇవాళ బహిరంగంగా వచ్చి దర్జా వెళ్ళబోస్తూ కూర్చున్నాడు. బిస్మిల్లాజాన్‌మీద సర్వాధికారాలు అతనికే ఉన్నట్లు ప్రవర్తించాడు. కొలువు ఉంచుకోవడాన్ని గురించి మాటలు సాగాయి.

హుస్నా: చూడు బిస్మిల్లాజాన్, ఇక నవాబుమీద ఆశ పెట్టుకోకు. అన్నమాట అనదాచేవాణ్ణి కాను. ఒప్పుకున్నది ఇస్తాను. పేద వాణ్ణి. నవాబు ఇచ్చినంత ఇవ్వలేను. సగంకూడా సాధ్యపడదు. కాని ఏదోవిధంగా సంతోషపెడ్తాను.

బిస్మిల్లా: పేదవాడివా? నవాబు ధనమంతా కొల్లగొట్టి ఇంట్లో పోసుకున్నానని చెప్పవు. పేదరికం వల్లిస్తావా? ఇలాంటి పేదవాళ్ళను కొత్తే కలీసం మణుగు గొప్ప ఉంటుంది

హసీనా: హీ....హీ. అలా అనకు. ఆ నవాబువద్దరి ఉన్నదేమిటి ఇల్లు నింపుకోవడానికి? నా తల్లి ఆస్తి లేదా?

బిస్మిల్లా: ఒహోహో! బువాఫర్జుందా, నవాబు సర్ఫరాజ్ అంతఃపురంలోని దాసీకా?

హసీనా: (ఉలికిపడి) అయితేనేం నాలుగు వేల జవహరి ఇచ్చిపోయింది.

బిస్మిల్లా: అది కాస్తా సంగ్రహించి నీ పెళ్ళాం ముండనితో లేచిపోయిందిగా? నీకు మిగిలిందేమిటి? నా ముందా మీసాలు మెలెయ్యడం?

హసీనా: మా నాన్నగారికేం తక్కువ?

బిస్మిల్లా: మీ నాన్నా! నవాబు హసనుద్దీన్‌ఖాన్‌గారి పిట్టలు పట్టేవాడు.

హసీనా: కోళ్ళ పందెగాళ్ళలో.

బిస్మిల్లా: కోడి పందెగాడా?

హసీనా: పూరేళ్ళు పట్టేవాడు.

బిస్మిల్లా: అయినా పిట్టలు పట్టేవాడేగా?

హసీనా: హాస్యంగా మాట్లాడుతున్నారు.

బిస్మిల్లా: కాదు. ఉన్నమాటే అంటున్నాను. అందుకే అందరికీ చెడ్డదాన్నయాను. నీ కొంచెపుదనం చూచి ఉండిపోయాను. అప్పు తప్పుడూ వస్తూనేఉన్నావు. నేను అడ్డుపెట్టానా? ఈరోజే నవాబుకు ఆ గతి పట్టింది. ఈరోజే, అదీ నా మూలాన కొలువుంచుకుంటానని వచ్చావు! వాస్త తెలిసి తెచ్చుకో. నువ్వేము. కొలువుంచుకోవడం ఏమి? నెల రెండు నెలలు ఉంచుకుందామనుకుంటున్నావు. అంతేనా?

హసీనా: ఆరు నెలల డబ్బు జమకట్టేస్తాను.

బిస్మిల్లా: నోటితోనా?

హసీనా: ఇదిగో చూడు (బంగారపు కడియాలు వొళ్లోంచి తీసి) సరుకు ఎంత ఖరీదు ఉంటుందంటారు?

బిస్మిల్లా: "ఏదీ ఇలా తే" అని కడియాలు తీసి చేతులకు వేసుకొని, ఛత్రామల్ కొడుక్కి చూపిస్తాను. ఎవరు చేశారోగాని మంచిగా చేశారు. ఇక మీరు వెంచేయండి. ఛట్టన్ అక్క పిలుస్తోంది. ఉండలేను. రేపు ఇదే సమయానికి వచ్చేయండి.

హుస్నా: కడియాలు?

బిస్మిల్లా: యా అల్లా! మేమేం దొంగలమా? నమిలి మింగేస్తామా? సాదా గాజులున్నాయి చేతికి. అమ్మను కడియాలు కావాలని అడుగుతాను. ఎలాంటివి? అంటుంది. ఇదిగో ఇలాంటివి అని చూపిస్తాను. రేపు తీసికెళ్ళు.

హుస్నా: ఇచ్చేయండి. నావి కావు. నావే అయితే మీరు అడగడమూ నేను కాదనడమూనా?

బిస్మిల్లా: అయితే మీ తల్లిగారివేమో! ఆమె పోయింతరవాత కూడా మీవి కాలేదా?

హుస్నా: చూపించాను. అంతే. సరుకు నాది కాదు.

బిస్మిల్లా: నాకు తెలియదన్నట్లు. ఆ రోజు కుమ్ముపెట్టడానికి నవాబు ఇచ్చిన కడియాలు కావూ ఇవి? నా ముందే కదా ఇచ్చింది!

హుస్నా: ఆఁ. ఆఁ. అదెప్పుడు?

బిస్మిల్లా: "ఉమ్రావ్ అక్క కచేరీ కావాలన్నాడు నవాబు. పూర్తి పంచ కావాలంది అక్క. నవాబుదగ్గర డబ్బులేకుండె. నా ముందే పెట్టె తెరిచి ఈ కడియాలు విసిరాడు" అని. "చూశావా అక్కా ఇవే కావూ ఆ కడియాలు?" అని నన్ను అడిగింది.

నేను: నన్నెందుకు అడుగుతావు? నువ్వేం అబద్ధాలు చెప్తావా?

బిస్మిల్లా: అదిగో ఆవాలు తిన్నాడు. ఇవి నవాబువని తెలిసిపోయింది. ఇక తిరిగి రావు.

హుస్నా: బాగుంది. మేమిచ్చిన డబ్బు?

బిస్మిల్లా: తప్పెక్కడ్నుంచి వచ్చింది? అదీ నవాబు సొమ్మేగా!

ఇంతలో నవాబు వచ్చారు. ఒంటరిగా హాజరయ్యారు. ముఖం చాలా నీరసంగా ఉంది. కళ్ళలో నీరు నిండివుంది. ఆ ఠీవి లేదు. ఆ దర్పం లేదు. ఆ గౌరవం లేదు. పర్వాహ లేదు. వచ్చి మౌనంగా కూర్చున్నారు.

వాస్తవానికి నా కళ్ళకు నీళ్ళు వచ్చాయి. నిగ్రహించాను. హాఁ బిస్మిల్లా బోగంవంటే అలా ఉండాలి. హాస్యం హాస్యమే కడియాల కథ మొదలుపెట్టింది.

బిస్మిల్లా: నవాబ్! మీరు ఆ రోజు కుదువపెట్టడానికి నాన్నాకు ఇచ్చిన కడియాలే కాదూ ఇవి?

నవాబు: అవును. అవే. దాని కుదువపెట్టలేదని నిజాదే?

బిస్మిల్లా: ఎంతకు పెట్టారు?

నవాబు: గుర్తులేదు. బహుశా రెండువందల యాభైకో. రెండువందల పాతికకో అయివుండవచ్చు.

బిస్మిల్లా: వడ్డీ ఎంత?

నవాబు: వడ్డీ విషయం ఆలోచించిం చెపను? సమయమే పోయింది. చెల్లించే గతి వస్తేగా వడ్డీ లెక్కలు.

బిస్మిల్లా: అయితే నేను తీసుకోనా?

నవాబు: తీసుకో.

బిస్మిల్లా: మీరు ఊఁ అంటే హస్నూ మియాఁను కాకాకు పంపుతాను.

నవాబు: వద్దు. నా తోడు. అతడు "సయ్యదు" (మహమ్మదీయులలో ఒక తెగ)

బిస్మిల్లా: వాడు సయ్యదా! తండ్రి ఎవడో తెలియదూ?

నవాబు: ఏమైనా కానీ. అందరూ చెప్పుకునేది అది.

నవాబు ధైర్యాన్ని మనసులోనే మెచ్చుకున్నాను. ఏమి ఔదార్యం? ఎంతైనా నవాబుల సంప్రదాయం!

ఎంతటి తెలివిగలరాలు బిస్మిల్లా! ఛట్జన్ పిలుస్తున్నాడనే మిషతో నవాబును త్వరగా వదిలించేసింది. ఎవరికి మాట ఇచ్చిందో ఆ భగవంతునికే తెలియాలి.

తరవాత రెండు మూడు రోజులకు నేను ఖాసిమ్ దగ్గర కూర్చుని ఉన్నాను. ఒక ముసలిది వచ్చి వంగి ఖాసిమ్‌కు సలామ్ చేసింది. ఖాసిమ్ కూర్చోవలసిందని సంజ్ఞ చేసింది. కూర్చుంది.

ఖాసిమ్ : ఎక్కణ్ణుంచి వచ్చావు?

ముసలిది : ఎక్కడినుంచి వచ్చింది ఏం చెప్పను? ఇక్కడ ఎవరూ లేరు కదా?

ఖాసిమ్ : అవ్వా. ఇక్కడెవరున్నారు. నేనున్నాను. నువ్వున్నావు. ఇది చిన్నపిల్ల. అర్థం చేసుకునేంత శక్తిలేదు. చెప్పు.

ముసలిది : నన్ను నవాబ్ ఫఖ్రున్నిసా బేగమ్ పంపారు.

ఖాసిమ్ : ఎవరు? ఫఖ్రున్నిసా బేగంగారా?

ముసలిది : మీకు తెలీదా? నవాబు షబ్బన్‌గారి.......

ఖాసిమ్ : అర్థమైంది చెప్పు.

ముసలిది : నన్ను బేగమ్‌గారు పంపారు. బిస్మిల్లాజాన్ తల్లిగారు మీరేనా?

ఖాసిమ్ : అవును. సంగతేమిటి?

ముసలిది : బేగంగారు ఇలా చెప్పారు "షబ్బన్ నాకు ఏకైక పుత్రుడు. నాకు అతడంటే ప్రాణం. తండ్రి కూడా ప్రాణాలిచ్చేవాడు. దాదాయి కూడా శత్రువు కాడు. తన బిడ్డలా చూసుకుంటాడు. వారికి ఒక్కతే కూతురు. షబ్బన్‌తో ప్రదానం జరిగింది. షబ్బన్ పెండ్లి చేసుకోనన్నాడు. దాంతో మండిపోయారు. నేనూ జోక్యం కలిగించుకోలేదు. బెదిరించడానికే ఇదంతా చేసింది. మీ అమ్మాయి జీవితాంతం కొలువుంటుంది. అబ్బాయి ఇచ్చే జీతంకంటే పది రెట్లు ఇస్తాను. అతణ్ణి పెళ్ళికి ఒప్పించండి. ఈ మాత్రం మేలుచేస్తే ఆస్తి అంతా అతనిదే అవుతుంది. ఈ ఇల్లు పాడుపడకుండా మాత్రం చూడండి. ఇందులో మీకూ మాకూ మేలు కలుగుతుంది. తరవాత మీ ఇష్టం."

ఖాసిమ్ : బేగమ్‌గారికి నా తరఫున సలాములు చెప్పి ఇలా విన్నవించు. "అల్లా తలచుకుంటే అంతా వారు తలపెట్టినట్లే జరుగుతుంది. నేను జీవితాంతం తమ దాసిని. ఏమాత్రం విరుద్ధంగా ప్రవర్తించను. నమ్మండి."

ముసలిది ఈ విషయం ఛబ్బన్‌కు తెలియరాదని బేగంగారు అన్నారు
సుంకు మనిషి తెలిస్తే ఒప్పుకోడు

ఖానమ్ ఎ రికంత ధైర్యం? (నన్ను చూపి) ఎ రిఖింయా ఖొక్క్రాడు

తరవాత ముసలిది ఖానమ్‌ను పేరుగా తీసికెళ్ళి ఏదో గుసగుస చెప్పింది నేను వినలేదు కాని ముసలిది వెళ్ళిపోయేప్పుడు ఖానమ్ 'మేము ఎంతో కాలంనుంచి మ ఉప్పు తింటున్నాం దీని అవసరం ఏమొచ్చింది అని బేగంగారికి విన్నవించు" అనడం విన్నాను

పద్దురాలు వెళ్ళిపోయింతరవాత ఖానమ్ బిస్మిల్లాను పిలిపించింది చెవిలో ఏదో మంత్రం ఊదింది మరుసటిసారి నవాబుగారు విచ్చేసి నప్పుడు కొలువుకాలంలో కూడా జరుగనంతటి గౌరవమర్యాదలు జరిగాయి నవాబుకు

నవాబుగారు కూర్చున్నారు నేను అక్కడే ఉన్నాను నవాబు గారు, బిస్మిల్లా సంభాషణలోకి దిగారు ఇంతలో బిస్మిల్లా గది గుమ్మం దగ్గర నుంచొని ఖానమ్‌గారు మేము రావచ్చా? అని అడిగింది బిస్మిల్లా నవాబుతో ''కొంచెం జరిగి కూర్చోండి అమ్మ వస్తూంది'' అని ఖానమ్‌తో 'రాండి' అన్నది

ఖానమ్ గదిలో ప్రవేశించి మూడుసార్లు సలాములు చేసింది ఇంత వినయంగా ఖానమ్ సలాము చేయడం నేను అంతకుముందు ఎన్నడూ చూడలేదు

ఖానమ్ పర్కారు శరీరం ఎలా ఉంది?

నవాబు (తల ఊంచి) అల్హమ్దులిల్లా

ఖానమ్ అల్లా ఆనందంగా ఉంచుగాక మ సంవత్సరం వేయారేళ్లు పెరగాలని ప్రార్థించేవాళ్ళమే మేము ఎంతకంతే ఉంటాం మళ్లీ మీ ముందు చేయి చాచవలసినవాళ్ళమే అల్లా తమను అమీరును చేశాడు ప్రస్తుతం తమ వద్దకు ఒక విన్నపంతో వచ్చాను అల్లా దయవల్ల బిస్మిల్లా మీ ఇద్దర సంవత్సరంనుంచి కొలువుచేస్తూంది అయినా ఎప్పుడూ తమకు శ్రమ ఇవ్వలేదు హుజూర్‌కు సలాము చేయడానికి వచ్చే అవకాశం ఏర్పడలేదు ప్రస్తుతం అలాంటి అవసరం వచ్చింది వచ్చాను మన్నించాలి

ఖానమ్ మాట్లాడుతుంటే అర్థంకాక బిస్మిల్లా ఆవిడ ముఖం చూస్తూ ఉండిపోయింది ఆ మాటల అంతర్యం కొంతవరకు నాకు అర్థం అయింది నవాబు పరిస్థితి అగమ్యంగా ఉంది ముఖంమీద క్షణానికి ఒక రంగు మారుతూంది .కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి అయినా మౌనంగా కూర్చున్నారు

ఖానమ్ అయితే విన్నవించనా ?

నవాబు (కష్టంగా) చెప్పండి

ఖానమ్ (నాతో) కాస్త బువా హుసేనీని పిలువు

నేను వెళ్ళి బువా హుసేనీని పిలిచి వచ్చాను

ఖానమ్ (బువా హుసేనీతో) ఆ శాలువల జత తీసుకురా ఆవే చిన్న అమ్మగారికి వచ్చినవి

అమ్మగారికి వచ్చినవి ' అనే పదం పిడుగులా పడింది నవాబు మీద అయినా స్థైర్యంగా కూర్చున్నారు బువా హుసేనీ శాలువలు తెచ్చింది జరీపని చేసినవి అలాంటివి తరచుగా కనిపించవు

ఖానమ్ (శాలువలు నవాబుకు చూపి) ఇవి చిన్న అమ్మగారికి వచ్చాయి ఒక్కొక్కటి రెండు వేలు అంటున్నాడు పదిహేను వందలవరకు కొనేవాళ్ళు సిద్ధంగా ఉన్నారు అతడు ఇవ్వడంలేదు నా కంటికి పదిహేడు పద్దెనిమిది వందలు చేస్తుందనిపిస్తోంది సర్కారు దయ తలచినట్లయితే ఈ ముసలితనంలో ఒక శాలువ కప్పుకుంటాను

నవాబు మౌనంగా కూర్చున్నారు బిస్మిల్లా ఏదో చెప్పబోతుండగానే ఖానమ్ 'ఆగు పిల్లా నువ్వు మధ్యన రాకు రోజూ కోరికలు కోరుతూనే ఉంటావు నాది ఒక్కటే కోరిక

ఖానమ్ ప్రభువులు మాట్లాడ్డంలేదు సెలవివ్వండి మౌనంతో ఈ దాసికి తృప్తి కలుగదు. సెలవివ్వండి అవునని. కాకుంటే కాదని నా మనసులోని కోరిక దూరమవుతున్నా అవుతుంది

అప్పటికీ నవాబు పలుకలేదు

ఖానమ్ సర్కార్ ! జవాబివ్వండి నేనెంత ! నా అంతస్తెంత ! జాగారుదాన్ని తమలాంటి వాళ్ళు ఇచ్చిన గౌరవమే. ఈ పిల్లల ముందు ముసలిదాన్ని వంచించకండి.

నవాబు కళ్ళు చెమ్మగిల్లాయి. "ఖానమ్‌గారు! శాలువ ఒక లెక్క కాదు. కాని నా పరిస్థితి మీకు తెలియనట్లుంది. బిస్మిల్లాజాన్ ఏమీ చెప్ప లేదా? ఉమ్రావ్‌జాన్‌కూడా ఆ రోజు అక్కడే ఉంది!" అన్నారు.

ఖానమ్: నాకు ఎవరూ ఏమీ చెప్పలేదు. ఏమి? చెప్పవేగా!

బిస్మిల్లా మళ్ళీ ఏమో చెప్పబోతే ఖానమ్ కనుసైగ చేసింది. ఆమె మాట మింగి ఇటూ అటూ చూచింది.

నవాబు: ప్రస్తుతం నేను మీ కోరికతీర్చే స్థితిలో లేను.

ఖానమ్: "మీ వగవాళ్ళు ఆ స్థితిలో లేకపోవాలి! రోజూ అదీ ఇదీ కావాలనే దుమ్మునాలిని కాను. కావాలన్నా ఒద్దన్నా బిస్మిల్లాకు తగు! నేను చూసుకుంటాను. నా కోరిక ఎంత నే నెంత?" అని ఒక నిట్టూర్పు విడిచి, "నా రాత ఇలా ఉంది. పెద్దపెద్ద అమీర్లు కాస్త గుప్తపిలికకోసం ముఖం వాటుచేస్తున్నారు."

ఖానమ్ మాట్లాడుతున్న ఒక్కొక్క మాట నవాబు గుండెలో ఒక్కొక్క బాణంలా గుచ్చుకుంటూ ఉండడం నేను గమనిస్తూనే ఉన్నాను.

నవాబు: మీ అర్థిత విషయం కాదు! మీ కోరిక తీర్చడానికి నిజానికి నా పరిస్థితి బాగుండలేదు.

తరవాత తాను ఆ స్థితికి రావడానికి గల కారణం సంగ్రహంగా చెప్పారు.

ఖానమ్: ఈ పేదవ కోరిక తీర్చే అర్హతలేనప్పుడు ఈ దాసీదాని కొంపకు రావలసిన అవసరం ఏముంది? హుజూర్! దాపుకుకూడా నాలుగు పైసలు కావాలి. భోగంది ఎవరి పెళ్లాం? అనే సామెత వినలేదా సర్కార్. మొహమాటానికి పోతే మా కడుపెలా నిండాలి? ఆఁ. అలా పస్తావంటారా మీ ఇల్లు కాదనను. కాని మీ మానమర్యాదల విషయం గుర్తుండాలి.

ఆ మాట అని వెంటనే గదిలోంచి వెళ్ళిపోయింది.

నవాబు: "బాక్షణంగానే తప్పుచేశాను. అవమానించు బాను" అని లేస్తుండగానే బిస్మిల్లా చేయిపట్టి కూర్చోబెట్టింది.

బిస్మిల్లా సరి ఈ కడియాల జత విషయం ఏమంటారు ?

నవాబు (కాస్త పరుషంగా) నాకు తెలీదు అన్నారు

బిస్మిల్లా అరే వాహ్ కోపమే వచ్చిందే వెళ్ళే దెక్కడికి ? ఉండండి.

నవాబు కాదు బిస్మిల్లాఖాన్ వెళ్ళనీ ఆమెకు రావడం నాదే తప్పు. మంచిరోజులు వస్తే చూద్దాం అయినా ఇంక మంచిరోజు లేమొస్తా యిలే

బిస్మిల్లా ఊహుం వెళ్ళనివ్వను

నవాబు మీ అమ్మతో చెప్పుదెబ్బలు తినిపించాలని ఉందా ?

బిస్మిల్లా నిజమే ఉమ్రావ్ అక్కా ! ఏమైందీ ముసలిదానికి ఇవ్వాళ ? ఎన్నో సంవత్సరాలనుంచి నా గదిలోకి తొంగైనా చూడలేదు ఇవ్వాళే వచ్చింది ప్రళయం తెచ్చింది అమ్మకు కోపం రానీ ఏమైనా కానీ నేను నవాబును విడువనక్కా ! ఇవ్వాళ వారికేం లేదు రేపు వస్తుంది మరి ఏం చేస్తున్నామూ ? ఎంతైనా నవాబు కదా ! వేల రూపాయిలు వచ్చాయి వారిదగ్గరినుంచి ఇప్పుడు గడ్డుకాలం వచ్చిందనుకో అంతమాత్రంతో ఇంటినుంచి వెళ్ళగొట్టటమేనా ? వీల్లేదు. అక్కా ! అమ్మ మరీ బలవంతం చేసిందనుకో (నవాబు చేయిపట్టు కొని) లేచిపోతా విన్నావా ? మనసులో మాట చెప్పేశాను

నాకు బిస్మిల్లా ధోరణి తెలుసు ఆవిడ అన్నదానికల్లా ఔనంటూ విన్నాను

బిస్మిల్లా అచ్ఛా నవాబ్, నీ ముకాం ఎక్కడ ?

నవాబు ఎక్కడని చెప్పను ?

బిస్మిల్లా ఎక్కడో ఉంటావుగా ?

నవాబు తహసీన్ గంజ్‌లో—మక్దూమ్‌బక్ష్ ఇంట్లో ఉంటున్నాను. మక్దూమ్ అంత విశ్వాసం గలవారని తెలుసుకోలేకపోయానందుకు విచారిస్తున్నాను. సిగ్గుగా కూడా ఉంది

**నేను:** మీ తండ్రిగారివద్ద కొలువున్నవాడేగా. మీరే కదూ అతణ్ణి కొలువులోంచి తీసివేసింది?

**నవాబు:** అవును ఆ ముస్తఫాబక్షే. అతడే పనికివచ్చాడు! అల్లా తలచుకుంటే........ అని ఆగిపోయారు.

నవాబు కళ్ళనుండి టపటప కన్నీరు రాలింది. తరవాత నవాబు బిస్మిల్లాను విడిపించుకొని గదినుండి వెళ్ళిపోయారు. వెళ్ళిపోయేప్పుడు నవాబుతో మాట్లాడుదామనుకొని లేచాను. కాని వేగంగా మెట్లుదిగి వెళ్ళిపోయారు. ఖానమ్ మాటలు నవాబు మనసును తీవ్రంగా గాయపరచాయి. ఆవిడ మాటలు దేనికి ఉపోద్ఘాతమో గ్రహించాను. నాకుమాత్రం ఎందుకో కలవరం కలిగింది. విషం గిషం ఏమైనా.........ఇంకేమన్నా ఉందా?

సాయంకాలం నేనూ, బిస్మిల్లా డోలీ ఎక్కి తహసీన్ గంజుకు వెళ్ళాం. ముస్తఫాబక్ష్ ఇల్లు దొరకడం కష్టమైంది. డోలీ మనుషులు గుమ్మం ముందు నుంచుని కేకవేశారు. ఒక చిన్న అమ్మాయి బయటికి వచ్చింది. ముస్తఫాబక్ష్ ఇంట్లో లేడని తెలిసింది. నవాబును గురించి తెలుసుకుంటే ఉదయం వెళ్ళి ఇంకా రాలేదని చెప్పారు. రెండు గంటలు ఎదురుచూచాం. ఇద్దరిలో ఎవరూ రాలేదు. నిరాశచెంది ఇంటికి తిరిగి వచ్చాం.

రెండవరోజు నవాబును వెదుకుతూ ముస్తఫాబక్ష్ వచ్చాడు. రాత్రికి కూడా ఇంటికి రాలేదని చెప్పాడు. నవాబు తల్లిదగ్గరినుంచి ముసలిది ఏడుస్తూ మొత్తుకుంటూ వచ్చింది. బేగంగారు వెర్రెక్కి పిచ్చిదానిలా అయిపోయారు. పెద్ద నవాబు ఆదోలా అయిపోయారని తెలిసింది.

తరవాత నవాబు ఛబ్బన్‌గారి జాడ తెలియలేదు. అది జరిగిన నాలుగైదు రోజులతరవాత నవాబు ఉంగరం బజారులో ఎవరో అమ్ముతూంటే పట్టుబడింది. అమ్మేవాణ్ణి అలీ రజాబేగ్ కొత్వాల్ (పోలీసు అధికారి) దగ్గరికి తీసికెళ్ళారు. అతడు ఇమామ్‌బక్ష్ సాకీ కొడుకు అమ్మవలసిందని తనకు ఇచ్చాడన్నాడు. అతణ్ణి పిలిపిస్తే దొరకలేదు. ఇమామ్‌బక్ష్ సాకీని పట్టితెప్పించారు. ముందు తనకేమీ తెలియదని బొంకాడు. కొత్వాల్ అదిరించి, బెదిరించింతరవాత ఒప్పుకున్నాడు.

**ఇమామ్‌బక్ష్:** హుజూర్! ఏటి ఇసుకపంతెనదగ్గర హుక్కా అమ్ముతాను. ఏటికి ఈతకు వచ్చేవాళ్ళు బట్టలు నాదగ్గర పెట్టి నదిలో మునుగుతారు. అయిదు రోజులక్రితం సంగతి. ఒక గొప్పవంశం

వారి బిడ్డ వచ్చాడు. వయసు ఇరవై ఇరవై రెండేళ్ళుంటుంది ఎర్రగా అందంగా ఉంటాడు. సాయంకాలం వచ్చి బట్టలు నాదగ్గర ఉంచి లుంగీ తీసుకొని నదిలో మునిగాడు. కొంతసేపు ఈదినట్లు కనిపించాడు. తరవాత కంటికి కనిపించలేదు. ఈతకు వచ్చిన వాళ్ళంతా నదినుండి బయటికి వచ్చి బట్టలు కట్టుకొని వెళ్ళిపోయారు. ఆ దొర రాలేదు. ఈదుతూ ఎటో వెళ్ళిపోయుంటాడని అతనికోసం చూస్తూ కూర్చున్నాను. జాము రాత్రివరకూ అక్కడే ఉన్నాను. మునిగిపోయుంటాడని నిశ్చయించుకున్నాను. ఈ విషయం తెలియజేస్తే జగడాల్లో ఇరుక్కుంటాను అనుకొని మెదలకుండా బట్టలు తీసుకొని ఇంటికి వచ్చేశాను. జేబులో ఈ ఉంగరం కనిపించింది. ఇంకో ఉంగరంకూడా ఉంది. దానిమీద ఏదో వ్రాసిఉంది. భయంతో దాన్ని ఎవరికీ చూపలేదు. ఈ ఉంగరాన్నికూడా అమ్మేవాణ్ణి కాదు. నా కొడుకు దురదృష్టం. ఎత్తుకొచ్చాడు.

మిర్జా రజా అలీబేగ్ కొత్వాలీ (పోలీసు స్టేషను లాంటిది) నుండి ఇద్దరు జవానులను వెంట పంపి మరొక ఉంగరమూ, బట్టలూ తెప్పించాడు. అది ముద్ర ఉంగరం. మిర్జా రజా అలీబేగ్ పెద్ద నవాబుకు ఈ వార్త పంపి బట్టలు, ఉంగరాలు పంపించాడు. ఇమామ్‌బక్ష్‌ను శిక్షించాడు.

బిస్మిల్లా: హా! హా! నవాబు ఛబ్బన్ మునిగిపోయాడు! ఈ హత్య అమ్మాజాన్ చేతులమీదుగా జరిగిపోయింది!!

నేను: ఆ రోజే నేను పనికట్టాను. వచ్చెదెవుదామని లేదాను. అంతలోనే మెల్లుడిగిపోయారు.

బిస్మిల్లా: బావు నెత్తిమీదికి వచ్చింది. పెద్ద నవాబు ఆస్తినుంచి తొలగించకపోతే చచ్చేవాడు కాదు.

నేను: ఆ తల్లి స్థితి ఎలా ఉందో భగవంతునికే తెలియాలి.

బిస్మిల్లా: పాపం పిచ్చిదైపోయిందట.

నేను: కాక ఏమౌతుంది? ఒక్కడే కొడుకు. మొదటే విధవ. పైగా ఇది నెత్తినపడింది. ఇక ఆ ఇంట్లో దీపం వెలగదు!

రుస్వా: అయితే నవాబు ఛబ్బన్‌ను నుంచి దంపాదు. నాకో ఒక విషయం అడగనా?

నేను   అడగండి

రుస్వా   నవాబుగారికి ఈత వచ్చా?

నేను   ఏమో తెలియదు అయినా ఎందుకు ఆ విషయం?

రుస్వా   ఏం లేదు ఈత వచ్చినవాడు తనంతతాను మునగలేడు

# 9

నా వలపులోతు తెలియుట వానివంతు కాదు
అలలను దాటించి తృప్తిచెందు టతని పని।

రుస్వాగారూ! మీరు ఎవరినైనా ప్రేమించారా?

రుస్వా   జీ నహీ! అల్లా క్షమించుగాక తాము ఎందరిమందిని వలపించిఉంటారు ఆ విషయాలు చెప్పండి అవి వినాలనే మా ఆతృత కాని మీరు చెప్పరు

ఉమ్రావ్   మాది వేశ్యావృత్తి మాకది ఉగ్గుతో పెట్టిన విద్య ఎందరిని వలలో వేయాలనుకుంటే వారిమీద పడి చస్తాం చావడంలో మాకన్న నిపుణులు ఉండరు నిట్టూర్పులు వదలడం, మాట మాటకు ఏడవడం రెండు రోజులు తిండి మానేయడం కాళ్ళు మాతిలో వేసి కూర్చోవడం విషంలాంటిది తినడం—ఇవి మా విద్యలు ఎంత రాతిగుండెవారైనా మా ఉచ్చులో పడాల్సిందే కాని మీతో సత్యం చెప్తున్నాము—నేను వలచటంగాని వలపించటం గాని చేయలేదు ఈ విషయంలో మహారాజ్ఞి బిస్మిల్లాజాన్. మామూలు మనుషుల సంగతి సరేగాని మహామహులు సైతం ఆమె వలపు వలనుండి తప్పించుకోలేకపోయేవారు ఆమెకు ప్రేమికులు వేలమంది ఆమె వేలమందికి ప్రియురాలు అసలు ప్రియుల్లో ఒక మౌల్వీగారు ఉండేవారు మామూలు పండితుడు కారు గొప్ప గొప్ప అరబ్బీ గ్రంథాలు అవగాహన చేసుకున్నవారు వారిదగ్గరికి దూరదూరాలనుంచి చదువుకోవడానికి వచ్చేవారు జ్ఞానవిషయాలలో వారిని మించినవారు లేరు అప్పటికి వారికి డెబ్బయికి తక్కువ ఉండవు తేజోవంతమైన వదనము తెల్లని గడ్డము.

సన్నని తల, తలగుడ్డ జోగుల జుబ్బా, వెత్తము వారిని చూస్తే ఒక సొగసులాడి మొగసాలిలో అలా పడిఉంటారని అనుకోవ డానికి వీలుండదు

ఒకనాటి సంగతి వినిపిస్తాను ఇందులో ఏమాత్రం అతిశయోక్తి లేదు ఉన్నదున్నట్లు చెపుతున్నాను మీ మిత్రులు కీర్తిశేషులు మీర్ గారుకూడా అక్కడే ఉన్నారు వారికి దిల్ రుబాజాన్‌తో సంబంధం ఉండేది స్వయంగా కవి మంచి కవిత అంటే ప్రాణాలిచ్చేవారు. ఆ సందర్భంలోనే అందాన్ని ఆరాధించే ఆసక్తి కలిగింది నగరంలో పేరుగల వేశ్యల్లో వారు మాడని వేశ్య ఇల్లు లేదు

రుస్వా అవును బాగా తెలుసు చెప్పండి

ఉమ్రావ్ మీకు గుర్తుండవచ్చు బిస్మిల్లా తల్లితో పోట్లాడి కొన్నాళ్ళు బట్టలకొట్ల వెనుకభాగంలో మకాం పెట్టింది

రుస్వా నేను ఆ ఇంటికి ఎప్పుడూ వెళ్ళలేదు

ఉమ్రావ్ సరి బిస్మిల్లాను చూడ్డానికీ, తల్లీ కూతుళ్ళకు రాజీ కుదిరించ డానికి నేను తరచు వెళ్ళుతుండేదాన్ని ఒకనాటి సాయంకాలం ఆవరణలో బల్లపీటమీద బాలీసుకు ఆనుకొని కూర్చునిఉంది మీర్ గారు దగ్గర కూర్చున్నారు మౌల్వీ మహాశయుడు దూరంగా కూర్చున్నారు అప్పటి వారిముఖం మరువలేను పాపం ఎంత నిరాశ। ఎంత ఉదాసీనత। జపమాల మాత్రం మౌనంగా తిప్పు తూ వేఉన్నారు నేను వెళాను బిస్మిల్లా నా చేయిపట్టుకొని కూర్చోబెట్టింది మీర్‌గారికీ మౌల్వీగారికీ సలాముచేసి కూర్చు న్నాను బిస్మిల్లా చెవిలో ఊదింది "తమాషా చూస్తావా?" అని. నేను ఆశ్చర్యంగా తమాషా ఏమిటి?" అని అడిగాను

బిస్మిల్లా "చూడు" అని ముంగిటిలో ఉన్న పాత వేపచెట్టు ఎక్క- మనిపించని మౌల్వీగారిని ఆజ్ఞాపించింది

మౌల్వీగారు తిప్పుకున్నారు గడగడ వణికారు నాకు నవ్వొ వచ్చింది మీర్‌గారు ముఖం తిప్పుకొని కూర్చున్నారు పాపం మౌల్వీ గారు ఒకసారి ఆకాశాన్ని మరొకసారి బిస్మిల్లాను చూస్తున్నారు. "వెంటనే" రెండవ ఉత్తరువు "ఎక్కమంటున్నాను" మూడవ ఆదేశం.

మౌల్వీగారు బిస్మిల్లా అని లేచారు బిస్మిల్లావైపు చూచారు. ఆమె తీవ్రంగా ' ఊఁ ' అన్నది

మౌల్వీగారు పైజామా పైకెక్కించి చెట్టు ఎక్కసాగారు కొంత దూరం ఎక్కి బిస్మిల్లావైపు చూచారు చాలా ఇంకా ఎక్కాలా అని అడుగుతూంది ఆ చూపు

బిస్మిల్లా "ఇంకా" అన్నది

మౌల్వీగారు మరికొంత ఎక్కి మళ్ళీ చూచారు "ఇంకా" అన్నది బిస్మిల్లా చివరిదాకా ఎక్కి మళ్ళీ చూచారు తరవాత లేత కొమ్మలు మాత్రమే బిస్మిల్లా "ఇంకా" అంటే మౌల్వీగారు క్రింద పడడం అల్లాకు అతిథిగావడం జరిగిపోయేది నేను బిస్మిల్లా కాళ్ళు పట్టుకున్నాను మీర్ గారు ప్రతిమాలి సిఫారసు చేశారు అప్పుడు దిగు అనే శాసనం వెలువడింది మౌల్వీగారు ఎక్కడానికి ఎక్కారు గాని దిగడం మాచెడ్డ కష్టం అయింది ఎప్పుడు పడిపోతారో అనిపించింది నాకు కాని భగవంతుని దయవల్ల క్షేమంగా దిగివచ్చారు ఒడలంతా చెమటపట్టింది శ్వాస వేగంగా సాగింది పడిపోయేవారే కాని నెంటా కిందకొని పాంకోళ్ళు తొడుక్కొని బల్లదగ్గరికి వచ్చారు కూర్చొని బనం సాగించారు కూర్చోవడం కూర్చున్నారుగాని పైజామాలో చీమలు దూరడంవల్ల చిరాకుపడుతున్నారు

రుస్వా వాహ్! బిస్మిల్లా చాల చతుర పెళ్ళలా ఉంది

ఉమ్రావ్ ఆదా చతురత్వం? ఆ పాషాణం మెదలకుండా కూర్చుంది. కనీసం పెదవులమీద చిరునవ్వు లేదు మీర్ గారికీ, నాకూ పొట్ట చెక్కలు అవుతూంది

ప్రియుని కఠోరవర్తితల ద్రాగి వేగినాను
నింక ఇరుముల పేర్కొనవేల! అదేమి లెక్క!

రుస్వా ఈ ఒక్క వాక్యం చాలు జీవితాంతం నవ్వడానికి అయితే కావన కావాలి మీరు చెపుతున్నపుడు నా కళ్ళముందు బిస్మిల్లా, మౌల్వీగారి పవిత్ర వదనం, మీర్‌గారు, మీరు, వేపచెట్టు అన్నీ కొట్టొచ్చినట్లు కనిపించాయి ఇది వెంటనే నవ్వు వచ్చే వృత్తాంతం కూడా కాదు. శాస్త్ర యోచించండి, నవ్వుతారు నాకు నవ్వు కాదు మౌల్వీగారి మూర్ఖత్వం చూచి ఏడుపువస్తూంది బిస్మిల్లా, అల్ప

ఎంత అసాధ్యురాలు! డెబ్బయి ఏండ్ల ముసలివాణ్ణి చెట్టెక్కమన్నది అతడు ఎక్కాడు అంతా అయోమయం చిక్కు సమస్య

ఉమ్రావ్ మీకెలా అర్థం అవుతుంది? దానివెనుక ఒక రహస్యం దాగి ఉంది

దుప్పా. అయితే చెప్పండి ఇంకేమైనా అవమానం జరిగిందా?

ఉమ్రావ్ జరిగిందా? జరిగిందంతా ముందే ఉంది వినండి

మౌల్వీగారు వెళ్ళిపోయినతరవాత బిస్మిల్లాను అడిగాను "ఏమైంది నీకు" అని

బిస్మిల్లా ఏం?

నేను. డెబ్బయి ఏళ్ళ ముసలివాడు చెట్టుమీదినుంచి పడితే ఊరికే చచ్చేవాడుగా

బిస్మిల్లా చస్తే పీడాపోయేది ఈ వెధవ ముసలివాడంటే నాకు వళ్ళు మండుతూంది నా "దమ్మూ' ను వదేస్తే దాని వెన్నెముక కాస్తా విరిగింది

విశేషమేమంటే బిస్మిల్లాజాన్ ఒక కోతిని పెంచింది ఆ కోతి బిస్మిల్లాకు ప్రాణం దాని ఆడంబరం వినండి అట్లాసు చొక్కా వల్వెట్ టోపీ వెండి మురుగులు మెడలో గొలుసు, చెవులకు బంగారు దుద్దులు, తినడానికి జిలేబీలు, అమృతకేళీలు కొన్నప్పుడు వెధవ, చిన్నగానే ఉండి రెండు మూడేండ్లలో బాగా తిని దున్నలా బలిసిపోయింది తెలిసినవారి సంగతి సరేగాని కొత్తవాళ్ళమీద పడిందో ప్రాణాలు తీసిపోయేవి. మంచి మగవాడిచేతిని పట్టుకుంటే దాన్ని విడిపించుకోలేకపోయేవాడు దాని దంత బలం అలాంటిది

మౌల్వీగారిని చెట్టెక్కించిన రోజుకు క్రితంరోజు విషయం ఆ మహాశయుడు విచ్చేసి బల్లమీద కూర్చున్నారు బిస్మిల్లా కొంటెపని చేయాలనుకుంది దమ్మూకు సంజ్ఞచేసింది అది మెల్లగా వెనకనుంచి వచ్చి ఎగిరి మౌల్వీ భుజంమీద కూర్చుంది మౌల్వీ తిరిగిచూసి బెదిరిపోయారు గట్టిగా విదిలించారు కోతి కింద కూలింది దానంతట అదే వెళ్ళిపోయినా వెళ్ళిపోయేంతవరకు మౌల్వీగారిని చూసి "గుర్ గుర్"

అన్నది వారు కర్ర చూపించారు భయపడి బిస్మిల్లా ఒడిలోకి దూకింది. బిస్మిల్లా దానికి కొంగు కప్పి మౌల్వీని ఇష్టంవచ్చినట్లు తిట్టింది అప్పటికీ కోపం చల్లారలేదు రెండవ రోజూ ఆ శిక్ష

రుస్వా తగిన శిక్షే

ఉమ్రావ్ కావచ్చు బిస్మిల్లా మౌల్వీని కొంతముచ్చుమ చేసింది

రుస్వా మౌల్వీగారు నిజంగా శిక్షార్హులే మజ్నూ లైలాను ప్రేమించి బడిలో కూర్చుండబెట్టుకుంటే మౌల్వీ బిస్మిల్లాకు ఇష్టమైన కోతిని విదిలిస్తారూ కర్ర చూపుతాడూ। అన్యాయం ప్రేమకే అది తీరని ద్రోహం

ఉమ్రావ్ తిరిగి మొదలెట్టింది

ఒకనాటి రాత్రి ఎనిమిది గంటలప్పుడు బిస్మిల్లా గదిలో ఉన్నాను. బిస్మిల్లా పాడుతూంది నేను తంబురా మీటుతున్నాను అలీఖాగారు తబలా వాయిస్తున్నారు ఇంతలో మౌల్వీ మహాశయులు వేంచేశారు

బిస్మిల్లా (చూడగానే) వారం రోజులనుండి వస్తాలేరే?

మౌల్వీ ఏం చెప్పను? ఈ తడవ జ్వరం తీవ్రంగా వచ్చింది బ్రతికి బయటపడ్తాననుకోలేదు కాని నిన్ను చూడాలని ప్రాణాలు నిలుపుకొని వచ్చాను

బిస్మిల్లా అల్లాను వేడుకునేవారే

ఆ మాట విన్నా అలీఖాను బాధపెట్టింది

మౌల్వీ నేను చస్తే నీకేం లాభం?

బిస్మిల్లా సుభానల్లా! ప్రతి సంవత్సరం మీ ఉరుసు (సమాధివద్ద జరుగు సంవత్సరీకం) కు వెళ్తాం అది. పాడి ప్రజలను రంజింపచేస్తాం మీ కీర్తి దిగంతాలకు వ్యాపింపచేస్తాం.

అలా కొన్ని మాటలతరవాత మళ్ళీ పాట మొదలైంది. సందర్భానుసారంగా ఈ పాట సాగించింది

గుర్తులేదు మరణవేళ మృత్యుశయ్యపైని
గొంతుకొచ్చె పలికిపలికి అదే చెలియ

మౌల్వీగారు ఆవేశంలో మునిగిపోయారు కన్నీరు కాలువ కట్టింది గడ్డంలోనుంచి బాష్పబిందువులు రాలుతున్నాయి ఇంతలో ఎదురుగా ఉన్న తలుపు తెరుచుకుంది ఒక చామనచాయ మనిషి ప్రవేశించాడు కోల ముఖం నల్లని గడ్డం కసరత్తు శరీరం బిగుతుగా ఉన్న అంగరఖా. వదులు పైజామా ముఖ్మల్ బూట్లు పూల కంఠవా అతణ్ణి చూడగానే బిస్మిల్లా "అయ్యో! పది రోజుల తరవాత ఇప్పుడా దర్శనం? చాలు, ఇక వెళ్ళండి ఇలాంటి ప్రేమ నాకు నచ్చదు ఆ ఎరుపువాళ్ళ గోల సేకి? అందుకే ముఖం తప్పించారు గాబోలు"

అతను (ముఖస్తుతి ధోరణిలో) కాదు మహారాణీ! ఆ రోజునుంచీ తీరికలేదు తల్లిగారికి చాల జబ్బుచేసింది అక్కడే ఉండిపోయా.

బిస్మిల్లా అవును మహారాజా! ఇంకేం చెపుతారు? బేయిస్ హూతుధ మీద కన్ను పడిందని చెపుతారా? అవిక దర్బారులో నేగా రాత్రులు గడుస్తున్నాయి? మాకూ వార్తలు అందుతుంటాయి మాకు చెప్పడానికి తల్లిగారి జబ్బు సాకు

ఈ మాటలు విని మౌల్వీగారు వెనక్కు తిరిగిచూచారు వారిద్దరి చూపులు కలిశాయి మౌల్వీగారు ముఖం తిప్పుకున్నారు రెండో అతని ముఖంమీద నెత్తుటిచుక్క లేదు కాళ్ళు చేతులు వణికాయి తక్షణం తలుపు తీసుకొని మెట్లుదిగి వెళ్ళిపోయాడు బిస్మిల్లా పిలుస్తూనేఉంది అతడు కనీసం జవాబు చెప్పలేదు వెళ్ళిపోయాడు

బిస్మిల్లా కొంతసేపు మౌనంగా ఉండిపోయింది తరవాత బొమలు ముడిపెట్టి తరవాత చూద్దాం" అనుకొని పాటలో మగ్నం అయిపోయింది

మళ్ళీ ఆ వచ్చినతను బిస్మిల్లా దగ్గరికి రాలేదు మౌల్వీగారు మాత్రం వస్తూనేఉన్నారు

రుస్వా పూర్వకాలం మనుషులంతా అంతే పట్టుదల కలవారు

ఉమ్రావ్ పాట సాగుతూనేఉంది నేను ఇక్కడ ఉన్నానని తెలిసినట్లుంది గోహర్ మిర్జా వచ్చాడు బిస్మిల్లాకూ అతనికీ నవ్వులూ, పరిహాసాలూ జరిగేవి తిట్లనుంచి కొట్లాటవరకూ పోయేవి. నాలో ఆ కవిత్వంపు లేదు.

గోహర్‌మిర్జా వచ్చి మా ఇద్దరిమధ్యన కూర్చున్నాడు. చప్పున రెండుచేతులూ బిస్మిల్లా మెడలో వేసి "ఓహ్! ఏం పాడుతున్నావే! నిన్ను చూస్తే........" అన్నాడు.

అది చూచి మౌల్వీగారి ముడుతల ముఖము వణకసాగింది. అమాంతంగా గోహర్‌మిర్జా దృష్టి మౌల్వీగారిమీద పడింది. బాగా చూచాడు. బిస్మిల్లా మెడ వదిలి తన చెవులు పట్టుకున్నాడు. తుళ్ళిపడి వెనక్కు జరిగి భయపడినట్లు నటించాడు. అది చూచి బిస్మిల్లా విరగబడి నవ్వింది. ఖలీఫా చిరునవ్వు నవ్వాడు. నేను నోటికి గుడ్డ అడ్డుపెట్టుకున్నాను. మౌల్వీగారు తత్తరపడి లేపబోయారు కాని బిస్మిల్లా "కూర్చో" అంటే కూర్చుండిపోయారు. బిస్మిల్లా ఎంత కొంటెది? గోహర్‌మిర్జా తన ప్రేమికుల్లో ఒకరని చూపి మౌల్వీని మండించదలచుకుంది. గోహర్ మిర్జా పెద్దగా నవ్వసాగాడు. చాలసేపు వంచించింది మౌల్వీని. నిప్పుల్లో పొర్లాడినట్లుంది పాపం వారిస్థితి. నవ్వీ నవ్వీ నా పొట్ట చెక్కలు అవుతూంది. చివరకు మౌల్వీగారి స్థితిని చూచి నాకు దయ కలిగింది. విషయం చెప్పేశాను. దాంతో బిస్మిల్లాకు నామీద కోపం వచ్చింది. నేను గోహర్ మిర్జాతో "అనుకున్న పని అయిందిగా. ఇక వెళ్ళు" అన్నాను. గోహర్ మిర్జాకు నాతో సంబంధం ఉందిగాని బిస్మిల్లాతో కాదని తెలిసి మౌల్వీగారు తృప్తిచెందారు. ముఖం చాటంత అయింది.

రుస్వా: మౌల్వీగారిది పవిత్ర ప్రేమకదా!

ఉమ్రావ్: కాపచ్చు. పవిత్ర ప్రేమే.

రుస్వా: అయితేమాత్రం? ఎందుకంత కోపం?

ఉమ్రావ్: వాహ్! పవిత్ర ప్రేమకు ఈర్ష్య ఉండదనా? ఉంటుంది.

రుస్వా: ఉంటే అది పవిత్ర ప్రేమ కానేకాదు.

ఉమ్రావ్: అది వారి మనసుకే తెలియాలి. నేను అర్థం చేసుకున్నది అది.

# 10

నవాబ్‌దగ్గరున్న వేశ్యల్లో నేనుతప్ప మిగిలినవారంతా అందకత్తెలే అయినా ఖుర్షీదును మించినవారు మాత్రం లేరు ఆమె అప్సర పసిడి రాయ బ్రహ్మ స్వయంగా తీర్చిదిద్దినట్లున్న ముక్కూ ముఖమూ విశాల నేత్రాలు కాలు సేతులు పెరుగు మూసలోంచి తీసినట్లుంటాయి గుండ్రని ముంజేతులు చక్కని భుజాలు ఆకసంనుంచి దిగివచ్చిన అప్సరలా ఉంటుంది ఏ బట్ట కట్టినా అద్దినట్లుంటుంది ఆ అందం ఆ ఆకర్షణ ఆ మార్దవం ఒక్కచూపుతో అజన్మాంతం దాసులైపోవాలసిందే సభలో కూర్చుంటే కొవ్వొత్తి వెలిగిన్నట్లుంటుంది పందలమంది వేశ్యలున్నా దృష్టి ఆమెమీదనే పడుతుంది కాని అందానికి తగిన గీత లేదు అదృష్టాన్ని నిందించడం ఎందుకు? స్వయంగా జీవితం నాశనం చేసుకుంది వాస్తవానికి ఆమె వేశ్యకాదగింది కాదు 'బేస్వాడ జమీందారు కూతురు ముఖం చూస్తేనే తెలిసిపోతుంది జమీందారు కూతురని ఉత్తమురాలు అందానికి ఆటపట్టు తనను ఎవరూ ప్రేమించడమనుకుంటుంది అది ఆమె పిచ్చి పిచ్చికాకుంటే ఆమెను చూచి ప్రేమించనివాడెవ్వడు? దాసానుదాసుడు కానివాడెవ్వడు? ముందు ప్యారేసాహెబ్‌తో వలపు కలిగింది వేల రూపాయిలు వెచ్చించాడు అవసరంటే ప్రాణాలిచ్చేవాడు ఖుర్షీద్ కూడా బాగానే వదిలించింది తనను ప్రేమిస్తున్నాడని తెలిసింతరవాత తానూ ప్రేమించింది ఒక్కరోజు రావడం ఆలస్యం అయితే తిండి మానేసేది ఏడుస్తూ కూర్చునేది మేమంతా చెప్పాం "ఖుర్షీద్! ఏమిటి పిచ్చి? మగవానికి విశ్వాసం ఉండదు నువ్వు అతల్ని ప్రేమించావు అంతే పెండ్లిగిండ్లీ కాలేదుగా ఇలాగే చేశావో చెడిపోతావు తరవాత విచారించి ప్రయోజనంలేదు" అని ప్యారేసాహెబ్‌కూ తెలిసిపోయింది ఖుర్షీద్ ప్రేమిస్తూందని వదిలించలేక పోగాడు వస్తే రాత్రంతక్కు ఉండిపోయేవాడు రాకుంటే రావడమే మానేసేవాడు ఖుర్షీద్ ఏడ్చేది మొత్తుకునేది తిండి తినేదికాదు విచిత్రంగా ఉండేది ఆమె స్థితి నాకసు ఖుర్షీదును అసహ్యించుకుంటుంది. రావడం మానేసింది తిండి ఆపేసింది పనివాళ్ళకు జీతాలు నిలిపేసింది

ఆ అందంతోపాటు గుండెలో వలపు ఎవరు నింపాడో అర్థంకాలేదు ఎవరికో ఒకరికి పెళ్ళామయితే బావుండేది. వాడు రోజూ ఆవిడ కాళ్ళు కడిగి నెత్తిన పోసుకునేవాడు. ఖుర్షీద్ కాలి కొనగోటికి చాలదు బిస్మిల్లా పైగా ఆ టెక్కు, ఆ నిక్కు, ఆ గర్వం అల్లాకే తెలియాలి. మౌల్వీగారి విషయం విన్నారుగా! మిగతా విటులతోకూడా ఆమె వ్యవహారం అంతే. అసలు సంగతి ఆవిడకు తాను ధనవంతురాలనని గర్వం. వాస్తవానికి డబ్బు కూడా అపారంగా ఉండేది. ఎవరినీ లెక్కచేసేది కాదు. ఖుర్షీద్‌మీద అనేక ఆశలు పెట్టుకున్నది ఖానమ్. ఆవిడలో వేశ్యాత్వం ఉంటే వాస్తవంగానే లక్షలు గడించాలిసింది. ఆ అందానికి తగిన గొంతు లేదు. నాట్యంలో పట్టి మొద్దు. ముందు ముందు చాల కచేరీలు వచ్చాయి. ఆటపాటల్లో అట్టే పరిజ్ఞానంలేదని తెలిసి ఎవరూ పిలువలేదు. వచ్చేవాడల్లా ఆవిడ అందానికి మురిసి వచ్చేవాడు. వచ్చినవాడల్లా ఆవిడంటే పడిచచ్చేవాడు. ఈ మహారాణి ముడుచుక్కూర్చునేది. ఆమెను వలపుదేవత ఆవహించింది. ఎవరితోనూ ఉల్లాసంగా ఉండేదికాదు. జనం రావటం మానేశారు. మిగిలింది ఒక్క ప్యారేసాహబ్ మాత్రమే. విచిత్రం చూడండి. ప్యారేసాహబ్ తండ్రి రాజాగ్రహానికి గురియైనాడు. ఇల్లు జప్తు అయింది. జాగీరు లాక్కోబడింది. పాపం చితికిపోయాడు. అయినా ఖుర్షీద్ ప్రేమమాత్రం తగ్గలేదు. ఇంట్లో ఉంచుకొమ్మని పట్టుపట్టింది. తండ్రి కోప్పడతాడని ప్యారేసాహబ్ అందుకు అంగీకరించలేదు. ఖుర్షీద్ ఆశలు అడియాసలైనాయి.

ఖుర్షీద్ మెత్తని మనిషి. మోసగించి వందలు కాజేసేవారు జనం. ఫకీర్లు, సాధువులు అంటే ఆమెకు చాల భక్తి. ఒకసారి ఒక స్వాములవారు విచ్చేశారు. వారిదగ్గర ఒకటిని రెండు చేసే మహిమ ఉండేది. ఖుర్షీద్ తన గాజులు, సొమ్ములు తీసి ఇచ్చింది. ఫకీరు మహాశయుడు పచ్చికుండ తెప్పించాడు. దానిలో నల్ల నువ్వులు నింపించి ఆభరణాలన్నీ అందులో పెట్టించాడు. మూతవేసి పట్టుబట్ట మూతికి కట్టి వెళ్ళిపోయాడు. వెళ్ళేప్పుడు ఈరోజు విప్పవద్దని, తెల్లవారి విప్పాలని చెప్పిపోయాడు. ఉదయం మూత తీస్తే నల్ల నువ్వులు మాత్రమే మిగిలాయి.

ఒక గోపాయి నోట్లోంచి నల్ల నాగు పడగతీసి ఎల్లింది. ఇది విప్పు కాటువేస్తుంది అన్నాడు. ఖుర్షీద్ దుద్దులు తీసిఇచ్చేసింది. ఆమెకు కోపం వచ్చేదికాదు. అలాంటి ఉత్తమస్త్రీ సంసారుల్లోకూడా ఉండటం కష్టం. కాని ఒకరోజు కోపం వచ్చింది. ఆ రోజు ప్యారేసాహబ్ పెండ్లిబట్టలు ముక్కలు ముక్కలుగా చించేసింది. రెండు రోజులు ఏడ్చింది. ఎంత

మంది చెప్పినా వినలేదు జ్వరం వచ్చింది రెండు నెలలు మంచం పట్టింది ఏమకలంగూడా అరిగిపోయింది వైద్యులు తీయ అన్నారు అల్లా దయవల్ల రెండు నెలల్లో బాగైపోయింది ఫ్యాదేసాహబ్‌తో బంధం తెగిపోయింది తరవాత చాలమందితో పరిచయం కలిగింది కాని ఎవరి తోనూ మనసు కలవలేదు అన్నీ లాంఛనంగా జరిగేవి మనసులు కలవలేదు

# 11

శ్రావణమాసపు సాయంకాలం వర్షం కురిసి వెలిసింది చౌకులోని మిద్దెలమీదా ఎత్తైన గోడలమీద అక్కడక్కడ ఎండ పొడచూపింది పశ్చిమదిశన సంధ్యారాగం పరుచుకుంది తెల్లబట్టలవారు చౌకులో కూడు తున్నారు ఈరోజు ప్రత్యేకంగా జనసందోహం ఎక్కువ ఉండటానికి కారణం శుక్రవారం అయిష్‌బాగ్ జాతరకు సాగిపోతున్నారు జనులు. ఖుర్షీద్ అమీర్‌జాన్ బిస్మిల్లా, నేనూ జాతరకు వెళ్ళడానికి అలంకరించు కుంటున్నాము అప్పుడే అదిన ధాన్యపురంగు ఓణీలు ఇచ్చిపోయాడు రంగులవాడు ఎంపిక జరుగుతూంది తలలు దువ్వుకుంటున్నారు. కొప్పులు దిద్దుతున్నారు విలువైన సొమ్ములు తీయబడుతున్నాయి ఖానమ్ ఎదురుగా బల్లమీద బాదిసుకు ఆనుకొని కూర్చునిఉంది బువా హుసేనీ వచ్చి [1]పేశ్వాజ్ పెట్టి వెళ్ళిపోయింది ఖానమ్ ముందు మీర్‌గారు కూర్చునిఉన్నారు జాతరకు వెళ్తామంటున్నారు తనకు సుస్తీగా ఉందనీ, తాను రానని అంటున్నారామె ఆమె రావుండాలని మేమూ మనసుల్లో కోరుకుంటున్నాం ఖానమ్ లేకుంటేనే జాతర సంబరం

ఆనాటి ఖుర్షీద్ అందం చూడాలి ధాన్యపురంగు మల్మలు [2]దుపట్టా. నీలిరంగు పైజామా బిగుతైన చొక్కా చేతులకు సన్నని బంగారు గాజులు రాళ్ళ ముక్కుపుడక చెవులకు బంగారు దుద్దులు, మెడలో ముత్యాల హారము అందం విరజిమ్ముతున్నట్లుంది గదిలో నిలువుటద్దంలో నా ముఖం చూసుకుంటుంటే ఆ సౌందర్యరాశి కనిపించింది నాకే ఆ అందం ఉంటేనా ఆ ప్రతిబింబాన్ని నేనే ప్రేమించేదాన్ని, అదిన వ్యథ ఏమంటే తనను వలచేవాడు లేడని ఫ్యాదేసాహబ్ విడిపోవడంతో

---

1 మోకాళ్ళ గోళ్ళంగల పొడుగాటి చొక్కా.

2 మహిళలు వేసుకునే ఓణీలాంటిది.

ముఖం ఉదాసీనం అయింది ఆ ఔదాసీన్యంలో కూడా అందం ఉంది అందమైనవారు ఎలాఉన్నా సొగసే! ఆ అప్సరసను చూస్తే మనసులో గిలిగింతలు పెట్టినట్లు అవుతుంది మరొక ఉపమానం గోచరించడం లేదు సుకవి కవిత విన్నప్పటి ఆనందంలా ఉంది

బిస్మిల్లా వికారం అయింది కాదు. దామెసెదాయ వెడల్పు ముఖం కొట్టిముక్కు విశాల నేత్రాలు. పలచని పెదవి అల్లికపువని చేసిన క్రేప్ దుపట్టా వేసుకుంది ఆకుపచ్చని పైజామా తొడిగి నఖశిఖపర్యంతం విలువైన ఆభరణాలు ధరించింది పైగా ఆడపూలు పెళ్ళికూతురులా ఉంది హాస్యం కొంటెతనం ఉండనే ఉన్నాయి జాతరలో ఒకరిని వెక్కిరిస్తుంది ఒకరిమీద చూపుతూపులు విసురుతుంది అతడు మళ్ళీ చూస్తే ముఖం తిప్పుకుంటుంది మరచాను మేము అలంకరించుకొని మేనాలలో ఎక్కి జాతర చేరాం

జాతరలో ఇసుకవేస్తే రాలని జనం బొమ్మలమ్మేవారు మిఠాయి దుకాణాలు పండ్లవాళ్ళు పూలమాలలు అమ్మేవాళ్ళు [1]తాంబూలీలు, [2]పాతీసులు జాతరల్లో ఉండేవన్నీ ఉన్నాయి నా కవేమీ అవసరంలేదు మనుషుల ముఖాలు చూడ్డం నాకు సరదా ముఖ్యంగా సంతల్లోనూ జాతరల్లోనూ అనేక రకాల ముఖాలు కనిపిస్తాయి సంతోషులు అసంతోషులు దరిద్రులు, ధనవంతులు బుద్ధిహీనులు బుద్ధిమంతులు, ఉత్తములు, అధములు ఉదారులు కృపణులు అంతా కనిపిస్తారు ఒకతను పెద్ద అంగరఖా పొడవైన సిల్కుమగత టోపీ యాజ్ఞటుడికి జారిన పైజామాతో నడుస్తున్నారు ఒకతను చందనపురంగు తలగుడ్డ చుట్టుకొని బోగంవాళ్ళను చూస్తూ తిరుగుతున్నారు ఇంకొకతను వచ్చింది జాతర చూడటానికే అయినా పరాకు చిత్తగిస్తున్నారు పెళ్ళాంతో పోట్లాడుకొని పిచ్చి ఆవృతి ప్రశ్నలకు ఇప్పుడు జవాబులు తోచినట్లుగా గొణుగుకుంటూ పోతున్నాడు మరొకతను ఒక చిన్నపిల్ల వ్రేలుపట్టుకొని నడుస్తున్నారు మాటకు అమ్మ అనే పదం వాడుతున్నారు అమ్మ అన్నం వండుతుంటప్పుడు అమ్మ విసుక్కుంటుండవచ్చు అమ్మ పడుకునుండవచ్చు ఇప్పుడు ఏం చేస్తుందో? ఎన్నెన్నో కోరికలు కోరకు అమ్మ వైద్యునిదగ్గరికి వెళుతుంది ఒకతను ఏడెనిమిదేళ్ళ అమ్మాయిని భుజంమీద ఎక్కించుకొన్నాడు. అమ్మాయి ముక్కుకు చిన్న నత్తు ఉంది ఎత్తు కొప్పు. ఎప్పటి ఉత్తి, వేళకి ఏండి మురుగులున్నాయి ఆ పసిదాని రెండు

1 [illegible]
2 గాజులు, పూసలు మొదలగు ముత్యపుదండలు అమ్మేవారు

చేతులు గట్టిగా పట్టుకున్నాడు మురుగులు లాక్కుంటారేమోనని పట్టుకున్నట్లున్నాడు పాపం। అమ్మాయి చేతులు నొప్పులు ఏడుపుముఖం పెట్టింది అలాంటప్పుడు మురుగులు పెట్టి తీసుకొనిరావటం ఎందుకు చెప్పండి?

ఇదిగో ఇంకో మహాశయుడు మిత్రబృందం సహితంగా కోరిన... తిట్లు అమ్మా! ఆ తినమ్మా జేబులోంచి పైసా తీసి తాంబూలి దుకాణం లోకి విసిరాడు ధనికుడని తెలిసింది పైస రెండు పైసలు ఒక లెక్క। వెంటనే హుక్కా సాకీని పిలిచాడు 'ఏయ్! సాలి! ఇలా రా హుక్కా వెలుగుతుందా? ఈలోగా ఇంకొక మిత్రుడు వచ్చాడు సలాము కర హాలచాలు క్షేమం అడగటం జరిగాయి అరే! తాంబూలాలపైనా తివి పించరా వెధవ తాంబూలి పాన్ అందించగానే లాక్కున్నాడు అతడు డబ్బు ఇవ్వండే చిరాకుపడి రొంటినుంచి డబ్బుతీసి మాకూ కూడా రెండు పాన్లు ఇవ్వు యాలక్కాయ వెయ్యి సున్నం ఎక్కువ వెయ్యొద్దు' అని అరే భాయి చిలమ్ అయినా త్రాగించు" అడిగాడు కొట్టుమీదినుంచి చిలమ్ తీసేవరకు సాకీ గుర్రెత్రచేసి చూసింది వెంటనే జేబులోంచి డబ్బుతీసి అందించాల్సివచ్చింది

గోహర్‌మిర్జా మోతీ సరస్సు ఒడ్డున తివాచీ పరిపించాడు అక్కడే చెట్లల్లో అటూ ఇటూ తిరిగాం సాయంత్రంనుంచి రెండు గడియల రాత్రిదాకా జాతరలో తిరిగాం ఇంటికి వెళ్ళడానికి మేనాలలో ఎక్కాం చూస్తే ఖుర్షీద్ మేనా ఖాళీగా కనిపించింది ఎంత వెదికినా కనిపించలేదు చివరకు నిరాశచెంది ఇంటికి వచ్చాం వినగానే ఖానమ్ నెత్తీ నోరూ బాదుకుంది ఇల్లంతా విచారంలో మునిగిపోయింది నేను రాత్రంతా ఏడిచాను ప్యారేసాహబ్ ఇంటికి మనిషి వెళ్లాడు పాపం పరిగెత్తుకొని వచ్చాడు. తనకు ఏమాత్రం తెలియదని, తాను జాతరకుపైతం వెళ్ళలేదని, బేగమ్ శరీరం బాగాలేదని పెళ్లాల్లు విని అనుమానం రావ్తా తీరింది కారణం ఏమంటే పెళ్లి తరవాత భార్యను విడిచిఉండడంలేదు చాకు వైపు రావటంకూడా మానేశాడు రాత్రి అయితే ఇంటినుంచి వెళ్లేవారే కాదు ఖుర్షీద్ కనిపించలేదనే వార్త విని పూర్వప్రేమ గుర్తుకువచ్చి నట్టుంది వచ్చేశాడు

ఖుర్షీద్ తప్పిపోయినతరవాత నెల పదిహేను రోజులకు ఒక మహాశయుడు నా గదిలో అడుగుపెట్టాడు నడత పట్టుకప్పు పొగరుగావిలా ఉంది. దాసువటాడు ఒక గాలప సరుముముల్ మురొకటి తలపాగ కట్టు

కున్నాడు వచ్చి రత్నకంబళీమీద కూర్చున్నాడు అతనిలో కాస్త అల్పత్వం కనిపించింది వేశ్యల ఇండ్లకు ఎక్కువగా వెళ్ళనివానిలా లేడు గదిలో నేను ఒక్కత్తెనే ఉన్నాను బువాహుసేనీని పిలిచాను ఆవిడ వచ్చింది ఆవిడను చూచి అతడు లేచినుంచున్నాడు సిగ్గు పడుతూ బువాహుసేనీ చేయిపట్టుకొని వేరుగా వెళ్ళి ఏదో మాట్లాడాడు ఆ మాటల్లో కొన్ని వినిపించాయి కొన్ని వినిపించలేదు తరవాత బువా హుసేనీ ఖానమ్‌దగ్గరికి వెళ్ళింది మళ్ళీ మాటలు జరిగాయి చివరకు తేలిందేమంటే నెల డబ్బు ముందుగా ఇవ్వాలి అతను నడుముకు కట్టి ఉన్న రూపాయిల సంచీ తీశాడు బువాహుసేనీ కొంగు చాచింది గల గలమని రూపాయిలు కొంగులో పోశాడు

బువాహుసేనీ  ఎన్ని ఉన్నాయి?

అతను  తెలియదు లెక్కించండి

బువాహుసేనీ  నాకేం తెలుస్తుంది లెక్క?

అతను  డెబ్బైఅయిదు ఉండవచ్చు—ఒకటి రెండు ఎక్కువా తక్కువా

బువాహుసేనీ  అయ్యో! డెబ్బైఅయిదంటే ఎన్ని?

అతను  మూడు ఇరవైలు పైన పదిహేను—పాతిక తక్కువ నూరు

బువాహుసేనీ  పాతిక తక్కువ నూరు అంటే ఇది ఎన్ని రోజులకు?

అతను  పదిహేను రోజులకు మిగతా పదిహేను రోజులది రేపిస్తాను మొత్తం నూటయాభై బిళ్ళలు మీకు రేపు అందుతాయి

"బిళ్ళలు" అనే మాట నాకు బాగనిపించలేదు దాంతో అతను ఎలాంటివాడో తెలిసిపోయింది కాని వేశ్యావృత్తి పరాధీనపు బ్రతుకు ఏం చేయగలను?

బువాహుసేనీ డబ్బు తీసుకొని ఖానమ్‌దగ్గరికి వెళ్ళింది ఎలా అంగీకరించిందో తెలియదు ఖానమ్ పెద్దపెద్ద అమీర్లదగ్గరకూడా డబ్బువిషయంలో ఒక్క నిమిషం ఆలస్యం కానిచ్చేదికాదు ఒకరోజంతా వేచిఉండటానికి అంగీకరించింది.

తరవాత వాడు నా గదిలో నిత్యాగతుడైపోయాడు. ఎప్పుడో కాని

రాత్రి తరవాత తలుపు తట్టినట్లు వినిపించింది. అతను వెంటనే లేచి కూర్చున్నాడు. వెళ్తాను "మళ్ళీ రేపు రాత్రికి" అని అన్నాడు. నవ రత్నాలు మూడు ఉంగరాలు ఇచ్చివెళ్ళారు. వాటిల్లో ఒకటి రత్నపుది రెండవది వైడూర్యపుది. "ఇది నీకోసం కానుకగా ఇవ్వబడ్డది" అని చెప్పి ఇచ్చారు. వేళ్ళకు పెట్టుకొని చూశాను. చాల అందంగా ఉన్నాయి. పెట్టె తెరిచి నవరత్నాలను ఉంగరాలను [1]చోర్‌ఖానాలో వేసి మూసేశాను.

రెండవరోజు రాత్రికి వచ్చారు. నేను విద్యాభ్యాసంలో ఉన్నాను. వచ్చి పక్కన కూర్చున్నాడు. వాద్యపువాళ్ళకు అయిదు రూపాయిలిచ్చారు. ఉస్తాద్ జీ సారంగివారూ పొగడ్త సాగించారు. అతని వదుమునకు ఉన్న శాలువ కొట్టేయ్యాలని ఉస్తాద్ జీ ప్రయత్నం. నోరు తెరిచి అడిగారు కాని శాలీ అతను ఇవ్వలేదు.

అతను ఉస్తాద్ జీ! డబ్బు గిబ్బు ఏది కావాలన్నా ఉంది. కాని ఆ శాలువ ఇవ్వలేను. అది ఒక మిత్రుని గుర్తు.

ఉస్తాద్ జీ ముఖం మాడ్చుకున్నారు.

తరవాత చదువు ముగిసింది. బువా హుసేనీకి మిగతా డెబ్బై అయిదు రూపాయిలిచ్చి తన తరఫున ఆవిడకు అయిదు రూపాయిలు ఇచ్చారు. ఆవిడ వెళ్ళిపోయింది. గదిలో మేమిద్దరమే ఉన్నాం.

అతను రెండు నెలల క్రితం ఐష్‌బాగ్ జాతరలో

నేను అయితే రెండు నెలల తరువాతనా!

అతను లక్నోలో లేను. బయట వెళ్ళాను. మళ్ళీ వెళ్ళాలి

నేను లోగపుటప్పా సాగించాను

నేను అయితే నన్ను వదిలి వెళ్ళిపోతారన్నమాట

అతను కాదు. త్వరలోనే వచ్చేస్తాను

నేను మీ ఇల్లెక్కడ!

అతను ఇల్లు ఫరుఖాబాదులో. లక్నోలో చాల తక్కువ ఉంటుంది. ఇక్కడే ఉంటాను. అప్పుడప్పుడు బయట వెళ్ళవస్తుంటాను.

---

[1] [illegible]

నేను ఈ గాజులు ఎవరి గుర్తు?

అతను ఎవరిదీ కాదు

నేను వాహ్ అర్థమైంది అది మీ ప్రియురాలి గుర్తు

అతను హుఁ నీతోడు నాకెవరూ లేరు అన్నీ నువ్వే

నేను అయితే ఇచ్చేయండి

అతను ఇవ్వలేను

నేను భరించలేకపోయాను ఇంతలో మరకతాలు గల పెద్దపెద్ద ముత్యాలహారము పచ్చలుతాపిన మురుగుల జత రెండు బంగారపు ఉంగరాలు నాముందు ఉంచాడు వాటన్నింటిని తీసుకొని పెట్టెలో పెట్టి మూసేశాను వేల రూపాయిలు ఇలా ఇచ్చేస్తున్నాడు కాని ఆ గాజులు ఎందుకు ఇవ్వడు? మహాఅయితే అది అయిదువందల ఖరీదుచేస్తుంది పట్టుపట్టి సాధించాల్సినంతగా కనిపించలేదు

అతని పేరు ఫైజలీ జాము జామున్నర రాత్రికి ఒక్కొక్కప్పుడు అర్థరాత్రికి వచ్చేవాడు జాముర్రాత్రి ఉండగా లేచివెళ్ళిపోయేవాడు తరచుగా తలుపుతట్టిన శబ్దంగాని ఈలగాని వినిపించేది అది వినిపించగానే ఫైజలీ వెళ్ళిపోయేవాడు నెలా పదిహేను రోజులు గడిచాయి నా పెట్టె ఆభరణాలతో నిండిపోయింది నవరత్నాలు రూపాయలు లెక్కలేవు ఖానమ్, బువా హుసేనీలకు తెలియని పది పన్నెండువేల సొమ్ము నాదగ్గర కూడింది

ఫైజలీ విషయంలో నాకు ఇష్టంగానీ అయిష్టంగానీ లేదు అయిష్టత కలగాల్సిన అవసరం ఏమి? అతడేమంత అనాకారి కాదు రెండవది డబ్బు విచిత్రం అయింది వాడు వచ్చేవరకూ తలుపువైపే నా చూపుం డేది ఇప్పుడు గోహర్ మిర్జా పగటిపూట మాత్రం వస్తున్నాడు రాత్రి వచ్చేవాళ్ళకుకూడా నేను ఒకరికి కట్టుబడిపోయానని అర్థం అయింది కాబట్టి త్వరగానే వెళ్ళిపోయేవారు తిష్టవేసుకుని కూర్చునేవారిని ఏదో ఒక నెపంతో పంపించేదాన్ని

ఖుర్షీద్ కోసం గాలించడం జరిగింది కాని జాడ తెలియలేదు ఈలోగా ఫైజలీకి నామీద ప్రేమ కలిగింది అతడు దాన్ని అనేకవిధాల

వ్యక్తంచేశాడు తొలుత గోహర్‌మిర్జాను ఎంచుకుంటకపోయినప్పటికీ ఫైజలీని ప్రేమించేదాన్నే. అతనికే హృదయం అర్పించేదాన్ని. అయినా అతనిని వంచింపచేయడంలో కొరత రానీయలేదు. ప్రేమిస్తున్నానని ఫైజలీని మోసగించాను. పాపం నిప్పూరు ఎలలో ఎక్కారు. అతడు రహస్యంగా నాకు ఇచ్చింది ఇతరులకు తెలియదు. నవాబ్ జవా హూసేసేల ఆదేశం ప్రకారం కొన్ని కోరవలసివచ్చేది. అది తీర్చడం కూడా తన విధిగా భావించేవాడు. అతనికి తప్పించే లెక్కలేదు. రాకుమారులలోగాని అమీర్లలో అలాంటి మనిషి కనిపించలేదు.

రుస్వా ఎక్కువ సొమ్ముకు వెనకా ముందేమి! అలాంటి గుండె ఇంకొకనికి ఎలా ఉంటుంది?

ఉమ్రావ్ ఎక్కువ సొమ్మేం!

రుస్వా కాకుంటే తల్లి మెడలోంచి తెచ్చిస్తాడా?

ఉమ్రావ్ ఏమో! ఎవకేం తెలుసు!

# 12

రాత్రిళ్ళు వచ్చేవాళ్ళలో పన్నామల్ చౌదరీ ఒకడు. రెండు గంటలు కూర్చొని వెళ్ళిపోయేవారు. సభాగురిలో కూర్చోడమే వారికి సరదా. మర్యాద సరిగా జరుగుతూఉండిన వతంలో వచ్చేపోయేవారి విషయంలో పట్టింపులేదు. నెలకు రొక్కం రెండువందల ఇచ్చేవారు. ఫైజలీతో పరిచయం కలిగినతరవాత వారి రాకపోకలు తగ్గాయి. ప్రతిరోజూ వచ్చేవారల్లా రెండు మూడు రోజులకు రాసాగారు. ఒక్కొక్కసారి పదిహేను రోజులవరకు వస్తూఉండేవారు కారు. వచ్చినా చిన్నబుచ్చుకొని కూర్చునేవారు.

పన్నామల్ : ఏదాకా రాలేదా!

నేను - ఏమి

పన్నామల్ : ఇంట్లో దొంగతనం జరిగింది. ఎన్నోతరాల ఆర్జన ఊడ్చుకుపోయింది.

నేను : (తుళికిపడి) ఏమీ? దొంగతనమే! ఎంత సొమ్ము పోయింది?

పన్నామల్ : అంతా పోయింది. మిగిలిందేమి? రెండు లక్షల జవహరీ మాయమైంది.

మనసులో నవ్వుతున్నాను. నవ్వెందుకంటే అతని తండ్రి పన్నామల్ కోటీశ్వరుడని ప్రతీతి. రెండు లక్షలు పెద్దమొత్తమేకాని ఆయన విషయంలో కాదు. ఒకరకంగా ముఖం పెట్టి విచారం వ్యక్తపరచాను.

పన్నామల్ : ఇవ్వాళ రేపు పట్నంలో దొంగతనాలు ఎక్కువ అయినాయి. నవాబు 'మలికె ఆలమ్' ఇంట్లో దొంగతనం జరిగింది. గుప్తి దర్వాజుగా ఉంది. బయటినుంచి దొంగలు ఎన్నార్లవి వినికిడి. పాపం మీర్జా అలీబేగ్ ఆశ్చర్యపడుతున్నాడు. పట్టణంలో దొంగ లందరినీ పిలిచారు. అయినా జాడ తెలియలేదు. వాళ్ళంతా చెవులు పట్టుకొని ఇది మా పని కాదని చెప్పారు.

పన్నామల్ వెళ్ళిన రెండవ రోజు గదిలో కూర్చొనివున్నాను. చౌకులో గొడవ జరిగింది. నేనూ [1]చిల్మను దగ్గరికి వచ్చి చూస్తే గందరగోళంగా ఉంది. జనసమ్మర్దం ఎక్కువగా ఉంది.

ఒకడు : చివరకు పట్టుపడ్డాడుగా!

రెండోవాడు : కొత్వాల్ అంటే ఇలా ఉండాలి.

మూడోవాడు : అన్నా! ఏమన్నా సొమ్ము దొరికిందా?

నాలుగోవాడు : చాల దొరికింది. అయినా దొరకాల్సింది చాలా ఉంది.

అయిదోవాడు : మియాఁ ఫైజూ కూడా పట్టుబడ్డట్టున్నాడే?

ఆరోవాడు : ఓహో! ఏమి వస్తున్నాడయ్యా!

మియాఁ ఫైజూను త్రాడుకట్టి తీసుకొనిరావడం నా కళ్ళతో చూచాను. వెంట సిపాయీ లున్నారు. జనసు తొక్కిడికి దుమ్ము లేస్తూంది. మియాఁ

[1] వెదురుబద్దలతో చేసిన తెర.

ఫైజూ ముఖంమీద తండువా వేసుకున్నాడు. ముఖం కనిపించలేదు. ఇది మధ్యాహ్నపు వృత్తాంతం.

మామూలుగానే శామురాత్రికి ఫైజలీ వచ్చాడు. రాపటం రావటమే బయట వెళ్తున్నామని. ఎల్లుండి వస్తామని చెప్పాడు. "చూడు ఉమ్రావ్ జాన్! నేను నీకిచ్చినదానిని గురించి ఎవరికీ వెల్లడించవద్దు. ఇవాహుసే నీకిగాని. ఖానమ్‌కుగాని చూపవద్దు. నీవే వాడుకో. ఎల్లుండి తప్పక వస్తా. వరేగాని కొద్దిరోజులు మావెంట వస్తావా?" అడిగాడు.

నేను : నేను పరాధీనసని మీకు తెలిసిందేగా? ఖానమ్‌గారి అధీనంలోని దాన్ని. ఆవిడను అడగండి. ఆవిడ ఇష్టపడితే నాకేమీ అభ్యంతరం లేదు.

ఫైజలీ : మీకు విశ్వాసం ఉండదనే మాట నిజం. నేను నీవంటే ప్రాణా లిస్తాను. నీవేమో ఇలాంటి నీరసపు జవాబు చెపుతావా? మంచిది. ఇవాహుసేనీని పిలువు.

ఇవాహుసేనీని పిలిచాను. ఆమె వచ్చింది.

ఫైజలీ : ఈవిడ కొద్దిరోజులు మావెంట రావడానికి వీలుంటుందా?

హుసేనీ : ఎక్కడికి?

ఫైజలీ : ఫరుఖాబాదు. నేను మామూలు మనిషినేమీ కాదు. అక్కడ నా జాగీరు ఉంది.

ప్రస్తుతానికి రెండు నెలలు అక్కడ ఉంటాను. ఖానమ్‌గారు అంగీకరిస్తే రెండు నెలల డబ్బు ముందుగానే ఇస్తాను. కొంత ఎక్కువగా ఇవ్వమన్నా ఇస్తాను.

హుసేనీ : ఖానమ్ ఒప్పుకుంటుందని నాకు నమ్మకంలేదు.

ఫైజలీ : అయినా అడుగు.

ఇవాహుసేనీ ఖానమ్‌దగ్గరికి వెళ్ళింది.

నాపరకు ఇవాహుసేనీని ఖానమ్‌వద్దకు పంపడంవలన ప్రయోజనం లేదని తెలుసు. ఆవిడ అంగీకరించదు. ఈ వ్యక్తి ఇక్కడే ఇంతగా ఆదరిస్తున్నాడు. వాళ్ళ ఊరికి వెళ్తే ఎంత ఆదరిందాడి! నేనిలా అను

కుంటూఉండగానే బువాహూసేనీ వచ్చి బయటవెళ్ళడం ఏమాత్రం సాధ్య పడదని చెప్పింది

ఫైజలీ    రెండింతలు డబ్బిస్తాను

హూసేనీ    నాలుగింతలు ఇచ్చినా సాధ్యపడదు అని చెప్పింది

ఫైజలీ:    పోనీ ఏం చేస్తాం

బువాహూసేనీ వెళ్ళిపోయింది ఫైజలీ కళ్ళల్లోంచి టపటప కన్నీరు రాలింది అతని స్థితిచూచి జాలి కలిగింది ప్రేమికుల అవిశ్వాసాన్ని గురించి కథల్లో గాథల్లో చదివినప్పుడు నాకు విచారం కలిగేది ఇతని వెంట వెళ్ళకుంటే నేనూ విశ్వాసంలేనిదాననని కృతఘ్నురాలననీ అన డంలో సందేహంలేదు అతనివెంట వెళ్ళిపోవాల్సిందేనని నిశ్చయించు కున్నాను

నేను    నేనూ వస్తాను

ఫైజలీ    వస్తావా?

నేను    ఎవరేమన్నా వచ్చేస్తా!

ఫైజలీ    ఎలా?

నేను    రహస్యంగా

ఫైజలీ    అయితే నిన్ను తీసుకెళ్ళడానికి ఎల్లుండి జామురాత్రి ఉండగా వస్తాను మోసగించవద్దు సుమా

నేను    నా ఇష్టంతో వస్తానన్నాను మాట ఇచ్చాను చూడండి నా మాటకూడా

ఫైజలీ    మంచిది చూదాం

ఆ రాత్రి ఫైజలీ జామున్నర రాత్రి ఉండగా వెళ్ళిపోయాడు అతను వెళ్ళిపోయినతరవాత ఆలోచించాను మాట ఇచ్చానుగాని వెళ్ళడమా మానడమా అని ఫైజలీ ప్రేమ, నా వాగ్దానం జ్ఞాపకం వచ్చాయి వెళ్ళ దలుచుకున్నాను ఇంతలోనే ఎవరో అడ్డుపెడుతున్నట్లనిపించింది ఏమో ఏమి అవుతుందో! ఎలా తెలుసు?

ఆలోచనలతోనే తెల్లవారింది. ఏ నిశ్చయానికి రాలేదు. పగలంతా ఇవే ఆలోచనలు మనసులో మెదలాయి. అదృష్టవశాత్తు ఆ రాత్రి ఎవరూ రాలేదు. గదిలో ఒంటరితనం. ఆలోచనలు. చివరకు కన్ను మలిగింది. పొద్దెక్కేదాకా నిద్రలోనే ఉన్నాను. గోహర్ మిర్జా వచ్చి లేపాడు. నాకది బాగనిపించలేదు. పగలంతా ఏదో చిరాకు. ఏమాటమీదనో బువా హుసేనీతో తగాదా జరిగింది. ఆ జ్ఞాపకం వచ్చింది. కచేరీకి ఎక్కణ్ణుంచో పిలుపు వచ్చింది. 'వెళ్తావా?' అని బువాహుసేనీ అడిగింది. అప్పుడు నాకు తలనొప్పిగా ఉండింది. వెళ్ళనని కచ్చితంగా చెప్పేశాను. బాగుంది. ఆహ్వానం వచ్చినప్పుడు నిరాకరిస్తే ఎలా? ఈ వృత్తిలో ఉండి ఇంకేం చేస్తావు? అన్నది బువాహుసేనీ. 'వెళ్లను వెళ్లను వెళ్లను.' వాళ్ళు ప్రత్యేకంగా నీ పాట కోరి పంపారు. ఖానుమ్ మాట ఇచ్చింది. డబ్బుకూడా తీసుకుంది. తరవాత మీ ఇష్టం అన్నది. నేను వెళ్ళను. డబ్బు వాపసు చెయ్యండి అన్నాను.

బువాహుసేనీ: నీవేం తెలియనిదానివా? ఖానుమ్‌గారు డబ్బుతీసుకున్న తరవాత వాపసు ఇవ్వడం అంటూ ఉంటుందా?

నేను: ఒకవేళ ఎలా చస్తేనేం. ఖానుమ్‌గారు తప్పివ్వకుంటే నేను ఇస్తాను

హుసేనీ: ఒహో! డబ్బుగలదానివి అయిపోయావు. తే ఇచ్చేస్తాను

నేను: ఎంత?

హుసేనీ: వంద

నేను: ఇంది తీసుకుంటావా? ప్రాణం తీసుకుంటావా?

ఎందుకోగాని ఆ రోజు బువాహుసేనీకూడా మొండికెత్తింది

హుసేనీ: అంత ఉన్నదానివి అయితే ఇచ్చెయ్యి

నేను: సాయంకాలం ఇస్తాను

హుసేనీ: అక్కడ వారు వచ్చి కూర్చొనివున్నారు. సాయంకాలందాకా ఎందుకాగుతారు?

ఈవిడదగ్గర డబ్బెక్కడిది? ఈ నెపంతో బలవంతం చేస్తే ఒప్పుకుంటుంది అనుకున్నది. నా పెట్టెలో అప్పటికి ఎంత లేదన్నా వేయి వది

చేయటం వివాహం చేసే బలవంతం నా సంకల్పాన్ని గట్టిపరిచాయి అయినా అప్పటికి పూర్తిగా నిశ్చయించుకోలేదు రాత్రికి ఫైజలీని అతని స్థితిని చూసి స్థిరపరచుకున్నాను

రుస్వా కాదు ముందే మీరు ఒక నిశ్చయానికి వచ్చేశారు అందుకే గౌహర్ మిర్జా కొంటెతనమూ వివాహం చేసే బలవంతమూ మిమ్ము బాధించలేదు కాకుంటే అది మామూలే అయివుండాలి మీకు సాధారణంగా ఇలాంటివి జరుగుతుంటాయి

ఉమ్రావ్ సరే ఒప్పుకున్నాను అయినా నన్ను అడ్డేవారెవ్వరు? నిజం చెపుతున్నాను వెళ్ళేప్పుడు ఎవరో ఉమ్రావ్! వెళ్ళకు నా మాట విను అని చెవిలో చెప్పినట్లు అనిపించింది రెండు మూడు మెట్లు దిగిన తరవాత ఎవరో లాక్కుపోతున్నట్లూ ఒకరు వెళ్ళవద్దని చెప్పినట్లూ అనిపించింది కాని వినలేదు వెళ్ళిపోయాను

రుస్వా ఆపిన బలవంతుడెవరో? అతని మాట మీరు వినలేదు శిక్ష అనుభవించారు

ఉమ్రావ్, అర్థమైంది అది ఒక శక్తి దుష్కార్యములు చేయవద్దని హెచ్చరించేది సత్కార్యములు చేయవలసిందని ప్రోత్సహించేది

రుస్వా కాదండీ అది మీరన్న శక్తికాదు ఖానమ్ ఇంట్లో ఉండటం ఏమంత మంచి పని? అది మంచిది కాదని తాను భావించినట్లు మీ మాటలనుబట్టి తెలుస్తోంది బహుశః పరిస్థితుల వత్తిడివల్ల మీరు అలా చేసి ఉంటారు కాని ఖానమ్ ఇంట్లో ఉన్నదానికంటే ఒక మనిషిని కట్టుకొని ఉండటం వేయిరెట్లు మేలు వాస్తవం ఏమంటే ఫైజలీ ఉదారస్వభావం, అతని ప్రేమభావం మిమ్మల్ని అతనివెంట వెళ్ళవలసిందని ప్రోత్సహించాయి మరొకరు దూరి మనసులను కలిపెట్టడంలో మీకున్న ఆసక్తి మిమ్ము అలా చేసి ఉంటుంది ముఖపాముద్రికంలో ప్రజ్ఞావంతులు అయిపోయారు

అయినప్పటికీ జాతరలో మనుషుల మనసులు పరిశీలించిన ప్రత్యేకంగా ప్రశ్నగా విన్నాను ఫైజలీ దగ్గర మీరిచ్చిన ప్రకటనం కాలేదు అయినా ఆతని ముఖము, మాట నడవడితో అతనివెంట వెళ్ళే తప్పక

ఏదో ప్రమాదం వాటిల్లుతుందని గ్రహించేవుంటారు. కాని ఆతని తీపి మాటలు, ధనపు ఆశ మీ కళ్ళముందు ఒక తెర దించాయి. మీరు మానసిక శాస్త్రం చదువలేదు. ఆ శాస్త్రం చదివివుంటే ఆతని వలలో పడివుండేవారు కారు.

ఉమ్రావ్ : ఏదైన పుస్తకం సూచించండి. చదువుతాను.

ఖానమ్ ఇల్లు చౌకులో సురక్షిత ప్రదేశంలో ఉంది. పశ్చిమాన బజారు. ఉత్తర, దక్షిణదిశల్లో ఎత్తైన వేశ్యల ఇండ్లూ ఉన్నాయి. ఒక పక్క బీబాజాన్ ఇల్లు. రెండో పక్క హుసేనీ దాసిఇల్లూ ఉండేవి. వెనుక మీర్ హుసేన్ అలీగారి దివాణం. ఎటునుంచీ దొంగ దూరే అవకాశం లేదు. ముగ్గురు మనుషులు రాత్రిళ్ళు కాపలా కాసేవారు. ఫైజలీ రాకపోకలు మొదలైననాటినుండి ఒకడు పెద్దదర్వాజావద్ద ప్రత్యేకంగా కాపుండేవాడు. ఎందుకంటే ఫైజలీ చాల రాత్రికి వచ్చేవాడు. రాత్రి ఉండగానే వెళ్లిపోయేవాడు. తలుపు తీయడానికీ, మళ్ళీ మూసి తాళం వేయడానికీ ప్రత్యేకంగా ఒకణ్ణి నియమించడం జరిగింది.

వాగ్దానం ప్రకారం ఫైజలీ రాత్రికి వచ్చాడు. కొంతసేపు ఎలా వెళ్ళాలా అని ఆలోచన సాగింది. ఇంతలో కావలివాడు ఆవులించాడు. వాడు మెలకువతో ఉన్నాడని గ్రహించి ఫైజలీ వాణ్ణే లోపలికి పిలిచాడు. "ఇదిగో చూసావా. బహుమానం ఎప్పుడూ ఇవ్వలేదు నీకు. తలుపు దగ్గరేసి ఉంచు. మేము మేలుకునే ఉన్నాం. భయం లేదు" అన్నాడు.

కావలి "మక్కా" సలాము చేసి వెళ్ళిపోయాడు. "పద పోదాం" అన్నాడు ఫైజలీ. సొమ్ముల పెట్టె మొదలే తెప్పించేశాను. రెండు జతల బట్టలు మూట కట్టించాను. అది చంకన పెట్టుకొని అక్కడే దర్వాజవైపున నడిచాను. బావిసలి సంతదగ్గర ఎద్దులబండి సిద్ధంగా ఉంది. ఇద్దరమూ అందులో కూర్చున్నాం. 'హిండోలాకేనాకా' దాటి కొంతదూరం వెళ్ళగానే ఫైజలీ గుర్రాన్ని తీసుకొని సైసువాడు కలిశాడు. అతడూ మా బండి వెంట వచ్చాడు. ఉదయానికి మోహన్‌లాల్‌గంజ్ చేరాం. అక్కడ సత్రంలో మధ్యాహ్నంవరకు మకాం. పూటకూళ్ల అవ్వతో వండించుకు తిన్నాం.

ఉప్పులేనిది మిరపప్పప్పు చప్పన
సుంతసైతం లేదు నేతివాసన

మూడోరోజు రాయ్‌బరేలి చేరాం. అక్కడి ప్రయాణానికి తగిన బట్టలు కొన్నారు. లక్నోనుంచి తెచ్చిన బట్టలు (?) మూట కట్టాను.

లక్నోనుంచి చిన్న ఎడ్లబండి రాయ్‌బరేలీ నుంచి తిరిగిపోయింది. అక్కడ మరొక బండి బాడుగకు తీసుకొని హాల్‌గంజ్‌వైపు సాగాం. అది రాయ్‌బరేలీకి తొమ్మిది పది కోసుల దూరంలో ఉంది. సాయంకాలం అవుతుండగా ఆ ఊరు చేరాం. ఆ రాత్రి సత్రంలో మకాం. అవసరమైన సామగ్రి తేవడానికి ఫైజలీ బజారుకు వెళ్ళారు. మేము విడిసిన గదికి దగ్గర్లో ఉన్న మరొక గదిలో ఒక స్త్రీ బస దిగింది. పేరు వసీబన్. మనిషి ఎక్కువ బాగున్నాయి. కావడానికి పల్లెదే అయినా ఛాయ బాగుంది. మాటతీరు పట్నంవాళ్ళలా ఉంది. నేను ఆమెతో మాటాసేపు మాట్లాడాను

వసీబన్ ఎక్కడినుంచి వస్తున్నారు?

నేను: ఫైజాబాదునుంచి

వసీబన్ ఫైజాబాదులో నా చెల్లెలుంది. బహుశః మీకు తెలిసిఉండవచ్చు.

నేను (నేను వేశ్యనని గుర్తుపట్టేసింది) నాకేం తెలుసు?

వసీబన్ ఫైజాబాదులో మమ్మల్ని ఎరుగనివారు లేరు

నేను చాలా కాలంనుంచి వీరి ఇంట్లోనే ఉంటున్నాను. వీరు లక్నోలో ఉంటారు. నేనుకూడా ఎక్కువగా అక్కడే ఉంటున్నాను

వసీబన్ పుట్టిల్లు ఫైజాబాదేనా?

(ఈవిడ చెప్పేది నిజం. కాని జవాబు ఏం చెప్పాలి)

నేను అవును పుట్టడం ఫైజాబాదులోనే. చిన్నతనంనుంచి బయటనే ఉంటున్నాను

వసీబన్ అయితే ఫైజాబాదులో ఎవరినీ ఎరుగవు?

నేను ఎరుగను

వసీబన్ ఇటు ఎందుకు వచ్చినట్లు?

నేను  వీరివెంట

నసీబన్  వెళ్ళడం ఎక్కడికి ?

నేను  ఉనావ్

నసీబన్  లక్నోనుండినుంచి వచ్చారా ?

నేను  అవును

నసీబన్  వక్కడి తోవ వదిలి ఇటెందుకు వచ్చావు ? నృపత్‌గంజ్ నుంచి ఉనావ్ వెళ్ళాల్సింది

నేను  వీరికి రాయ్‌బరేలీలో పని ఉంది

నసీబన్  ఇటు తోవలేమీ బాగాలేవు దొంగల భయానికి రకపోకలు నిలిచిపోయాయి ఎల్యా అడవిలో వందలమందిని దోచుకున్నారు ఉనావ్‌కు అటునుంచే వెళ్లాలి ఉన్నది ముగ్గురు అందులో ఒక ఆడది మెడలో నగలుకూడా ఉన్నాయి అక్కడ పెళ్లివాళ్ళనే దోచేస్తారు

నేను  నొసటి వ్రాత ఏం చేస్తాం ?

నసీబన్  గట్టి గుండెదానివే

నేను  మరేం చేయను ?

తరవాత ఆ మాట ఈ మాట మాట్లాడాం అవి అంత ముఖ్యం అయినవి కావు నాకు జ్ఞాపకమూ లేదు 'ఆ! నువ్వెక్కడికి? అని అడిగాను

నసీబన్  మేము యాచన (గదాయీ) కు బయలుదేరాం

నేను  అర్థంకాలేదు

నసీబన్  ఏమీ గదాయీ తెలియదా ? ఎంత పతివ్రతవు

నేను  నాకేం తెలుసు అక్కా ? 'గదాయీ' బిచ్చమెత్తడాన్ని అంటారు

నసీబన్ :  మా పగవాళ్ళు బిచ్చమెత్తుకోనీ

నేను  నాకు తెలియదు 'గదాయీ' దేన్నంటారో?

వసీబన్  ఏడాదికొకసారి ఇల్లు విడిచి మేము పల్లె పల్లె తిరుగుతాం. అమీర్లు నవాబుల ఇండ్లలో దిగుతాం. వారు మా అదృష్టాన్నిబట్టి ఏదో ఒకటి ఇస్తారు. ఒకచోట కచేరి జరుగుతుంది. ఒకచోట జరుగదు.

నేను  అయితే దాన్ని 'గదాయీ' అంటారు.

వసీబన్  ఆఁ, ఇప్పుడు అర్థమైందా?

నేను  ఇక్కడ ఎవరైనా అమీరుదగ్గరికి వెళ్ళావా?

వసీబన్  ఇక్కడికి దగ్గర్లో రాజా శంభూధ్యాన్‌సింగ్ కోట ఉంది. అక్కడికి వెళ్ళాను. వారికి మహారాజా ఫర్మానా అందింది. బందిపోటు విషయంలో బందోబస్తు చేయవలసిందని. వారు ఆ పనిలో వెళ్ళిపోయారు. చాలరోజులు ఉన్నాను. తరువాత విసిగి వచ్చేశాను. ఇక్కడికి రెండుకోసుల్లో 'నమర్‌యహా' అనే ఊరుంది. అక్కడ మా పిన్ని ఉంటుంది. ఆవిడదగ్గరికి వెళ్ళాను.

నేను  అక్కణ్ణుంచి?

వసీబన్  అక్కడనే ఉంటాను. రాజాగారు వచ్చినతరవాత కోటకు వెళ్తాను. ఇంకా చాలమంది వారికోసం అక్కడే మకాంచేసి ఉన్నారు.

నేను  రాజాగారికి ఆటపాటల్లో అభిరుచి ఉందా?

వసీబన్  ఉండేది.

నేను  ఏం? ఇప్పుడేమైంది?

వసీబన్  ఇక్కడనుంచి ఒక వేశ్యను తెచ్చిపెట్టుకున్నారు. అప్పటి నుంచి మమ్మల్నెవరూ లెక్కచేయడంలేదు.

నేను  ఆ వేశ్య పేరేమి?

వసీబన్  గుర్తులేదు. ముఖం చూశాను. ఎర్రగా ఉంటుంది. ముక్కూ ముఖం బాగానే ఉంటాయి.

నేను:  బాగా పాడుతుందా?

నసీబన్ : ఏమ్మా పాటగీటా రాదు ఏదో కొద్దిగా ఆడుతుంది. రాజా గారు ఆవిడ చేతి తొంగరం

నేను : ఆవిడ వచ్చి ఎంతకాలం అయింది ?

నసీబన్ : ఆరు నెలలు అయివుంటుంది

రాత్రికి పైలట్‌తో రోప బాగులేదనే విషయం చెప్పాను. "ధైర్యంగా ఉండు కట్టుదిట్టాలు చేశాం" అన్నాడు.

# 13

రెండవరోజు వేకువన బయలుదేరాం. నసీబన్ బండి మా వెనక ఉంది నసీబన్, నేనూ మాట్లాడుకుంటున్నాం కొంతదూరం వెళ్ళినతర్వాత సమర్‌యువూ వచ్చింది. నసీబన్ మాకు దూరంనుంచి ఆ ఊరు చూపించింది బాటపక్కన పొలాలున్నాయి కొందరు కన్యలు నీరు పెడ్తున్నారు కొందరు పొలంలో పనిచేస్తున్నారు పిరకట్టిన బలిష్టమైన ఒక స్త్రీ దున్నుతూంది నసీబన్ వాళ్ళను చూసి అంతా వేశ్యలని చెప్పింది. మంచి వృత్తే అనుకున్నాను మగవాళ్ళకంటే ఎక్కువ కష్టపడుతున్నారు వేశ్యలెందుకు కావలసివచ్చిందో అర్థంకాలేదు వీళ్ళ ముఖాలుమాత్రం కష్టపువమలకు తగినట్లున్నాయి లక్నోలో తిరిగిఅమ్మే పిడకలవాళ్ళలానూ, పాలు పెరుగు అమ్మేవాళ్ళలానూ ఉన్నారు నసీబన్ ఇక్కడినుంచి విడిపోయింది

రెండు కోసులు పోయినతర్వాత ఒక పల్లం వచ్చింది. అక్కడక్కడ అడివి, పెద్దపెద్ద గుహలు, ఎదురుగా పిట్టగోడ్డు కనిపించాయి. రెండు వైపుల దూరంవరకు దట్టమైన చెట్లబారులు అక్కడికి చేరేవరకు బాగా పొద్దెక్కింది ఈ బాటన మేముతప్ప ఎవరూ కనిపించలేదు నలు వైపులా నిశ్శబ్దం. నిశ్శబ్దం పిట్టవరకి వచ్చాం. నేను వారిస్తున్నా పైలట్ గుర్రాన్ని ముందుకు పోనిచ్చాడు చూస్తూ చూస్తూండగానే చాలాదూరం వెళ్ళిపోయాడు. తరువాత గుర్రం కనిపించలేదు.

మా బండి సాగుతూంది పైనువాడు గుర్రం వెనక పరిగెత్తాడు మిగిలింది నేను, బండి మనిషి ఇంతలో పది పదిహేనుమంది పల్లీయులు బండివైపు పరిగెత్తుకొని వస్తున్నట్లు కనిపించింది రక్షించమని మనసులో భగవంతుని వేడుకొన్నాను క్షణంలో పల్లీయులు వచ్చి బండి చుట్టేశారు అందరి చేతుల్లోనూ కత్తులూ కటార్లు ఉన్నాయి భుజాలకు తుపాకులు వ్రేలాడుతున్నాయి

పల్లీయుడు (బండివానితో) ఆపు బండిని ఎవరున్నారు బండ్లో ?

బండి మనిషి రావడం బరేలీనుంచి ఉనావ్‌దాకా బాడుగచేసుకున్నారు

పల్లీయుడు ఆపు బండిని

బండి మనిషి ఎందు కాపాలి ? ఖాన్‌సాహెబ్ జనానా ఉంది

పల్లీయుడు వెంట మగవారెవరూ లేరా ?

బండి మనిషి ముందుకు సాగిపోయారు వస్తూఉండవచ్చు

పల్లీయుడు దిగు బీబీ బండ్లోనుంచి

ఒకడు పరదా తీసి లాగండి దొంగండేగా పరదా ఏమిటి ?

ఒక పల్లెవాడు ముందుకు వచ్చి తెరతీసి నన్ను దింపాడు ముగ్గురు మనుషులు నన్ను చుట్టేశారు ఇంతలో నదివైపు దుమ్ములేచింది గుర్రాల డెక్కల ధ్వని వినిపించింది గుర్రాలు దగ్గరికి వచ్చాయి ముందు పైజలీ గుర్రం కనిపించింది వెనుక మరో పదిహేనుమంది గుర్రాల వాళ్లున్నారు. గుర్రాలను చూడగానే పల్లెవాళ్ళు తుపాకులు పేల్చారు. ఇద్దరు గుర్రాలవాళ్ళు పడిపోయారు గుర్రాలవాళ్ళు నెత్తిమీదికి వచ్చేశారు ఒరల్లోంచి కత్తులు బయటికి వచ్చాయి వీళ్ళుకూడా కత్తులు లాగారు ఒకటి రెండు దాడుల్లోనే పల్లెవాళ్ళు ముగ్గురు గాయపడి పడిపోయారు అశ్వికులుకూడా ఒకరు పడిపోయారు పల్లెవాళ్ళు పారిపోయారు

నేను మళ్ళీ బండి ఎక్కాను గాయపడిన అశ్వికునికి కట్లు కట్టి బండి ఎక్కించారు. బండి సాగింది. అశ్వికులు బండికి రెండువైపుల ఇద్దరు. వెనుక కొందరు, ముందు కొందరు నడిచారు.

ఫైజలీ. (వహాదరునితో) బాయీ ! అక్కోనుంచి బయటపడ్డం కుదరలేదు కష్టంగా ప్రాణాలతో వచ్చేశాను ఎలాగో

ఫజలలీ ఏలాసార్లో పడిపోయాననవు

ఫైజలీ అవును నువ్వు అంతకన్నా ఏమంటావు ?

ఫజలలీ అనడమేమి ? వెంటనే ఉందిగా ! వదినగారిని మేము చూడ రాదా ?

ఫైజలీ మీముందు తెర ఏమి ? చూడండి

ఫజలలీ గుడారం చేరింతరవాత చూస్తాను

ఇంతలో బండి ఏటిఒడ్డుకు చేరింది ఒడ్డు చాల మిట్టగా ఉంది. నేను దిగి నడవాల్సివచ్చింది కష్టంగా బండి గట్టెక్కింది బండి కుదుపునకు గాయపడిన ఆశ్వికుని గాయాలు విచ్చుకున్నాయి బండినిండా రక్తం.

బండి ఒడ్డుకు చేరింతరవాత మళ్ళీ కట్లు కట్టారు బండి కదిలారు. నేను మళ్ళీ బండి ఎక్కాను అప్పటికి రెండు జాములైంది నాకు బాగా ఆకలివేస్తూంది బండి మెల్లగా నడుస్తూంది గుడారం ఎక్కడా కంటికి కనిపించలేదు నాలుగు కోసులంతరవాత ఒక ఊరిబయటి తోట వచ్చింది అక్కడ చిన్నచిన్న డేరాలు వేసివున్నాయి కట్టివేసిన గుర్రాలున్నాయి మనుషులు ఇటూ అటూ తిరుగుతున్నారు కొందరు వంటలు చేస్తున్నారు మా బండి ఇక్కడికి వచ్చి ఆగిపోయింది మా వెంటవున్న ఆశ్వికులను చూచి ఒకడు ఎదురుగా వచ్చాడు ఫజలలీ చెవిలో ఏదో చెప్పాడు ఫైజలీదగ్గరికి గుర్రాన్ని నడిపించాడు వారిద్దరూ ఏదో మాట్లాడుకున్నారు

ఫైజలీ ''మంచిది చూశాం. భోజనాలు కానివ్వండి అన్నాడు

ఫజలలీ అన్నాలు తినే వ్యవధిలేదు కదలాలి

ఫైజలీ మంచిది డేరాలు పెరికి గుర్రాలకు జీనులు కట్టండి. ఇంతలో మనం భోజనాలు చేశాం

నేను బండి దిగాను మామిడిచెట్టుకింద గుడ్డ పరచబడింది కూర గిన్నెలు తెచ్చిపెట్టాడు రొట్టెల మధ్యనున్న పళ్ళాలు వచ్చాయి నేను, ఫైజలీ, ఫజలలీ ముగ్గురం కలిసి భోజనాలు చేశాం భోజనాల సమయంలో ముఖాలమీద ఆతురత లక్షణాలు కనిపించినా హాస్యంగానే గడిచింది

షోబినాలు పూర్తిఅయ్యేవరకు గుడారాలు పెరికి గుర్రాలమీద వేశారు. జీవులు కట్టబడినాయి.

బిడారు కదిలింది

రెండు మూడు కోసులు వెళ్ళిఉంటాం అశ్వికులు, పదాతులు వచ్చేశారు. ఇటుకూడా సిద్ధంగా ఉన్నారు రెండువైపులనుంచి తుపాకులు ప్రేలాయి ఆ సంగ్రామంలో ఫైజలీ నా బండి చుట్టుపట్లలోనే ఉన్నాడు. బండ్లో కూర్చొని నేను భగవంతుని ప్రార్థిస్తున్నాను ఎడద చేతిలో ఎగురుతూంది కల్లోలం అప్పుడప్పుడు తెర జరిపి చూస్తున్నాను. అదిగో వాడు చచ్చె ఇదిగో వీడు కూలె ఉభయపక్షాల్లో చాలమందికి గాయాలు తగిలాయి మావెంట యాభై అరవైమంది ఉంటే రాజా ధ్యాన్‌సింగ్ మనుషులు అనేకులు ఉన్నారు ఒక్కొక్కనిమీద పది పది మంది వచ్చారు ఫజలీ ఫైజలీ అదను కనిపెట్టి తప్పుకున్నారు పది పన్నెండుమంది పట్టుబడ్డారు వారిలో నేనుకూడా ఉన్నాను

# 14

బండివాడు కాళ్ళువేళ్ళు పట్టుకొని విడుదల అయినాడు గాయపడిన అశ్వికులను శవాలలో పడిలేసి ప్రాణాలు రక్షించుకొని బరేలీకి వెళ్ళిపోయాడు కోట అక్కడికి నాలుగైదు కోసులుంటుంది కొంతదూరం సాగినతరవాత రాజావారి మనుషులు మరికొందరు కలిశారు రాజావారు గుర్రంమీద ఉన్నారు. మేము వారిముందుకు వెళ్ళాం

రాజా   అక్కైమంది పట్టిన బీబీ ఈమేనా ?

నేను   హుజూర్ ! నేరస్థురాలను. కాని [illegible] కారణం తెలియదు ఇదంతా నాకేం తెలియదు ?

రాజా   ఇప్పుడు తన నిర్దోషిత్వాన్ని నిరూపించడానికి ప్రయత్నిం[illegible]కండి నేరం రుజువైంది అడిగిన ప్రశ్నలకు జవాబివ్వండి

నేను :   అట్లే

రాజా లక్నోలో ఇల్లెక్కడ ?

నేను టక్సాల్‌లో.

రాజా. (మనుషులకు సంజ్ఞచేసి) పక్క పల్లెనుంచి బండి తేండి పల్లె లోగంవాళ్ళు కారు రాత్రంతా ఎగిరి పది పది కోసులు ఊరేగింపు వెంట తిరగడానికి ఈమె లక్నో వేశ్య

నేను సర్కారును అల్లా రక్షించుగాక

మనుషులు బండి తెచ్చారు బండి ఎక్కాను పట్టుబడి కట్టివేయ బడిన మిగతావారు మావెంట నడిచారు

కోటకు చేరాం వాళ్ళను ఎక్కడికి పంపారో తెలియదు నన్ను కోటలోకి పిలిచారు ఉండడానికి మంచి వసతి కల్పించారు ఇల్లు శుభ్రంగా ఉంది ఇద్దరు సేవకులు నియమించబడినారు చక్కని భోజనం వచ్చింది పూరీలు కచోరీలు మిఠాయీలు, రకరకాల ఊర గాయలు లక్నోనుంచి బయలుదేరినతరవాత ఇవ్వాళ మంచి భోజనం లభించింది మర్నాడు ఉదయం ఖైదీలను లక్నో పంపారని తెలిసింది. జాము పొద్దెక్కినతరవాత రాజావారు కబురంపారు

రాజా మీరు విముక్తులైనారు ఫైజూ ఫజలలీ ఇద్దరూ దుర్మార్గులని రుజువయింది పట్టుబడినవాళ్ళను లక్నో పంపాం అక్కడ వారు శిక్ష అనుభవిస్తారు వాస్తవంగా మీ దోషం ఏమీలేదు కాని ఇక ముందు ఇలాంటివాళ్ళతో స్నేహం చేయకండి ఇష్టమైతే మూడు, నాలుగురోజులు ఇక్కడే ఉండండి మీరు శ్రావ్యంగా పాడుతారని విన్నాం

రాజావారిదగ్గర లక్నో వేశ్య ఉందనే నసీబన్ మాట గుర్తుకు వచ్చి "ప్రభువులకు ఎలా తెలిసింది ?" అని అడిగాను

లక్నోనుంచి వచ్చిన వేశ్యను పిలిపించారు లక్నో వేశ్య ఎవరు ? ఖుర్షీద్ జాన్ ! ఖుర్షీద్ జాన్ పరిగెత్తి వచ్చి నన్ను చుట్టేసింది ఇద్దరమూ ఏడిచాం రాజావారి భయంతో వెంటనే ఏడిపోయి వారిముందు కూర్చున్నాం వాద్యగాళ్ళు పిలువబడినారు విముక్తి కలిగిందని గ్రహించి ఒక గజల్ చెప్పాను చాల చరణాలు చెప్పాను. అన్నీ గుర్తులేవు. జ్ఞాపకం ఉన్నవి వినిపిస్తాను రాజావారు, సభికులు ప్రతిచరణాన్ని మెచ్చుకున్నారు ఆనందంతో మునిగిపోయారు గజల్ ఇది

వలపు వేటకాని చెరనుండి విముక్తి కలుగు
పాటలరాణి బుల్బులికి విముక్తి కలుగు
నీవు వీడిన నీ కురుల వీడవోవు
వలపు వంతల చిక్కిన విముక్తుడగునే ?
వలపులందిపై వ్యాధుడు కనులెర్రజేసె
ఇచ్చలేకున్నను మాకు విముక్తి కలిగె
వేటగానికి నా జాలు కెదర పడదు
ఎల్లో బాధల బందికి విముక్తి కలిగె
ఇహపు వ్యథలే కావు వేదనాభారాల కలవు
బ్రతుకు చెరనుండి ఎవనికి విముక్తి కలుగు ?
మాత్మ పథువులన్న కన్ను కుట్టదేల
ప్రియుని బంధమ్మునుండి విముక్తి కలుగ
వలపు వంతలనుండి విముక్తి ఏది ? అదా
ఎవరు బాధల బంధవిముక్తుడయ్యె ?

మకుటం విని రాజాగారు " అదా' ఎవరి కలంపేరు ? అని అడిగారు 'వీరిదే' అని ఖుర్షీద్ చెప్పగా రాజాగారు చాల సంతోషించారు

రాజా ఈ విషయం తెలిస్తే విడుదలచేసేవాళ్ళం కాము

నేను : గజల్ విని ప్రభువులు గ్రహించిఉండాలి చూశా ఆ విషయమే విదారంగా ఉందని కాని ప్రభువుల ఫర్మానా వెలువడింది ఈ దాసి విముక్తురాలైంది

సభ ముగిసింది రాజాగారు భోజన గృహానికి వెళ్ళిపోయారు

ఖుర్షీద్ నేనూ వెళ్లాలనుకుంటున్నాం

ఖుర్షీద్ పూను అక్కా ! ఇందులో నా తప్పేమీ లేదు రాజాగారికి జానమీకు చాలరోజులు మంతనాలు సాగాయి వీరు చాలసార్లు శిక్షించారు. జానమ్ నిరాకరించింది చివరకు ఐయాష్‌బాగ్ జాతరలో మనుష్యులను పెట్టించారు బలవంతంగా ఎత్తుకు వచ్చి తెచ్చారు. అప్పటినుండి ఇక్కడే ఉన్నాను నాకిక్కడ నచ్చి [illegible]

నేను : ఈ [illegible] తో [illegible] ?

ఖుర్షీద్ : అది [illegible]

కొత్తవానిదగ్గరికి వెళ్ళడమంత నీచం ఏదీలేదు అక్కడ అదే చేయి పలిసివచ్చేది ఖానమ్ సంగతి తెలిపిందేగా। ఇక్కడంటావా ఒక్క రాజావారితోనే పరిచయం ఇక్కడ అంతా నా ఆజ్ఞాబద్ధులే రెండవది ఇది నా జన్మభూమి ఇక్కడ ప్రతిదీ నాకు మంచిగా కనిపిస్తుంది

నేను అయితే లక్నో వెళ్ళే ఉద్దేశ్యం లేదంటావు?

ఖుర్షీద్ క్షమించు ఇక్కడ హాయిగా ఉన్నాను నువ్వుకూడా ఇక్కడే ఉండిపోకూడదూ?

నేను ఇక్కడమాత్రం ఉండను వేరే కారణాలు ఉన్నాయి

ఖుర్షీద్ లక్నో వెళ్తావా?

నేను వెళ్ళను

ఖుర్షీద్ మరెక్కడికి?

నేను విధి తీసికెళ్ళిన చోటుకు

ఖుర్షీద్ కొన్ని రోజులు ఉంటావుగా!

నేను ఉన్నానుగా

పదిహేను ఇరవై రోజులవరకూ కోటలో ఉన్నాను రోజూ ఖుర్షీద్ కలిసేది ఆవిడ మనసు అక్కడే లగ్నమైంది నాకు భయంగా ఉంటూంది చివరకు రాజావారికి విన్నవించాను

నేను విముక్తికి ఆజ్ఞ అయినట్లేనా?

రాజా ఆయనట్లే వెళ్ళాలని ఉందా?

నేను చిత్తం దాసీకి శెలవిప్పించండి మళ్ళీ దర్శనం చేసుకుంటాము.

రాజా ఎటు వెళ్తారు?

నేను: కాన్పూరు

రాజా: ఏం? లక్నో వెళ్ళరా?

అతను స్వయంగా గుర్రాన్ని చూసుకుంటాడనీ నిర్ణయం జరిగింది బండి పూటకూళ్ళవాని దగ్గర వదిలేయాలని రాత్రే గంగదాటి వెళ్ళిపోవాలని నిశ్చయించాడు ఏం చేయను ! ఫైజలీ ఆధీనంలో ఉన్నాను అతను చెప్పినట్లు వినాల్సివచ్చింది సలార్‌ను పిలిచాడు పక్కకు తీసికెళ్ళి చాలసేపు మాట్లాడాడు సుమారు అర్ధరాత్రికి తనతోపాటు నన్ను గుర్రం మీద కూర్చుండబెట్టుకున్నాడు సత్రం వదిలి వెళ్ళిపోయాం అయిదారు కోసుల నడక నడుములు విరిగిపోయాయి ఎలాగో అలా గంగానది ఒడ్డుకు చేరాం కష్టంగా పడవ దొరికింది నది దాటాం ఉదయానికి కాన్పూరు చేరాం నన్ను లారీమహలులో దింపి ఫైజలీ ఇల్లు చూడ డానికి వెళ్ళాడు కొద్దిసేపట్లో తిరిగి వచ్చి 'ఇక్కడ ఉండడం క్షేమం కాదు ఇల్లు కుదిరించాను అక్కడికి నడువు అని దోలీ మాట్లాడాడు

కొద్దిసేపట్లో ఒక ఇంటికి వచ్చేశాం ఒక వసారా ఉంది రెండు మంచాలు పడిఉన్నాయి చాప పరచిఉంది దానిమీద ఒక హుక్కా గొట్టం పడిఉంది దాన్ని చూడగానే అసహ్యం కలిగింది ఇంటి స్థితిచూస్తే భయం భయంగా ఉంది కొంతసేపుంది "బజారుకు వెళ్ళి తినేందుకు ఏమైనా తెస్తాను" అన్నాడు ఫైజలీ మంచిది త్వరగా రావాలి" అన్నాను నేను ఫైజలీ బజారుకు వెళ్ళిపోయాడు ఒంటరిగా కూర్చు న్నాను

బజారుకు వెళ్ళిన ఫైజలీ ఇవ్వాళ రాడు రేపు రాడు గడియ రెండు గడియలు జాము రెండు జాములు ఎంతని చెప్పను ! పగలు గడిచింది. సాయంకాలం కావచ్చింది ఉనావ్‌లో సాయంకాలం ఎప్పుడో తిన్న తిండి రాత్రి గుర్రపుస్వారి నిద్రమబ్బు ఉదయంనుంచి మొఖాన చారెడు నీళ్ళు పడలేదు ఆకలితో ప్రాణంపోతూంది సూర్యుడు అస్తమిం చాడు చీకటి పడింది రాత్రి అయింది భగవాన్ ! ఏమిచేయాలి ! అంత పెద్దఇల్లు అవురావురంటూంది ఆ గదిలోంచి ఎవరో వచ్చినట్లూ. ముందటి వసారాలో ఎవరో తిరుగుతున్నట్లూ అనిపిస్తూంది ఏదో దనదన చప్పుడు ఎవరో మెట్లుదిగి వెళ్ళిపోతున్నారు రెండు జాములరాత్రి అయింది గోడలమీద, కప్పుమీద కనిపించిన వెన్నెల మాయం అయింది చీకట్లు ముట్టుకున్నాయి దుప్పటి ముఖంమీద కప్పుకొని పడుకున్నాను

తెల్లవారి పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది అప్పుడు లజ్జో విలువ తెలిసింది భగవంతుడా ! ఏలాంటి కష్టాలు తెచ్చిపెట్టావురా అను

కున్నాను. లక్నో సౌఖ్యం విశ్రాంతి ఆ గది గుర్తుకు వచ్చాయి. కను సైగలనుబట్టి మనుషులు హుక్కా, తాంబూలం, అన్నం, నీరు అన్నీ తెచ్చేవారు. ముఖం తిప్పినవైపునకు అందించేవారు. సారాంశం ఏమంటే ఇవాళ రెండు జాములవరకు షైజలీ రాలేదు. ఈ దశలో శిలంగల అవరి ఉండిఉంటే ఉక్కిరిబిక్కిరిఅయి చచ్చేది. నేనేమీ పొడిచివచ్చానని కాదు. అయినా వందల పురుషుల్లో కూర్చున్నదాన్ని. కాన్పూరులో కాకున్నా లక్నోలో అనేక గొందులు ఎరుగుదును. ఇక్కడకూడా బజారు చూచాను. కాశీకొంపలో కూర్చుండలేక లేచి గొళ్ళెంతీసి బయటపడ్డాను. పది, ఇరవై అడుగులు వేశానో లేదో సర్కారు దుస్తులుగల ఒకవ్యక్తి గుర్రం మీద కనిపించాడు. అతనివెంట పది, పదిహేనుమంది జవాను లున్నారు. బేడీలు వేయబడిన షైజలీ వారిమధ్య నడుస్తున్నాడు. ఆ దృశ్యం చూచి నిర్ఘాంతపోయాను. నిలిచిపోయాను. ఇరుకు గొంది కనిపించింది. అందులోనే ఒక మసీదు ఉంది. దేవుని ఇల్లే ఉత్తమం అనుకున్నాను. అక్కడే కొంతసేపు గడపడం మంచిదనుకున్నాను. తలుపు తెరచి ఉంది. లోనికి వెళ్లాను. ఒక మౌల్వీగారు ఎదురైనారు. తల నున్నగా ఉంది. నీలిరంగు బట్టకట్టుకొని ఎండలో పచారు చేస్తున్నారు. ముందు నేను కానుక వేయడానికి వచ్చాననుకున్నారు. సంతోషించారు. నేను వెళ్లి ముంగిలిలో కాళ్ళుచాచి కూర్చున్నాను. దగ్గరకు వచ్చి "అమ్మాయీ! ఇక్కడేం పని?" అని అడిగారు.

నేను : భగవంతుని ఇల్లని వచ్చాను. కొద్దిసేపు కూర్చుంటాను. మీరు అంతగా సహించకుంటే ఇప్పుడే వెళ్ళిపోతాను.

నా కలుపుగోలుతనము మనోరంజకమైన ఉపన్యాసం గారడీలా పనిచేశాయి. ఇంక జవాబేం చెప్తుతారు. ఎక్కుముఖం వేసి అటూ, ఇటూ చూచారు. ఉద్యుట్లో వక్తారని అర్థంచేసుకున్నాను.

మౌల్వీ : అయితే ఎక్కడుండింది తను రాక?

నేను : ఎక్కడున్నాంత్రైనా ప్రస్తుతం ఇక్కడే ఉండాలని ఉంది.

మౌల్వీ : (కెదిరి) మసీదులోనా ?

నేను : కాదండీ మీ గదిలో

మౌల్వీ లాహౌల్‌వలాఖువత (పాపము శమించుగాక)

నేను అయ్యో! మౌల్వీసాహబ్! మీరుతప్ప ఎవరున్నారు నాకు!

మౌల్వీ నేను ఒంటరిని అందుకే "మసీదులో మీకేం పని?" అని అడిగాను

నేను బాగుంది తలే! మీరుంటే మరొకరు ఉండకూడదా ఏం? మసీదులో మాకేమీ పనిలేదు కాని మీకేం పని?

మౌల్వీ పిల్లలకు చదువు చెపుతాను

నేను నేను మీకు పాఠాలు చెపుతాను

మౌల్వీ: లాహౌల్‌వలాఖువత

నేను లాహౌల్‌వలాఖువత తేపా లాహౌల్ ఎందుకు చదువుతారు? సైతాను మీ వెంటపడిందా?

మౌల్వీ సైతాను మానవునికి శత్రువు దానికి భయపడాలి

నేను భగవంతునికి వెరవాలి వెధవ సైతానుకు ఎందుకు భయపడటం? ఏమిటి మీరన్నది? మీరు మనుషులా?

మౌల్వీ (కాస్త కోపంతో) అవును మరెవరిని?

నేను నాకు భూతంలా కనిపిస్తున్నారు, ఒంటరిగా ఈ మసీదులో ఉంటుంటే భయంకావడంలేదూ?

మౌల్వీ మరేం చేయమంటారు? మాకు ఒంటరితనం అలవాటు

నేను అందువలననే మీ ముఖం భయంకరంగా ఉంది "ఒంటరితనం సగం పిచ్చి" అనే సామెత వినలేదూ?

మౌల్వీ ఉన్నంతలో ఆనందంగా ఉన్నాం మీ తాత్పర్యం (అభిప్రాయం) చెప్పండి

నేను తాత్పర్యం పుస్తకాలు చూస్తేగాని తెలియదు ప్రస్తుతానికి వక్క చెక్క కాదివ్వండి

మౌల్వీ ఇదుగో!

నేను భోజనం

మౌల్విసాహెబ్‌ను ఎంతో పరిహసించాను కాని అప్పటికి ఆకలితో ప్రాణం పోతూంది నోట మాట రావటంలేదు

రుస్వా  వారితో అంత పరిహాసాలు ఆడాల్సిన అవసరం ఏమొచ్చింది?

ఉమ్రావ్  ఓహో అదా ఆ మాట అనక్కండి కొందరి ముఖాలే అలా ఉంటాయి కారణం లేకుండానే నవ్వాలనిపిస్తుంది

రుస్వా  అప్పుడప్పుడు నున్నని గుండును చూస్తే కొందరి చేతులు దురదపెడ్తాయి నెత్తిమీద వేళ్ళు ఆడించాలనిపిస్తుంది

ఉమ్రావ్  అంతే అనుకోండి

రుస్వా  వారిపట్ల పరిహసించాలనిపించే విషయం ఏముంది-

ఉమ్రావ్  ఏం చెప్పాలో అర్థంకావటంలేదు మనిషి పడుచులో ఉన్నారు రూపంకూడా అంత వికారంగా లేదు ముఖంమీద వర్చస్సుంది గడ్డం అల్పత్వం గొరిగించిన మీసాలు ఎత్తేసి టోపి వింతగా మాట్లాడుతారు నోరు తెరిచి వెంటనే మూసేస్తారు కింది పెదవి విచిత్రంగా పైకిలేస్తుంది దాంతో కత్తిరించిన గడ్డం తమాషాగా కనిపిస్తుంది ముక్కు ముందుకు సాగుతుంది ఏదో తింటూ మాట్లాడుతున్నట్లనిపిస్తుంది కొన్నాది పడిపోతుం దేమోనని వెంటనే నోరు మూస్తారు

రుస్వా  నిజంగానే తింటున్నారా?

ఉమ్రావ్  తింటంలేదు నెమరువేస్తున్నారు

రుస్వా  ముల్లాల ముఖం తరచుగా అలాగే ఉంటూంటుంది ఆ ముఖాలు చూస్తే బుద్ధిహీనునికి భయం కలుగుతుంది బుద్ధిమంతునికి నవ్వొస్తుంది అల్లాంటి ముఖాలు చూడటం నాకు సరదా

ఉమ్రావ్  ఇంకా వినండి వారు మాట్లాడ్డంలో ఒక విశేషం ఉంది తరచుగా ముఖం తిప్పేసుకుంటుంటారు

రుస్వా.  అది మర్యాద లక్షణం. మాట్లాడేప్పుడు తుంపర పడుతుంద వచ్చు

ఉమ్రావ్ : నన్ను చెప్పనిస్తారా ?

రుస్వా : క్షమించాలి. అదిగో తెల్లారింది.

ఉమ్రావ్ : కథ ఏమంటే నేను జేబులోంచి రూపాయి తీశాను.

సంభావన ఇస్తున్నాననుకొని మాల్వీగారు చప్పున చేయిచాచి "ఇదేమి అవసరం" అన్నారు.

నేను చిరునవ్వు నవ్వి "అత్యవసరం నాకు ఆకలిగా ఉంది. ఎవరి నైనా పంపి తినడానికి ఏమైన తెప్పించండి" అన్నాను.

మాల్వీగారు నిరాశచెంది మాట మార్చారు. "అర్థమైంది" అన్నారు. ఏమర్థంఅయింది. మట్టి. అర్థమైతే రాయికావలసింది. అందుకే అన్నారు అవసరమేమని. "ఇక్కడి భోజనం పనికిరాదా ?" అడిగారు.

నేను : ప్రస్తుతమా ? అప్రస్తుతమా ? స్వపదార్థమా ? పరపదార్థమా ?

మాల్వీ : ఇప్పుడేమీ లేదు. నా శిష్యుడు భోజనం తెస్తాడు మీరు భోం చేయండి.

నేను : ప్రస్తుతము సాధ్యపడదు. స్వపదార్థపు ఆశ లేదు. అనువు లావు రావునటున్నవి. కావున బజారు భోజనమే శరణ్యము. కావున అదియే తెచ్చియుండు.

మాల్వీ : కాస్త ఓపికపట్టండి. భోజనం వస్తుంటుంది.

నేను : ఓపికకు ఓపిక వచ్చినది. రెండవదేమనగా పెద్దలు చెప్పగా విన్నాను [1]రష్తీదు షరీఫ్‌గారు ఒక మాసము మాత్రము ప్రపంచ మున విహరించుట కేగి మిగిలిన సమనౌకందు మానవులు ఈ మసీదునసే తిష్ఠవేయుదురని.

మాల్వీ : ప్రస్తుతం ఏమీలేదు. కాని నా శిష్యుడు భోజనం తెస్తానే ఉంత వచ్చు.

నేను : పోవిందు. ఒప్పుకుంటమెట్టులో భోజనము వచ్చునని. ఆయ్యాది ఏ నేతికే చాలవన్న మాకేమి వక్కు ? ఎటులో ఇరువురము హాయిగా భుజింతమనిన నిరీక్షణ మృత్యువువలె నున్నది. ఇరాఖు నుండి [2]తిర్యాఖు వచ్చువరకు.......

---

1 మహమ్మదీయులు ఉపవసించు మాసము.

2 తిర్యాఖు అమృతం వంటిది. అది ఇరాక్‌లో లభిస్తుందని విశ్వాసం.

మాల్వీ తామెంతో యోగ్యతగలవారుగా కనిపిస్తున్నారు

నేను నా అల్పబుద్ధికి తాము అయోగ్యులుగా కనిపిస్తున్నారు

మాల్వీ నిజమే కాని

నేను (మాటకు అడ్డువచ్చి) కాని ఇక్కడ పేగులు 'అల్లా అల్లా' అంటున్నాయి తాము ఉపన్యాసం దంచుతున్నారు

మాల్వీ అయితే ఇప్పుడే తెస్తా

నేను త్వరగా వెళ్ళండి

నవ్వుకుంటూ వెళ్ళి మౌల్వీగారు గంట గంటన్నరకు నాలుగు పురి రొట్టెలు ఒక పుట్టగిన్నెలో పెరుగు పులుసు తెచ్చారు చూడగానే వళ్ళు మండింది మౌల్వీగారి ముఖం చూశాను అతడు అర్థంచేసుకున్నాడు వేరు వెంటనే పద్నాలుగున్నర *డబ్బులు నా ముందుంచి "నాలుగు పైసల రొట్టెలు పైన కూర దమ్మిడీ చిల్లర మార్పిడంలో పోయింది మిగిలింది ఈ ముందుంది ముందు లెక్కించుకోండి" అన్నారు మరొక సారి మౌల్వీని మాటాడు కాని ఆకలి చెడ్డది మూడు నాలుగు ముక్కలు తిని మౌల్వీని చూచి మౌల్వీగారూ! ఈ పాడుపట్న ఊళ్ళో ఇదేనా దొరికేది? ' అడిగాను

మాల్వీ కాకుంటే ఎక్కో అనుకున్నారా మహమూద్ దుకాణం ఉండ దానికి రేయింబవళ్ళు పలావు దొరకదానికి?

నేను మిఠాయి దుకాణం అయినా ఉండవచ్చుగా!

మాల్వీ మిఠాయి దుకాణమా? అదిగో ఈ సమీపమందునే ఉంది

నేను: అయితే నాలుగు కోసులు వెళ్ళడంపైన అవసరమేం? రెండు జాములు వెళ్ళి తెచ్చారు అదీ ముక్కలు తినేది.

మాల్వీ: అలా అనకండి మనుషులే తింటారు

నేను మీలాంటి మనుషులు తింటుండవచ్చు ఈ పాడి పురిరొట్టెలు, పళ్ళవి పులుసు.

మాల్వీ: నల్లగా ఉందా? లేదే సరే అదే తెప్తాను తప్పు వృధా అయింది నా డబ్బుతో తెచ్చిస్తాను

* నాలుగు పైసలు లేక కాణీలు.

నేను బదులుచెప్పకముందే మౌల్వీగారు వెళ్ళిపోయాడు. ఎప్పటిదో పాచి పులిసిపోయింది. తెచ్చి ముందుంచారు హాతిమ్‌ను చంపి పుట్టినట్లు.

ఏదోవిధంగా నాలుగు రొట్టెలు మింగి ముంతెడు నీళ్ళు తాగాను. పులావు అక్కడే వదిలేసి నుంచున్నాను. చిల్లర అక్కడే పడిఉంది. నేను లేచింది చేయి కడుగుకోవడానికి. మౌల్వీగారు వెళ్ళిపోతున్నానను కొని "ఈ డబ్బులు—చిల్లర తీసికెళ్ళండి" అన్నారు.

నేను: నా తరపున మసీదులో దీపం పెట్టండి.

మూతి, చేతులు కడుగుకొనివచ్చి అక్కడే కూర్చున్నాను. మౌల్వీ గారితో మాటలు సాగించాను. వారివల్ల నాకు కాన్పూరులో చాల సౌఖ్యం లభించింది. వారిద్వారా ఒక గది అద్దెకు తీసుకున్నాను. నవారు మంచం, చాపలు, తెరలు, ఇత్తడి గిన్నెలు వగైరా అవసరం అయిన సామానంతా కొన్నాను. ఒక దాసీని వంటకు, ఒకదాన్ని పై పనికి పెట్టుకున్నాను. మరో ఇద్దరు నౌకర్లను పెట్టుకొని హాయిగా ఉంటున్నాను. వాద్యగాళ్ళ కోసం అన్వేషణ సాగింది. రావడానికి చాలామంది వచ్చారు. కాని పసందుగాలేదు. చివరకు ఒక తబలావాడు కనిపించాడు. అతడు ఖలీఫాజీ వంశపు శిష్యుడు. అతనితో బాగా పరిచయం ఏర్పడింది. అతనిద్వారా ఇద్దరు సారంగీ వాదకులు దొరికారు. జాము, జామున్నర రాత్రివరకూ పాటలు సాగాయి. లక్నోనుంచి వేశ్య వచ్చిందనే వార్త కాన్పూరంతటా వ్యాపించింది. చాలమంది పురుషుల రాక సాగింది. కవితకూడా బాగా రాణించింది. సభకు వెళ్ళనిరోజంటూ లేదు. తవేలు ఎక్కువగా వచ్చాయి. కొద్దిరోజుల్లో బాగా డబ్బు సంపాదించాను. కాన్పూరు జనుల ఆచార వ్యవహారాలు, మాటా మర్యాద వచ్చిన మాటిమాటికి లక్నో గుర్తుకు వచ్చేది. అయినా స్వేచ్ఛలో ఏదో ఆనందం ఉంది. లక్నో వెళ్ళే బుద్ధి అస్సలేదు. లక్నో వెళ్తే ఖానమ్ దాసిగా పడిఉండాల్సిందే. ఈ స్వతంత్రత ఖానమ్‌తో వితిపతితుండగా సాధ్యపడదు. వేశ్యలంతా ఆమె మాటకు లొంగిపుడగి ఉంటారు. మంచి వాద్యబృందం లభించడం కష్టం. వాద్యంలేకుండా సంగీత సభలు, నాట్యసభలూ ఎలా సాధ్యం? రాజాలు, నవాబులు పరకు నేను వెళ్ళానంటే ఖానమ్ దలవే. నేను మంచి పాట కత్తెనే. అయినా లక్నోలో చాలమంది మంచి పాటకత్తెలున్నారు. మంచి చెడు విచక్షణ రసజ్ఞులకు. సాధారణ జనుల్లో అమ్ముడయ్యేది పేరు. పెద్ద కుసుముల చూపు పెద్ద వేశ్యలపైనే ఉంటుంది. అలాంటప్పుడు నన్నెవరు

అడుగుతారు? కాన్పూరులో నా విద్యను మించిన గౌరవం లభించింది. రాజుల, నవాబుల ఇండ్లలో పెళ్ళిళ్ళు, ఉత్సవాలు జరుగుతే నన్ను పిలువడం గర్వంగా భావించేవారు. మొత్తంగా ఉంటేగాని లక్నో గొప్పదనం తెలియదు. ఇక్కడ హజ్రత్ షౌకత్ లక్నోకే ప్రఖ్యాతులు. వారిని మించిన వారు లేరని భావన. వారి శిష్యులు వేలసంఖ్యలో ఉన్నారు. లక్నోలో వారి పేరు వినబడనిదే లేదు. ఒకనాడు ఏమి జరిగిందో వినండి. ఒక మహాశయుడు గదిలోకి వేంచేశారు. మాటల సందర్భంలో కవిత్వాన్నిగురించిన చర్చ వచ్చింది. "తమకు హజ్రత్ షౌకత్ తెలుసా?" అని అడిగారు. "తెలియదు. షౌకత్ ఎవ్వరు?" అని అడిగాను. వీరు వారి శిష్యబృందంలోనివారు. వెంటనే కోపం వచ్చేసింది.

వారు: మీరు లక్నోవాసులని విన్నాను.

నేను: చిత్రం. నివాసం లక్నోలోనే.

వారు: లక్నోలో ఉంటూ, మా గురువుగారిని ఎరుగకపోవడం?

నేను: పేరున్న లక్నో కవులందరినీ ఎరుగుదును. ఇక గురువుల విషయం చెప్పాలా? కొత్త పేరున్న శిష్యుల కవితలూ విన్నాను. వారి పేరేమిటో చెప్పండి. కవినామంతో పరిచయంలేదు.

వారు: పేరు చెప్పి ప్రయోజనం ఏమి? వారి కవినామం నలుదిశలా ప్రఖ్యాతమే. మీకు తెలియకపోవచ్చు. పోనివ్వండి.

నేను: క్షమించండి. కవుల పరిచయం గలదాన్నే. తమ గురువుల విషయంలో తామలా చెప్పుకోవడమూ నటనే. పేరు శెలవివ్వండి. గుర్తుపట్తావేమో?

వారు: మీర్ హషమ్‌అలీసాహెబ్ షౌకత్.

నేను: "పేరు పరిచయమైనదానిలాగేఉంది" అని ఆలోచించాను. అల్లా! ఈ మీర్ హషమ్‌అలీసాహెబ్ ఎవరు? చివరకు వారిమీద జాలికలిగింది. "మీ గురువుగారు శోక కవితకూడా చదువుతారు కదూ?" అడిగాను.

వారు: చిత్రం. శోకకవితలోకూడా వారిని మించినవారు లేరు.

నేను: చక్కగా శలవిచ్చారు. మీర్‌సాహెబ్ మిర్జాసాబ్‌ను కూడా మించినవారా?

వారు: వారితో సరితూగేవారు

నేను: శోకగీతాలు ఎవరివి చదువుతారు?

వారు: ఇతరులవి చదవడమేం ఖర్మ? స్వయంగా రచిస్తారు. ఈ మధ్య ఇరవై ఏళ్ళ రజ్జబ్‌కు సరికొత్త శోకగీతం రచించారు. చాల ప్రఖ్యాతమైంది

నేను: తమకు జ్ఞాపకం ఉండవచ్చు

వారు: మొత్తం గుర్తులేదు. ఖడ్గాన్ని కీర్తిస్తూ ఒక చరణం రచించారు. అది నాకేకాదు. పట్నంలో అందరి నోటికి వస్తుంది. కలం ఎరివేశా రమకొంటి

నేను: దయతో సెలవియ్యండి. నేను ఆనందిస్తాను

మెరిసి ఒరనుండి వజ్రఖచితఖడ్గం వెడలింది

వారు: ఈ చరణపు ఖ్యాతి మారుమూల ప్రాంతాలకు వ్యాపించింది. మిగతా చరణాలు నేను చదువుతా వినండి. ఎంత అందమైన కవిత!

నేను: (ఉప్పొంగిపోయి) చిత్రం. తామీ కవిత లక్నోలో వినివుంటారు

వారు: అదే నేనన్నది. లక్నోవాసులు పైగా కవితాపరిచయం గల వారు హజ్రత్‌షారఫ్ పేరు వినకపోవడం ఏమిటి? ఆశ్చర్యం. ఇప్పుడు అర్థమైంది. పోన్యమని

మీ గురువుగారు చచ్చి మరొకజన్మ ఎత్తినా ఇలాంటిది వ్రాయలేరు. ఇది యశశ్శరీరులు మిర్జా దబీర్‌సాహెబ్ కవిత. అందామని నోటిదాకా వచ్చింది కాని ఎందుకు పోనీ అని మింగేశాను.

రుస్వా: తెలివిగా ప్రవర్తించారు. అది కాస్త చెప్పుంటే వాడి కూత్లో పన్ను పడేది. మీర్ హసన్‌అలీషారఫ్ మాత్రమేనా ఎందరో మహానుభావులు ఉన్నారు. ఇలాంటివాళ్ళు ఇంకొకరి కవిత తమ పేర చదివేస్తారు. కొద్దిరోజులక్రితపు విషయం. ఒక పెద్దమనిషి

# 15

కాలమహిమ వర్ణింప నెవరితరము ?
సంయోగ వియోగము లిట నైజము !

విడిపోయినవారు కలుస్తారు. అదీ ఎప్పుడో విడిపోయినవారు. కలుస్తారనే ఆశసహితం లేనివారుకూడా కలుస్తారు. ఒకనాటి సంగతి. కాన్పూరుకు వచ్చి ఆరు నెలలైవుంటుంది. నా కీర్తి బాగా వ్యాపించింది. వీధుల్లో, గొందుల్లో నేను పాడిన పాటలే వినిపిస్తున్నాయి. రాత్రిళ్ళు చాలమంది వస్తున్నారు. వేసవికాలం. పగలు రెండుగంటల సమయం. మంచంలో పడుకొనివున్నాను. దాసీది వంటింట్లో గుర్రుపెడుతూంది. పనివాడు గది అవతల కూర్చొని పంకా త్రాడు లాగుతున్నాడు. వట్టివేళ్ళ తడికలు ఎండిపోయాయి. నీళ్ళు చల్లడానికి మనిషిని పిలుద్దామనుకుంటుండగానే వీధిలో మాటలు వినిపించాయి. "లక్నోనుంచి వచ్చిన వేశ్య గది ఇదేనా ?" అని అడిగింది. కోమటి దుర్గ "అవును అదే" అని చెప్పింది. తరువాత "గుమ్మం ఎక్కడ" అని అడిగితే చూపించింది. కొద్దిసేపట్లో డెబ్బైఏళ్ల ముసలిది గదిలో ప్రవేశించింది. ఎరుపు రంగు, ముడుతల ముఖం. ముగ్గుబుట్ట తల, వంగిన నడుము. తెల్లని మల్మలు ముసుగు, చొక్కా, వదులు పైజామా, చేతులకు మందపాటి వెండి కడియాలు, వ్రేళ్ళకు ఉంగరాలు. చేతిలో కర్ర. వణుకుతూ వగరుస్తూ వచ్చి కూర్చుంది. పది పన్నెండు సంవత్సరాల నల్లని కుర్రాడు వెంటవచ్చాడు. వాడు నుంచున్నాడు.

వృద్ధురాలు : లక్నోనుంచి వచ్చింది మీరేనా ?

నేను : చిత్రం.

ఈ మాట అని మంచం దిగివచ్చి పాన్దాన్ ముందుకు నెట్టి హుక్కా తేవలసిందని మనిషితో కేకవేసి చెప్పాను.

వృద్ధురాలు : మా బేగమ్ నిన్ను జ్ఞాపకంచేసింది. కొడుకు జన్మదినం. జనానాలో గోష్ఠి. నీ కచేరి ఏర్పాటుచేశారు.

నేను బేగంగారికి నేనెలా తెలుసు?

వృద్ధురాలు పట్నంనిండా నీ పాటలే మ్రోగుతుంటె ఇంకో కారణం ఏముంటుంది బేగమ్‌గారు లక్నోవారు

నేను మీరుకూడా లక్నోవారేనా?

వృద్ధురాలు నీకెలా తెలుసు?

నేను మీ మాటతీరు దాగుతుందా?

వృద్ధురాలు అవును నేనూ అక్కడిదాన్నే కచేరికి ఏం తీసుకుంటావో చెప్పు ఇంకా చాలా పనులున్నాయి

నేను నా వెల అందరికి తెలిసిందే యాభై రూపాయిలు పుచ్చుకుంటాను కాని బేగమ్‌గారు లక్నోవారు పైగా ఆదరంతో నన్ను పిలిచారు వారినుండి ఏమీ తీసుకోను గోష్ఠి ఎప్పుడు?

వృద్ధురాలు ఈ రోజు సాయంకాలం ఈ రూపాయిలు పల్లకి అద్దెకు తీసుకో మిగతావి అక్కడ లభిస్తాయి

నేను (డబ్బు తీసుకొని) ఇదేం అవసరం అయినా బేగమ్‌గారు నొచ్చుకుంటారేమోనని తీసుకుంటున్నాను ఇల్లెక్కడ?" అడిగాను

వృద్ధురాలు ఇల్లు కాస్తదూరం నవాబ్‌గంజ్‌లో ఈ కుర్రాడు సాయంకాలం వస్తాడు అతనివెంట వచ్చేయి ఒక విషయం గుర్తుంచుకో వెంట మీ ఇంటికి వచ్చే మగవాళ్లెవరూ ఉండకూడదు

నేను: వాద్యగాళ్లు?

వృద్ధురాలు: వాద్యగాళ్ళు సేవకులు రావొచ్చు. మరెవరూ ఉండరాదు.

నేను: వెంట తెచ్చేంత పరిచయంగలవాళ్ళెవరున్నారిక్కడ? ఎవరూ రారు

ఇంతలో సేవకుడు హుక్కా తయారుచేసి తెచ్చాడు నా పద్ధతి ప్రకారం ముసలావిడ ముందుంచాడు. హుక్కా అమోఘంగా ఉంది. నేను ఒక తమలపాకుల సుమ్మం రావి. కాయవేసి చక్కని తబ్బాలో పది ఉన్న పన్నవి పొడి. ముసలావిడ వాటిని చేసినవాళ్ల ముఖలక్షణాలు అన్నాను.

వృద్ధురాలు — హయ్యో! బిడ్డ ఎక్కొక్కడున్నారు పాన్ నమలడానికి.

నేను — తీసుకో నీకు తగిన తాంబూలమే సిద్ధంచేశాను

ముసలవ్వ తాంబూలం వేసుకొని చాల సంతోషించింది ఇది మా నగరు ఖ మర్యాద అని పొగడుతూ వెళ్ళిపోయింది "కొత్త పొద్దుండగానే వచ్చేయి గడియ పొద్దెండగానే ఉత్సవం మొదలు అవుతుంది

నేను — అది కచేరి ఆచారం కాదు ఆయినా బేగమ్‌గారు తలపిచ్చారు కాబట్టి పెండలకడనే వచ్చి అభినందన గీతం పాడుతాను

ఇమ్మతూము ఏటావ ఒయట ఉన్నప్పుడుగాని తెలియదు కాన్పూరులో ఎందరో కచేరీలు జరిగాయి కాని ఇంత ఉత్సాహం కలుగలేదు. సాయంకాలంకోసం నిరీక్షిస్తూ కాలం గడిపాను వేసవికాలం కొండలా ఉంటుంది కష్టంగా గడిచింది అయిదు గంటలకు కుర్రాడు వచ్చాడు. మొదటినుంచే సిద్ధంగా కూర్చున్నాను వాద్యగాళ్ళను కూడా పిలిపించాను. కుర్రాడు ఇల్లు ఎక్కడుందో చెప్పాడు ప్రయాణమై వెళ్ళాను

బేగమ్‌గారి ఇంటికి గంట దూరాన కాలువపక్క తోట ఉంది. వాగుపైన ఒక నాగజెముడు. ఇటికె ముళ్ళచెట్లు ఎత్తుగా పెంచారు అది ఒక గోడలా తయారైంది తోట పూర్తిగా ఆంగ్లపద్ధతిలో ఉంది తోట. కర్జూరచెట్లు వరుసయుగా ఉన్నాయి అంచులకు కత్తిరించబడిన ఎరుపు చెట్లు నలువైపుల పచ్చదనం అక్కడక్కడ రాళ్ళతో గుట్టల్లాంటివి చేశారు వాటిమీద అనేకరకాల చెట్లు రాళ్ళలోంచి మొలిచినట్లున్నాయి. తోటలో నలువైపుల కాసారములు నిర్మించబడినాయి వాటిలో ముత్యం లాంటి శుభ్రమైన నీరుంది మాలీ గొట్టాలతోనూ, జలయంత్రాలతోనూ నీరు పెడుతున్నారు. ఆకులనుండి నీటిబొట్లు రాలుతున్నాయి పగలంతా సిటికి తపించిన పూలకు నీరు చల్లదనంవల్ల ప్రాణం వచ్చింది ఎంత పచ్చగా, చల్లగా ఆనందంగా ఉంది వాతావరణం।

జన్మదినోత్సవం జరిగింది స్త్రీల పాటలు వినిపించాయి ఆవతల నేను అభినందన గేయం పాడాను శ్యాసకళ్యాణ్ ప్రారంభించాను వినే వారు ఎవరూ లేరు నేనే పాడుతున్నాను బేగమ్‌గారు ఒక నవరసం. అయితే దూషాయలు బహుమానంగా పంపారు కొద్దిసేపటిలో సాయంకాలం అయింది చంద్రుడు ఉదయించాడు. వెన్నెల పరుచుకుంది. కాసారజలం చంద్రకిరణాలతో కలిసి వింతశోభ నిస్తోంది

తోటలో సుందర హర్మ్యం. తోటమధ్యన ఒక తటాకం ఉంది. దానిచుట్టు విదేశపు పూలమొక్కలు అందంగా అలంకరించబడినాయి. ఈ చెరువువరకు కలిపి ఒక ఉన్నత వేదిక నిర్మించబడింది. దానిమధ్యన పుష్కలంగా గాలివచ్చే ఒక చిన్న బంగళా ఉంది. ఈ తటాకం కాలువ నీటితో నిండుతుంది. అందు నీరుపడుధ్వనితో చల్లదనం వ్యాపిస్తోంది. ఎంత ఆహ్లాదకరంగా ఉంది. సుందర సంధ్యాసమయం. శుభ్రమైన గాలి. రంగురంగుల పూలపరిమళపు గుబాళింపు. అలాంటి వాతావరణం ఎక్కడా చూడలేదు. వేదికమీద మల్లెలాంటి తెల్లనిగుడ్డ పరచబడింది. ఒక బాలీసు పెట్టబడింది. దానిముందు నన్ను కూర్చుండబెట్టారు. ఈ వేదికనుండి సౌధంవరకు గులాబిచెట్ల వరుసఉంది. ఆ మార్గానే బేగం గారు విచ్చేస్తారని తెలిసింది. ఎదురుగా చిమ్మమలు వ్రేలాడుతున్నాయి. వేదికమీద పచ్చని దీపాలు వెలిగాయి. పాడవలసిందని ఆజ్ఞ వచ్చింది. నేను కేదారం ప్రారంభించాను. చాలసేపు గానం చేశాను. ఇంతలో ఒక దాసీది రెండు చేతులలో రెండు కమలల్లాంటి గాజుదీపాలు తీసుకొని వచ్చింది. దీపాలు అక్కడ పెట్టి వాద్యగాళ్ళను అతిథి గృహంలోకి వెళ్లాల్సిందనీ. అక్కడికే భోజనాలు పంపబడుతాయనీ చెప్పి పంపించింది. ఇక అంతఃపుర గోష్ఠి జరుగుతుంది. వారు వెళ్ళగానే బేగముగారు విచ్చేశారు. గౌరవసూచకంగా లేచి నుంచున్నాను. నన్ను దగ్గరికి పిలిచారు. తాము పరుపుమీద కూర్చొని బాలీసుకు ఆనుకున్నారు. నన్ను ఎదురుగా కూర్చోవలసిందని సంజ్ఞచేశారు. సలాముచేసి కూర్చున్నాను. [illegible] పరీక్షిస్తూ బేగమ్ వదనాన్ని ధ్యానంగా చూశాను.

చిలిపి కనులు వెడద జల్లు రేఖాచిత్రాలు
ఎదుటపడొదురు మార్కొని చేయు పనాలు!

ఆ తోట. ఆ పరిసరాలు అమరపురి అనే అనుమానం కలిగింది. ఎదుట బాలీసుకు ఆనుకొని కూర్చున్న రంభను చూచి ఆ అనుమానం దూరమయింది. [illegible]. చిత్రించినట్లున్న కనుబొమలు, గులాబిరేకుల్లాంటి విశాలనేత్రాలు. అందమైన ముక్కు. చిన్న చుబుకము. పల్చని నాజూకు పెదవులు. మొత్తం రూపంలోనూ వంక కనిపించదు. ఎత్తూ, లావూకూడా సమానంగా ఉన్నాయి. ఆమె అందాన్ని మించిన అందం చూడలేను. కొంతవరకు ఖుర్షీద్‌తో పోల్చవచ్చు. కాని ఎక్కడి ఖుర్షీదు ఎక్కడి ఈ దేవకన్య! ఖుర్షీద్ ముఖంలో అల్పత్వం కనిపిస్తుంది. ఈమె ముఖాన శ్రీ. ఖుర్షీద్ ఈమె ముందు కొంత వికారంగా కనిపిస్తుంది. శిల్పకుడు మలచినలాంటి ఈ సౌకుమార్యం ఆమెలో ఎక్కడిది!

రెండవది ఆమె ముఖంమీద ఎప్పుడూ ఉదాసీనత కనిపిస్తుంది చిరచిర లాడుతుంది బేగమ్‌గారిలో ప్రసన్నత ఉంది మాట్లాడితే పూలు రాలు తాయి మాటకు నవ్వుతుంది కాని ఆమె ముందు మాట్లాడే ధైర్యం ఎవరికి? అందం, ఆనందం నిరాడంబరత వారితోనే చూశాను. ధనికు లను అంతా స్తుతిస్తారు నిస్వార్థంగా అమీరుల ముఖస్తుతి చేసినా దోషం లేదంటాను బట్టలు ఆభరణాలుకూడా రూపానికి తగినట్లే ఉన్నాయి. లేత ఎరుపు ముసుగు భుజాలమీద పడుతూంది బిగుతైన చొక్కా ఎరుపు పైజామా చెవులకు పచ్చల దుద్దులు వజ్రపు ముక్కుపుడక మెడలో సాధారణ గొలుసు చేతులకు బంగారు గాజులు. అందం. అందానికి తగిన నిరాడంబరత అందుకు తగిన దుస్తులు. ఆభరణాలు. ఆశ్చర్యంతో చిత్తరువునై చూస్తున్నాను. నా రూపం ఎలాఉందో మీరు చూస్తూనేఉన్నారు కాని నమ్మండి ఆవిడ దృష్టికూడా నాపైనే ఉంది. నన్నే చూస్తూంది ఇరువైపుల చూపులు కలుస్తున్నాయి. అనేకసార్లు మనసులో ఒక ఆలోచన వచ్చింది కాని ఎలా వ్యక్తపర్చడం? ఏమని చెప్పడం? ఒక దాసిది వెనుక నిలిచి పంఖా వీచుతూంది ఇద్దరు ముందు నుంచున్నారు ఒకదాసి చేతిలో వెండి డబ్బా. మరొకదాసిచేతిలో పాన్‌దాన్ ఉన్నాయి చాలసేపు బేగమ్ మాట్లాడలేదు నేనూ మాట్లాడలేకపోయాను. చివరకు ఆమె ప్రారంభించింది

బేగమ్ నీ పేరేమి?

నేను (చేతులు కట్టుకొని) ఉమ్రావ్‌జాన్.

బేగమ్ స్వంతంగా లక్నోయేనా?

ఆ ప్రశ్నించిన పద్ధతికి బదులుచెప్పడం కష్టం అయింది ముఖ్యంగా ఈ సమయంలో స్వంత ఊరు లక్నో అని చెపితే నా మనసులో ఉన్న భావం నశిస్తుంది ఫైజాబాదు అని చెపితే అనవసరంగా రహస్యం బయట పడుతుంది బాగా ఆలోచించి చెప్పాను

నేను చిత్తం లక్నోలోనే పెరిగి పెద్దదాన్నయ్యాను.

చెప్పనైతే చెప్పానుగాని మళ్ళీ వచ్చే ప్రశ్న ఇబ్బంది కలిగిస్తుందని. తరవాత గ్రహించాను అనుకున్నట్లే అయింది. వెంటనే బేగమ్ అడి గారు

బేగమ్ అయితే పుట్టింది లక్నోలో కాదా?

బదులు చెప్పటానికి ఆలోచించాను. కొంచెం సేపు మౌనంగా ఉండి ప్రశ్న వినీ విననట్లు ఉండి "బేగమ్‌గారి జన్మస్థలం లక్నోలోనే ఉందా?' అని అడిగాను.

బేగమ్ ఒకప్పుడు. ప్రస్తుతం కాన్పూరే స్వగ్రామం అయింది.

నేను నేనూ అదే విశ్వసించాను.

బేగమ్ ఏమి?

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం మరీ కష్టమనిపించింది. కథంతా ఏమని చెప్పను? విన్నవిస్తే అనవసరంగా బాధపెట్టినట్లు అవుతుంది. "పరిస్థితులు అలా వచ్చాయి. లక్నో వెళ్ళటానికి ఎప్పుడూ ఇష్టపడటంలేదు" అన్నాను.

బేగమ్ మంచిది. కాని అప్పుడప్పుడు మా దగ్గరికి వస్తుండు.

నేను రావడం ఏమిటి? వెళ్ళడానికే మనసొప్పటంలేదు. ఒకటి కాదు రెండవది ఈ తోట, పరిసరాలు ఒకసారి చూసినవాడు విడవాలని అనుకుంటాడా? ముఖ్యంగా నాలాంటి మానసిక రోగపు స్త్రీలకు ఈ వాతావరణం ఎంతో హాయిగా ఉంటుంది.

బేగమ్ అయితే ఈ అడివి బాగనిపించిందన్నమాట. మనిషి అలికిడి ఉండదు. పట్నానికి కోసు దూరం. నాలుగు వైపుల పనులకు పంపితే ఉదయం వెళ్ళిన మనిషి సాయంకాలానికిగాని తిరిగిరాడు. కీచురాళ్ళ రొదకు చెవులు చిల్లులుపడతాయి. రోగం వస్తే ఊళ్ళో నుండి వైద్యుడు వచ్చేవరకు ప్రాణమే పోతుంది.

నేను ఎవరి మనసు వారిది. నాకు మాత్రం సరదాగా ఉంది. ఇక్కడ ఉంటే మరేదీ అవసరం ఉండదనిపిస్తుంది. అయినా ఇక్కడుంటే రోగాలెందుకు వస్తాయి?

బేగమ్ వచ్చిన కొత్తలో నేనూ ఇలాగే అనుకునేదాన్ని. కొన్నాళ్ళ తరువాత పట్టణాల్లో ఉండేవారు ఇక్కడ ఉండలేరని అర్థం అయింది. పట్టణాల్లో అనేకరకాల వినోదాలు ఉంటాయి. అన్నీ [illegible] రాత్రిళ్ళు నిద్ర పట్టడంలేదు. భయం భయంగా ఉంటుంది. దేవుడిచ్చిన వితా

యాలు సేవకులు అంతా ఉన్నారు ఇప్పుడుకూడా పది పన్నెండు మంది పగ నౌకరులు ఉన్నారు దాసీలకు లెక్కలేదు అయినా భయంగా ఉంటూంది మూడు నాలుగు రోజులు చూస్తాను అప్పటికీ పవాబు రాకుంటే ఊళ్లో ఏదైనా ఇల్లుతీసుకొని ఉంటాను

నేను క్షమించండి మీ స్వభావంలో భయం ఉన్నట్లుంది ఇలాంటి ఆలోచనలు రానీయకండి ఊళ్ళో పరిస్థితి చెప్పకండి ఎందరు ప్రాణాలు పోతున్నాయి ఇక రోగాల సంగతి అడక్కండి. ఆ దేవునికే తెలియాలి

ఇంతలో దాది పాపను ఎత్తుకొచ్చింది మూడేళ్ళ పసివాడు ఎంత అందంగా ఉన్నాడు! చిలక పలుకులు! బేగమ్ దాదినుంచి తీసుకొని ఒడిలో కూర్చోబెట్టుకుంది కొద్దిసేపు తరవాత దానికి ఇస్తుంటే నేను తీసుకున్నాను ముద్దులు పెట్టుకున్నాను చాలసేపు ఆడించాను దానికి ఇచ్చేశాను.

నేను బాబుకోసం తప్పక వస్తాను

బేగమ్ (చిరునవ్వు నవ్వి) "ఏదోవిధంగా రావడం కావాలి" అన్నారు.

నేను వస్తాను వస్తాను వస్తాను మీకు విసుగుకలిగేదాకా వస్తాను.

తరవాత ఆమాట ఈమాట మాట్లాడుకున్నాం బేగమ్ నా పాటను మెచ్చుకున్నారు ఇంతలో పంటమనిషి వచ్చి భోజనం సిద్ధంగా ఉందని నివేదించింది

బేగమ్ భోజనానికి పదండి

నేను: మంచిది

బేగమ్ లేచినుంచున్నారు నేనూ లేచాను ఆమె నా చేయి పట్టుకుంది. దాసీలతో "మీరు ఇక్కడే ఉండండి భోజనం చేసివచ్చి ఇక్కడే కూర్చుంటాం" అన్నది

నేను: మనోరంజకమైన ఈ వాతావరణం వదిలివెళ్ళ బుద్ధికావడంలేదు- కాని తమ ఆజ్ఞ

బేగమ్: ఇక్కడికే తెప్పించుకుందామా?

వస్తువు బేగమ్ నా ముందుంచేది. నేను కాస్త వెనుకా ముందాడినా ఆమె బలవంతంవల్ల ఎక్కువే తిన్నాను.

గిన్నె నీళ్ళు వచ్చాయి. చేతులు కడుక్కొని తాంబూలాలు వేసుకున్నాం. మళ్ళీ ఆ వేదికమీద సమావేశమైనాం. బేగమ్‌కాక చెలికత్తెలు దాసీలు మామాలు పనివాళ్ళు అంతా పదిపన్నెండుమంది స్త్రీలు ఉన్నారు.

తబలా జత సితార్ తేవలసిందని ఆజ్ఞాపించారు బేగమ్‌గారు. అవి వచ్చాయి. ఒక చెలికత్తె తబలా ప్రారంభించింది. బేగమ్ స్వయంగా సితార్ వాదనం ప్రారంభించగా నేను పాట ప్రారంభించాను.

భోజనాలయ్యేవరకే పది పదకొండైంది. పాటకు కూర్చునేవరకు సరిగ్గా పన్నెండు. ఎంతో దట్టంగా ఉన్న అడవిలోనూ కొండల్లోనూ సిద్ధంచేసిన ఆ తోట వింతగానూ భయంకరంగానూ కనిపిస్తోంది. ఆ ఉన్నతసౌధానికి ఒకమూలనుంచి చూడంగా దట్టంగా ఉన్న చెట్లచివర కొమ్మల్లోంచి చంద్రుడు కనిపిస్తున్నాడు. క్రుంగనున్నాడు. వెలుగుమీద చీకటి వ్యాపించింది. ప్రతివస్తువు భయానకంగా ఉంది. చెట్లు తమ పొడవుకంటే ఎంతో పొడవుగా కనిపిస్తున్నాయి. రయ్యిమని గాలి వీస్తోంది. సర్వీచెట్ల చప్పుడు వినిపిస్తోంది. నిశ్శబ్దవాతావరణంలో చెరువులో పడుతున్న నీటిధ్వని పెద్దగా వినిపిస్తోంది. అప్పుడప్పుడు ఒక పక్షి బెదిరిలేచి కేకపెడుతోంది. క్రూరమృగాల గాండ్రింపులకు పిట్టలు ఎగురుతున్నాయి. అవి ఎగిరినప్పుడు కొన్ని ఆకులు రాలుతున్నాయి. చేప అమాంతంగా చెరువులో గంతులువేస్తోంది. కప్పలు బెకబెక రాగాలు పాడుతున్నాయి. ఈ వేదికమీద కూర్చున్న భూషణభూషితలైన పది పన్నెండు మంది సుందరాంగులు తప్ప ఎక్కడా ఎవరు లేరు. గాలికి కొన్ని గాజు దీపాలు ఆరిపోయాయి. రెండు లాంతరులు వెలుగుతున్నాయి. వాటి అద్దాలు అనుపచ్చగా ఉన్నాయి. చెరువులో కనిపించే చుక్కల వెలుగుతప్ప అంతటా అంధకారం। సమయానుకూలంగా "సోహిని" ప్రారంభించాను. ఆ రాగపు భయంకర స్వరం హృదయాలను కదిలించింది. అంతా భయవిహ్వలులైనారు.

తోట భయంకరంగా ఉంది. కళ్ళలో భయం. గుండెలో భయం. ముఖ్యంగా దట్టమైన చెట్లకింద చిక్కని చీకట్లు చేరాయి. ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటున్నారు. ఎటుచూచినా నిరామయంగా ఉంది. నా గుండె దడదడలాడుతోంది. బేగమ్ అన్నది నిజం. ఇది ఉండదగిన

చోటుకాదు అనుకున్నాను. పక్కల కూతలు వినిపించాయి. దాంతో భయం మరీ ఎక్కువైంది. తరవాత కుక్కలు మొరిగాయి. భయంతో ఎవరినోటా మాటరాలేదు. ఇంతలో బాలీసుకు ఆనుకుని కూర్చున్న బేగం తలెత్తిచూచింది. ఎదురుగా ఏదో కనిపించింది. పెద్ద కేకపెట్టింది. పరుపుమీద పడిపోయింది. మిగతా స్త్రీలంతా అటు చూచారు. నేనూ వెనక్కు తిరిగి చూచాను.

బేగమ్ పిరికి అనుకున్నాను. కాని తీరాచూస్తే అర్థంఅయింది. ఎవరి గుండెలయినా పగులుతుంది. ఎదురుగా ముసుగు మనుషులు పది పదిహేనుమంది వస్తున్నారు. వారిచేతుల్లో నగ్నకరవాలాలున్నాయి. పరిగెత్తివస్తున్నారు. ఆడవారి కేకలు విని నౌకర్లు అటు పరిగెత్తారు. కొందరు దుడ్డుకర్ర లందుకొని, కొందరు రిక్తహస్తాలతోను పరిగెత్తారు. ఇటు మనుషులు తక్కువ ఉన్నారు. బందిపోట్లు ఎక్కువ ఉన్నారు. చాలమంది మధ్యనుంచే పారిపోయారు. నలుగురైదుగురు అరుగుదగ్గరకు వచ్చి చంపడానికీ, చావడానికి సన్నద్ధంఅయి నుంచున్నారు. స్త్రీలలో ఎవరికీ స్పృహలేదు. అంతా తెలివితప్పి పడిపోయారు. ఒక్క రాతిగుండెది మాత్రం చూస్తూకూర్చుంది. గుండె దడదడ కొట్టుకుంటూంది. ప్రాణాలు లేచిపోతున్నాయి. యా అల్లా ఏమిటీ అవాంతరం!

ఆయుధపాణులైన బేగమ్ మనుషులు ముందడుగు వేస్తుండగానే సర్ఫరాజ్ అనే సిపాయీ ఆపాడు. అతడు తన తోటివారితో "ఆగండి. తొందరపడవద్దు. ముందు వీరు ఏ ఉద్దేశంతో వచ్చారో తెలుసుకుందాం" అని, దొంగలతో "మీ ఉద్దేశ్యం ఏమిటి?" అని అడిగాడు.

"మేము వచ్చిన పనేమిటో ఇప్పుడే తెలిసిపోతుంది" అన్నాడు ఒక దొంగ.

సర్ఫరాజ్ : డబ్బు హరించడానికి వచ్చారా? ప్రాణాలా?

రెండో దొంగ : మాకు ప్రాణాలతో నిమిత్తంలేదు. వాటితో మాకేం వైరం? మేము వచ్చిన పనికి అడ్డుతగిలితే మాత్రం వదలం.

సర్ఫరాజ్ : (కాస్త శాంతింగా) అయితే ఆడవారి మానాలు హరిస్తారా? అదే మీ.........

సర్ఫరాజ్ మాట పూర్తికాకముందే "కాదు బాబూ! ఒకరి ఆడ వాళ్ళతో మాకేం పని? మాకుమాత్రం కూతుళ్ళు, కోడళ్ళూ లేరు? ఎవడు చేయివేయగలడు ఆడవాళ్ళమీద?

ఆ ధ్వని నాకు పరిచితమైనట్లనిపించింది.

సర్ఫరాజ్: (సంతోషంతో) అదే నేను అడిగింది. అయితే అన్నలారా! ఇప్పుడే తాళంచెవులు తెప్పించి ఇస్తాను. గదులలో ఉన్న ఆడవారిని ఇక్కడికి పిలిపించుకుంటాను. యజమానురాలు బేగమ్ గారు ఇక్కడే ఉన్నారు. మీరు కోటలో ప్రవేశించి మీ ఇష్టం వచ్చింది తీసుకోండి. ఆడవారి మెడల్లోని సొమ్ములు ఇక్కడే ఒలిచి ఇస్తాం. దీంతో మా దొర వకీరు అయిపోడు. దేవుని దయవల్ల బ్యాంకుల్లో లక్షలున్నాయి. జాగీరునుంచి వచ్చే డబ్బు లెక్కలేదు.

దొంగ: అంతకంటే కావలసిందేమి? కాని చూడు. మోసం జరుగరాదు.

సర్ఫరాజ్: సిపాయి పుత్రుడు మోసం చేయడు. నమ్మండి.

నేను ధ్వని గుర్తించిన దొంగ ముందుకు సాగాడు. "మంచిది. అయితే తాళంచెవు లేవి?" అడిగాడు. ఆ మాటలంటూంటే నామీద దృష్టి పడింది. నేనూ అతణ్ణి చూచాను. గుర్తించాను. కాని భయంతో వణికి పోతున్నాను. మాట రావడంలేదు. అతడే ముందుకు వచ్చి అడిగాడు "వదినా! మీరిక్కడ?" అని.

నేను: మీ అన్న జైలుకు వెళ్ళినప్పటినుంచి ఇక్కడే ఉన్నాను.

ఫజలలీ: ఇక్కడా! ఎక్కడ?

నేను: ఉండటం ఊళ్ళో. కాని నా చెల్లెలు ఈ నవాబుగారిదగ్గర కొలువుంది. చూడడానికి వచ్చిపోతుంటాను.

ఫజలలీ: ఏదీ మీ చెల్లెలు?

నేను: ఇక్కడే ఉంది. మీరు వస్తున్నారనే కల్లోలంతో తెలివితప్పి పడి పోయింది. గోషా స్త్రీ. వయసులో వేశ్య అయింది. అప్పటినుంచి నవాబులవద్ద. ఆమీరులవద్ద కొలువుచేస్తోంది.

ఫజలలీ: (తన సహచరులతో) "ఇక్కడి ఒక్క పైస ముట్టినా నామీద

ఒట్టు ఈ విషయంలో మాత్రం నేను మీవాణ్ణి కాను " అన్నాడు

దొంగ ' ఆ మాత్రానికి రావడం దేనికి ? అడిగాడు

ఫజలలీ ఎందుకు వచ్చామో అందరికీ తెలుసు చూస్తున్నారా ఏమ తున్నారో ఇక్కడ ? ఫైజూఖాయి ఆరది ఈమె చెల్లెలు ఇల్లే దోచుకుందామా ? జైల్లో ఉన్నవాడికి తెలిస్తే ఏమంటాడు ?

ఈ మాటమీద దొంగల్లో తగాదా మొదలైంది అంతా ఫజలలీ ఆధీనంలోనివారు ఎదురుచెప్పడానికి ఎవనికీ ధైర్యం చాలలేదు ఆయినా పట్టిచేతులతో తిరిగిపోవటం ఎవరికీ ఇష్టంలేదు దొరికింది ఒక్క అవ కాశం దాన్ని ఖాను జారవిడుచుకుంటే పొట్ట ఎలా గడవాలి ?

ఫజలలీ తన గుంపునుంచి వేరుగా ఉంటున్నాడు ఒక నల్లని ఎత్తైన మనిషి అతని పక్కకు చేరి ' ఖానుగారూ ! నేను మీపక్షమే " అన్నాడు

ధ్యానంగా చూశాను అతడు ఫైజలీపైను అతణ్ణి పిలిచాను వేరుగా తీసికెళ్ళి మాట్లాడాను బేగమ్‌గారు బహూకరించిన రూపాయిలు వవరసులు ఇచ్చేశాను

ఫజలలీ సర్ఫరాజ్‌ఖానుతో నేను నీవాణ్ణి ఇక వారున్నారు నీవున్నావు ఏం ఇష్టం '' అన్నాడు

సర్ఫరాజ్ నేను వీరిని ఒప్పిస్తాను మీరందరూ ఇక్కడ్నుంచి వెళ్ళండి ఆడవాళ్ళు శిబిరంలో ఉన్నారు బేగమ్‌గారు తెలివితప్పి పడి పోయారు వారికి తెలివి రానీయండి మిమ్మల్ని సంతోషపెట్టి పంపిస్తా సరేనా

దొంగలు అక్కడ్నుంచి వెళ్ళిపోయారు బేగమ్‌గారు స్పృహలేక పడిఉన్నారు చెరువులోంచి దోసిలిలో నీళ్ళుతెచ్చి ముఖంమీద చల్లాను వారి సేవటికి తెలివి వచ్చింది అల్లా అనుగ్రహంవల్ల ఆపద తొలగి పోయింది ధైర్యం తెచ్చుకొని కూర్చోండి " అన్నాను మిగతా స్త్రీలను కూడా నీళ్ళుచల్లి కూర్చోపెట్టాను. అందరికీ ధైర్యం చెప్పి జరిగిన వృత్తాంతం బేగమ్‌గారికి విన్నవించాను బేగమ్‌గారు చాల సంతోషించారు సర్ఫరాజ్‌ఖానును పిలువనంపారు.

సర్ఫరాజ్ షహ్బాష్ ! కాస్తో కూస్తో ఇవ్వాలి. ఉమ్రావ్‌జాన్ లేకుంటే ప్రమాదం తప్పేదికాదు.

నేను ఈ విషయాలు చెప్పదలచలేదు. అతడు చెప్పేవాడు. బదులు చెప్పదలచుకోక "విత్రం. నేనేమీ చేయలేదు. అంతా దైవికం" అన్నాను.

సంగ్రహంగా చెప్పాలంటే బేగమ్ పెట్టె తెప్పించింది. అయిదు వందల రూపాయిలూ, అంతమొత్తపు నగలూ వారికిచ్చి వదిలించుకుంది. అప్పుడుగాని అందరికీ ప్రాణాలు రాలేదు. నాటి బేగమ్ మాటలు నేటికీ గుర్తున్నాయి.

బేగమ్ : ఏమి ఉమ్రావ్‌జాన్! తోటలో ఉండే హాయి చూచావా?

నేను : వాను కలవిచ్చింది నిజమని గ్రహించాను హుజూర్.

అప్పటికి తెల్లవారుజాము పూర్తైంది. అంతా లేచి బంగళాలోకి వెళ్లాం. వరండాలో నాకోసం మంచం వేశారు. నిద్ర ఎలా వస్తుంది? రాత్రంతా మేలుకునే ఉన్నాం. తెల్లవారుతుండగా నిద్రపట్టింది. ఇంకా నిద్రలోనే ఉన్నాను. నా సేవకులు సవారీ తెచ్చారు. నన్ను లేపారు కళ్ళు నలుపుకుంటూ బయటకు వచ్చినాను.

సేవకుడు : మీరు ఇక్కడ హాయిగా ఉన్నారు. మేము తెల్లవార్లూ ఎదురుచూస్తూ కూర్చున్నాం.

నేను : ఎలా వస్తాను? సవారీ పంపించానుగా!

సేవకుడు : సరే పదండి. లక్నోనుంచి మీకోసం మనుషులు వచ్చారు.

వచ్చిందెవరో గ్రహించాను. బువాహుసేనీ, గోహర్‌మిర్జా మొత్తానికి జాడ తెలుసుకున్నారు.

నేను : అచ్ఛా పదండి. సవారీ తెచ్చారా?

సేవకుడు : చిత్తం.

అప్పటికి ఒకరిద్దరు ఆడవాళ్లు మేల్కొన్నారు. బేగమ్‌గారిని కలుసు కొని వెళ్ళవలసిందని వారించారు. "పని ఉంది. బేగమ్‌గారు ఎప్పుడు లేస్తారో? మళ్ళీ దర్శనం చేసుకుంటాను" అన్నాను.

# 16

ఇల్లు చేరి చూస్తే ఖుబా హుసేనీ, గోహర్ మిర్జా కనిపించారు. ఖుబా హుసేనీ నన్ను కౌగిలించుకొని ఏడ్చింది. నేను ఏడ్చాను.

ఖుబా హుసేనీ: బిడ్డా! రాతిగుండెదానవే! ఎవరిమీదా లేదేమె!

నేను మొదలే సిగ్గుతో చచ్చిపోతున్నాను. ఏమంటాను? ఏడుపు నటించాను.

ఆ మాటా ఈ మాటా అయినతరవాత అదేరోజు లక్నో వెళ్ళడానికి తయారైంది. అత్త చెప్పాను. వినదే. అంత మంకుతనానికి కారణం మౌల్వీగారు జబ్బుపడ్డారు. క్షణం నిలుపలేకపోయింది. వాత్సల్యం ఆమెను ఇక్కడికి లాక్కొచ్చింది. కాన్పూరులో వస్తువులు కొనడంలోనూ, ఇంటి అద్దె చెల్లించడం, పనివాళ్ళ లెక్కచూచి డబ్బు ఇచ్చేయడంలో ఆ రోజు గడిచిపోయింది. బండి బాడుగకు తీసుకున్నాను. మరి పనికిరాని వస్తే పనివాళ్ళకు ఇచ్చేశాను. మిగతా సామానంతా బండిమీద వేశాను. తెల్లవారిరోజు లక్నో చేరుకున్నాం. మళ్ళీ అదే ఇల్లు. అదే వాకిలి. అదే గది. ఆ మనుషులే.

ఉన్మత్తావస్థ మధ్యంలో
దారితప్పెను ఈ హృదయం,
వెదకి తెచ్చారు ఆత్మీయులు
తగిలించారు జీవితబంధాలు.

# 17

భయదమైన పెనుగాలుల వీచి
భగ్గు భగ్గుమని మండె బ్రతుకు దివ్వె
వ్యధార్తి హృదయ మాక్రోశించె
దిగంతాల నాక్రమించె ఆక్రందన!

నవాబ్ మలికా-ఏ-కిషోర్ దర్బారులో శోకగీతాలాపం రాజ్యం అంతరించేవరకు కొనసాగింది. ఆ రోజుల్లో షహజాదే సికిందర్ హష్మత్ ఉరఫ్ జర్నీల్‌సాహబ్ పాటకత్తెల్లో నాపేరూ ఉండేది. మహాప్రభువు. జర్నీల్‌గారు కలకత్తా వెళ్ళిపోయారు. ఆ బంధం తెగిపోయింది.

పితూరీ సైనికులు మిర్జా బర్‌జిస్‌ఖదర్‌ను గద్దె ఎక్కించినపుడు అభినందన సమర్పణకు నన్ను పిలిపించారు. నగరం అంధకారబంధురంగా ఉంది. ఇదిగో ఈ ఇంట్లో దోపిడి. తెల్లవారి దొంగ పట్టుబడ్డాడు. మూడోరోజు వాణ్ణి కాల్చేశారు. ఇవే వార్తలు. అంతా కల్లోలం. అంతా అయోమయం. సయ్యద్ ఖుత్బుద్దీన్ అనే సైనికాధికారి ఉండేవారు. రాజభవనరక్షణాకార్యం వారికి అప్పగించబడింది. వారికి నేనంటే ఎంతో దయ. చాలవరకు అక్కడే ఉండాల్సివచ్చేది. పాటకోసంకూడ సమయాసమయాలల్లో పిలుపు వచ్చేది.

ఆ రోజు ప్రభుత్వహయాములో బర్‌జిస్‌ఖదర్ పదకొండవ జన్మదినోత్సవం అతివైభవంగా జరిగింది. ఆ సందర్భంలో కాశ్మీరీయులు ఈ గజల్ పాడారు:

ఓయి విధుడ! చంద్రుడ నీవు
ఆలభ్యరత్న మీవు! నీవేగదోయి!

ఆ సందర్భానికిగాను నేనొక గజల్ రచించాను. దాని ఆదిచరణాలు ఇవి.

నీచూపులు వేల ప్రాణాలు హరిస్తాయి
కరుణించావా వేల ప్రాణాలు లేచివస్తాయి

రుస్వా: ఆదివరకాలే అందరినీ అంతమొందించేట్లున్నాయి........

ఉమ్రావ్: పదకొండు ద్విపదలు చెప్పాను. ఈ ఆదివరకాలుతప్ప గుర్తులేవు. అలాంటి కల్లోలపు రోజులవి. గుండెమీద కుంపటిగా ఉండేది. గజల్ కాగితంమీద వ్రాసి పాన్‌దానులో పెట్టాను. బేగమ్‌గారు 'కైసర్‌బాగ్' నుంచి వెళ్ళిపోయేదాకా అందులోనే ఉంది. పారిపోయే హడావుడిలో పాందానే కాదు చెప్పులు, మేని ముసుగుకూడా పోయాయి.

రుస్వా: బేగమ్‌గారు కైసర్‌బాగ్‌నుంచి వెళ్ళిపోయింది ఏ రోజో గుర్తుందా?

ఉమ్రావ్: రోజు గుర్తులేదు. హజారీ రోజో, రెండో రోజో కావచ్చు.

రుస్వా: బాగా గుర్తుంచుకున్నారు. రజ్జబ్‌నెల ఇరవైతొమ్మిదా? ఋతు వేది?

ఉమ్రావ్: చలికాలపు చివరిరోజులు. నౌరోజ్ అప్పటికి నాలుగైదు రోజులు ఉండిఉంటుంది.

రుస్వా: ఖచ్చితంగా చెప్పారు. మార్చినెల పదహారవ తేదీ. అవ్వా మీరు బేగమ్‌గారితోనే కైసర్‌బాగ్ వదిలి వెళ్ళిపోయారా?

ఉమ్రావ్: (కథంతా తిరిగి చెప్పాల్సివచ్చింది) ఫైజూతో లేచిపోయిన రోజు నగలు, అష్రఫీలు అన్నీ ఒక పెట్టెలో పెట్టి దానిచుట్టూ ఒక గుడ్డ చుట్టాను.

ఖానమ్ ఇంటివెనుక ఒక మీర్‌సాహెబ్ ఉండేవారు. ఇమామ్‌బాడా ప్రహారీ ఎక్కితే వారి ఇల్లు కనిపిస్తుంది. నేను తరచు పీటవేసుకొని గోడ మీదినుంచి మీర్‌గారి చెల్లెలితో మాట్లాడేదాన్ని. ఆ నగల పెట్టె మీర్ గారి చెల్లెలికిచ్చి జాగ్రత్తగా కాపాడవలసిందని చేతులు జోడించి ప్రార్థించాను. ఆమె ఫైజాబాదునుంచి వచ్చినతరవాత గుడ్డచుట్టిన ఆ పెట్టె యథాతథంగా అప్పగించింది. పితూరీలో దేశంలో ఇండ్లన్నీ దోచుకొనబడినాయి. దోపిడిలో పోయిందంటే ఏం చేసేదాన్ని? ఆమె నిజాయితీ మెచ్చుకోవాలి. ఒక్క దమ్మిడీ నష్టంకాలేదు. అలాంటివారు ఉండబట్టే కాలం అవుతూంది. కాకుంటే ఎప్పుడో ప్రళయం రావలసింది.

రుస్వా ఎంత సొమ్ము ఉండిఉంటుంది?

ఉమ్రావ్ పది పదిహేనువేలవరకు

రుస్వా అదంతా ఏమైందిప్పుడు?

ఉమ్రావ్ కొందామికేముంది? వచ్చిన దారినే పోయింది

రుస్వా పెతూరిలో మీది ఒక్క దమ్మిడీ పోలేదనీ మీ సొమ్మంతా మీదగరే భద్రంగా ఉందనీ చెప్పుకుంటున్నారే జనం

ఉమ్రావ్ ఆ సొమ్మే ఉంటే ఈ గతెందుకు?

రుస్వా మీరు పాతరతీరాకని చెప్పుకుంటున్నారు కాకుంటే రోజులు ఎలా గడుస్తాయి? ఇప్పటికీ మీరింత దిగజారలేదే? ఇద్దరు నౌకరు లున్నారు మంచి బట్టలు మంచి భోజనం ఎలా వస్తాయి ఇవన్నీ?

ఉమ్రావ్ భగవంతుడున్నాడు ఎవనికి ఎంత కావాలో అంత ఇస్తాడు ఆ సొమ్ములో ఒక్క దమ్మిడీ మిగల్లేదు

రుస్వా అయితే ఏమైనట్లు?

ఉమ్రావ్ ఏం చెప్పను? ఒక మహానుభావుడు

రుస్వా అర్థమైంది గోహర్ మిర్జాగారి పని అయివుండాలి

ఉమ్రావ్ నా నోటితో చెప్పను మీ ఊహ తప్పుకూడా కావచ్చు

రుస్వా: అది తమ ఔదార్యం చూడండీ అతడెంత హాయిగా ఉన్నాడో మీ విషయం తలచనైనా తలచడు

ఉమ్రావ్ మిర్జాగారు! తోగండావితో చెలిమి ఎంతకాలం? ఎందుకు తలచాలి? బంధం తెగి చాలకాలం అయింది

రుస్వా వస్తుంటాడా ఎప్పుడైనా?

ఉమ్రావ్ వాడెందుకు వచ్చేస్తాడు? పెళ్లాంమీద ప్రేమ కలిగింది నేనే వెళ్తుంటాను నాలుగు రోజులక్రితం వెళ్ళాను పాపకు పాలు మాన్పిస్తున్నామని పిలిచారు

రుస్వా: ఏదైనా ఇచ్చి వచ్చారా?

ఉమ్రావ్ లేదు ఇవ్వలేదు ఒకరికి ఇచ్చేంత అర్హతా ?

రుస్వా ఆయితే ఆ సొమ్ము గోహర్‌మిర్జాసాహెబ్ కాజేశారు ?

ఉమ్రావ్ మిర్జాసాహెబ్ ! సొమ్ము శాశ్వతమా ? అది అరచేతి మట్టి మాట నిలిచిపోతుంది ఇప్పటికీ అల్లా దయవల్ల వస్తువులుండడం లేదు ఆదరించే తమలాంటివారు క్షేమంగా ఉంటే చాలు. ఎలాంటి ఇబ్బంది ఉండదు

రుస్వా అది చెప్పాలా ? ఇప్పటికీ వెలమందికంటే బాగున్నారు మీ శీలాన్ని మెచ్చుకోవాలి భగవంతుడు తీర్థయాత్రలు సైతం అనుగ్రహించాడు

ఉమ్రావ్ చిత్రం మౌలా అన్ని కోర్కెలు తీర్చాడు మిగిలిన కోరికల్లా మళ్ళీ కర్బలాకు పిలుచుకొమ్మని. అక్కడే మట్టి అయి పోతాను మిర్జాగారూ ! తిరిగి రాగూడదనే వెళ్ళాను కాని భగ వంతుడు లక్నో పిచ్చి పట్టించాడు ఈ తడవ దేవుని దయవల్ల వెళ్ళడం సంభవిస్తే తిరిగి రావడం కల్ల

# 18

వినిపించితి నా వ్యథానిగాథ ।
ఎంటిరి ఇంక విసిగెదలతురా మీరు ?
ఇంక నిందేమి మిగిలెను మీకా ?

బొండీనుంచి వేగంగానూ బిర్జిస్‌ఖదర్ నేపాల్ వెళ్ళిపోయారు సయ్యద్ ఖుత్బుద్దీన్ యుద్ధంలో కూలాడు. నేను ఫైజాబాదు చేరాను ముందు సత్రంలో దిగాను తరవాత గది ఒకటి తీసుకున్నాను గానా బజానా ప్రారంభించాను

ఫైజాబాదులో ఆరునెలలు గడిచాయి అక్కడి వాతావరణం అను కూలంగా ఉంది వారానికో పది రోజులకో కచేరీ ఉండేది ఊరంతా నా పాటలతో మోగిపోయింది కచేరీ జరిగినచోటల్లా వేల

మంది విరుచుకుపడ్డారు తొగత్తులు నా గదిలోదాకా వినిపించాయి. లోలోపల సంతోషపడేదాన్ని. అప్పుడప్పుడు బాల్యం గుర్తుకువచ్చేది. ఉద్రేకం కలిగేది రాజ్యపతనం పితూరి బర్జిస్‌ఖదర్ అన్నీ చిత్ర పటాల్లా కళ్ళముందు కనిపించేవి గుండె బంతవారింది తల్లిదండ్రులు జ్ఞాపకంరాగానే అసలు జీవించివున్నారో లేరో అనే ఆలోచన వచ్చేది. ఉన్నా వారికి నాతోనేం పని? వారిస్థితి వేరు నా స్థితి వేరు కన్నవారని మనసు లాగుతుందిగాని మానమర్యాద లున్నవాడు ఎవడొస్తాడు ఈ చోటికి? ఈ స్థితిలో వారిని కలుసుకోవడం వారిని దుఃఖంలో ముంచడమే అవుతుంది ఇంటి ధ్యాస వచ్చేవరకు ఈ ఆలోచనలన్నీ వస్తాయి మనసు మళ్ళించుకుంటాను

తరచుగా లక్నో గుర్తుకువచ్చేది బాధ కలిగేది కాని పిల్లవాన్ని గురించి తలచుకుంటే గుబులుపుట్టేది అక్కడమాత్రం ఎవరున్నారు? ఎవరికోసం వెళ్ళేది? ఖానమ్ బ్రతికుంటేమాత్రమేం! ఆవిడతో ఇప్పుడేం పొసగుతుంది? పూర్వంలా ప్రభుత్వం చెలాయిస్తుంది ఆవిడ కట్టు బాట్లలో ఉండటం నాకు ఇష్టంలేదు మీర్‌గారి చెల్లెలిదగ్గరున్న సొమ్ము ఇంకేం దొరుకుతుంది? మొత్తం లక్నో దోచుకోబడింది మీర్‌గారి ఇల్లు కూడా గుల్ల అయివుంటుంది కాలేదనుకున్నా వానితోనేం పని? ఇక ఆ ఆలోచనే వృథా నా వంటిమీద ఉన్నదే చాలు!

ఒకరోజు గదిలో కూర్చొనివున్నాను ఒక వ్యక్తి వచ్చాడు ముఖాన్నిబట్టి ఉత్తముడుగా కనిపించాడు మంచి మనిషి తాంబూలం సిద్ధంచేసిఇచ్చాను హుక్కా పింపించాను మాటల సందర్భాన బహు బేగమ్ బంధువులలోనివారని తెలిసింది బహూబేగమ్ సమాధివద్ద జరిగే దీపోత్సవాన్ని గురించి ప్రస్తావించి పాత ఉద్యోగులనుగురించి అడిగాను.

నేను   పాత పనివారిలో ఇప్పుడు ఎవరెవరున్నారు?

అతను   కొందరు చనిపోయారు కొత్తవాళ్ళు వచ్చారు పద్ధతులు మారాయి క్రొత్త ఏర్పాట్లు జరిగాయి

నేను   పాతవారిలో ఒక ముసలి జమేదార్ ఉండేవారు

అతను   అవును ఉండేవాడు అతను మీకెలా తెలుసు?

నేను !   పిల్లవానిగా నుండి మొహర్రంలో ఫైజాబాదు వచ్చాను దీపో

క్షపం చూడ్డానికి వెళ్లాను అతడు చాల మర్యాదచేశాడు

అతను ఎవరు ? కూతురు తప్పిపోయిన జమేదారేనా ?

నేను నాకేం తెలుసు ? (కథ అందరికీ తెలుసునన్నమాట )

అతను చాలమంది జమేదార్లు ఉండేవారు ఉన్నారు విప్లవానికి పూర్వం దీపాల ఏర్పాటు వగైరా అతనే చూచేవాడు

నేను వారికి ఒక కొడుకుకూడా ఉండాలే !

అతను అతడెక్కడ కనిపించాడు ?

నేను అదేరోజు పోలికలనుబట్టి అనుకున్నాను

అతను జమేదార్ విప్లవానికి ముందు చనిపోయాడు అతని స్థానంలో కొడుకు పనిచేస్తున్నాడు

ఆ మాట తప్పించడానికి ఇంకేవో విషయాలు అడిగాను. నవాబు గారు విషాదగీతం పాడమన్నారు రెండు వినిపించాను ప్రభావితు లయారు అప్పటికి చాల రాత్రి అయింది వెళ్ళిపోయారు

తండ్రి చనిపోయిన వార్త దుఃఖంలో ముంచింది రాత్రంతా ఏడ్చాను మరునటి రోజు తమ్ముణ్ణి చూచిరావాలనిపించింది రెండు రోజులతరవాత ఒక కచేరీకి పిలుపు వచ్చింది అక్కడికి వెళ్ళాను వీధి పేరు గుర్తులేదుకాని ఇంటిముందు పెద్ద చింతచెట్టు ఉంది దానిక్రిందనే వేదిక కట్టి రంగస్థలం తయారుచేయబడింది జనం బాగా వచ్చారు తెరల మరుగున దాబాలమీద స్త్రీలున్నారు తొమ్మిది గంటలకు పాట మొదలైంది పన్నెండు గంటలదాకా సాగింది ఆ ప్రదేశాన్ని చూస్తే గుండె నీరు అవుతూంది దుఃఖం ముంచుకువస్తూంది మా ఇల్లు ఇక్కడే ఉండాలి ఈ చింతచెట్టుక్రిందనే నేను ఆడుకున్నది అక్కడ కూడిన కొందరి ముఖాలు ఎప్పుడో చూచినట్లున్నాయి బయటకు వెళ్ళి చూచాను ఇళ్ళు అదొకరకంగా కనిపించాయి ఆ స్థలం కాదేమో అనుకున్నా ఒక ఇంటిని జాగ్రత్తగా పరిశీలించాను అది మా ఇల్లే ఇంట్లోకి వెళ్ళాలని పించింది అమ్మ కాళ్ళమీద పడాలనుకున్నాను ఆమె నన్ను కౌగిలించు కుంటుంది కాని ధైర్యం చాలలేదు పల్లెల్లో భోగంవాళ్ళను ఏహ్యంగా చూస్తారు తమ్ముని గౌరవం మర్యాద మంటకలవడమా ? నవాబుగారి

మాటలనుబట్టి జమీందారు కూతురు వెళ్ళిపోవడం అందరికీ తెలుసునని విదితం అయింది. ఖర్మ! ఒక్క గోడమాత్రం అడ్డంగా ఉంది. గోడకు అవల మా అమ్మ. ఇవతల తల్లికోసం తపించే నేను. ఒక్క చూపు అదీ సాధ్యపడదా? అబ్బ విధి ఎంత బలీయమైంది!

ఆలోచనలతో సతమతం అవుతుండగా ఒకావిడ వచ్చి "లక్నో నుంచి వచ్చింది నువ్వేనా?" అని అడిగింది.

నేను "అవును" అన్నాను. నా ఎద అరచేతిలో గంతులువేస్తోంది.

ఆవిడ "అయితే ఇలా రా. ఎవరో పిలుస్తున్నారు" అన్నది.

నేను "మంచిది" అని ఆవిడను అనుసరించాను. అడుగులు బరువైనాయి. ఎక్కడో వేస్తే ఎక్కడో పడుతున్నాయి.

ఇంట్లోకి తీసికెళ్ళింది. వరండాలో కూర్చోపెట్టింది. లోపలి గుమ్మానికి గోనెసంచి తెరఉంది. దానివెనుక ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు నుంచొని ఉన్నారు.

ఒకామె లక్నోనుంచి వచ్చింది నువ్వేనా?

నేను అవును

రెండవది నీ పేరు?

నేను (చెప్పెయ్యమన్నది మనసు. కాని నిగ్రహించుకున్నాను) ఉమ్రావ్‌జాన్

మొదటిది పుట్టిల్లు లక్నోయేనా?

నేను (నిగ్రహించుకోలేకపోయాను. కన్నీరు జలజల రాలింది) "పుట్టిల్లు ఇక్కడే" అన్నాను.

మొదటిది అయితే బంగ్లాదానివా?

నేను. (కన్నీరు కారుతూనేవుంది) కష్టంగా "అవునండీ" అన్నాను.

రెండవది కులానికి బోగందానివా?

నేను కులం కాదు. తలరాత ఇలా చేసింది

మొరటిది (స్వయంగా ఏడుస్తూ) ఎందుకు ఏడుస్తున్నావు? నిజం చెప్పు నువ్వెవరు?

నేను: (కన్నీరు తుడుచుకొని) "ఎవరినని చెప్పను? చెప్పరావటం లేదు" ఎంతో ప్రయత్నంమీద ఆమాత్రం చెప్పాను ఇక వశం కాలేదు ఊపిరి ఆడటంలేదు

ఇంతలో ఆ ఇద్దరూ తెరలోంచి వచ్చినారు ఒకావిడ చేతిలో దీపం ఉంది ఆవిడ నా చెవిదగ్గర జాగ్రత్తగా చూచి రెండో ఆవిడను చూచి "నేను అనలేదా అదే అని" అన్నది

రెండో ఆవిడ "నా అమీరన్" అని కావిలించుకొని ఏడ్చింది తల్లీ కూతుళ్ళం పెద్దగా ఏడ్చాం ఎక్కిళ్ళు వచ్చాయి ఇద్దరు స్త్రీలు వచ్చి విడదీశారు తరవాత నా కథంతా చెప్పాను అమ్మ విన్నది ఏడ్చింది ఆ రాత్రి అంతా అక్కడే కూర్చున్నాం ఉదయం వచ్చేశాను వచ్చేప్పటి తల్లిచూపు జీవితాంతం మరువలేను మసకచీకట్లోనే నా గదికి వచ్చేశాను తెల్లవారి కచేరీ కాని మొత్తం డబ్బు వాపసు ఇచ్చేశాను శరీరం బావుండలేదని బొంకాను వధువు తండ్రి సగం డబ్బు మళ్ళీ నాకు పంపించాడు ఆనాటి నా స్థితి అల్లాకే తెలియాలి తలుపులు వేసుకొని రోజంతా ఏడ్చాను

రెండవరోజు సుమారు గడియరాత్రికి ఒక యువకుడు వచ్చాడు చామనఛాయ సుమారు ఇరవై ఇరవైరెండేళ్ళవాడు సిపాయీల దుస్తుల్లో ఉన్నాడు హుక్కా నింపించాను పాన్‌దాన్‌లో ఆకుల్లేవు. దాసీదాన్ని పిలిచి చెవిలో ఆకులు తెమ్మని చెప్పి పంపాను గదిలో అప్పుడు కాస్తా మరెవరూ లేరు నేను ఆ యువకుడు మాత్రం ఉన్నాం

యువకుడు 'నిన్న కచేరీకి వెళ్ళింది నువ్వేనా? తీవ్రంగా అడిగాడు

నేను (వణికిపోయి) 'అవును' అని ముఖం చూశాను కళ్ళు రక్తం కక్కుతున్నాయి

యువకుడు (తల వంచుకొని) ఇంటి పేరు బాగా వెలిగిస్తున్నావు. నువ్వు చచ్చిపోయావనుకున్నాము ఇంకా బ్రతికే ఉన్నావా?

నేను: దౌర్భాగ్యురాలిని చావలేదు అన్నా! త్వరగా తీసికెళ్ళు

యువకుడు  ఈ బ్రతుకుకంటే చావే లక్షపాళ్ళు నయం ఎందులోనన్నా పడి చావరాదూ। ఇంత విషం తింటే పోయేదిగా।

నేను  నాకేమో అంత తెలివిలేదు ఇవ్వాళటివరకు ఇలాంటి మంచి సలహా ఇచ్చినవాడూ కనిపించలేదు

యువకుడు  అంత సిగ్గున్నదానివైతే ఈ ఊరికే వచ్చేదానివి కావు వచ్చినా పుట్టినవారలో భోగం మేళానికి ఒప్పుకునేదానివు కావు

నేను  అవును తప్పే కాని నాకు తెలియందే।

యువకుడు  ఇప్పుడు తెలిసిందిగా।

నేను  అయితే ఏమౌతుంది?

యువకుడు  (క్రోధంతో) 'ఏమౌతుంది' ఏమౌతుంది? అని ఒర్లోంచి కత్తిదూసి నామీద పడి చేతులు పట్టుకొని గొంతుమీద కత్తి పెట్టి "ఇదిగో ఇది అవుతుంది" అన్నాడు

ఇంతలో దాసీది ఆకులు తెచ్చి పరిస్థితి చూసి అమ్మను చంపేస్తున్నారు రాండి పరిగెత్తండి అని కేకలు పెట్టింది

మెడమీదినుంచి కత్తి తీసి "అందాన్నేం చంపను? అదీ ఏ ఆడది నా  అని ఎక్కెక్కి ఏడ్చాడు

నేను ముందునుంచే ఏడుస్తున్నాను కత్తి కుత్తుకమీదికి వచ్చేవరకు ప్రాణభయంలో గుండెలో ఒక పోటు పొడిచినట్లైంది శ్వాస నిలిచిపోయింది అతడు ఏడిచాడు ఏడుపు సాగించాడు నేనూ ఏడ్చాను

దాసీది ఒకటి రెండు కేకలు వేసింది దానికి అంతా వింతగా తోచింది. నేను సైగచేసి వారించాను వచ్చి ఒకపక్కను నుంచుంది

ఇద్దరం ఎంతోసేపు ఏడ్చాం

యువకుడు: (చేతులు జోడించి) "తల్లీ! నమ్ము కరుణించు ఈ ఊరు విడిచి వెళ్లిపో" అన్నాడు బ్రతిమిలాడినట్లు.

నేను: రేపు వెళ్ళిపోతాను వెళ్లేముందు ఒక్కసారి అమ్మను చూస్తా

యువకుడు  క్షమించు ఇంక మరిచిపో నిన్న అమ్మ నన్ను ఇంట్లోకి పిలిచింది నేను ఇంట్లో లేను ఉంటే చాలా గొడవ అయ్యేది వీధంతా ఇదే గుసగుసలు

నేను  చూశావుగా నాకు ప్రాణభీతి లేదు కాని నీవు మాత్రం చల్లగా వర్ధిల్లాలి నీ పిల్లలకోసం బతికిఉంటే ఎప్పుడో ఒకప్పుడు కుశల వార్త తెలుస్తుంటుంది

యువకుడు  మా విషయం మాత్రం ఎవరికీ చెప్పొద్దు

నేను  మంచిది

యువకుడు వెళ్ళిపోయాడు నేను దుఃఖంతో కుంగిపోతున్నాను నాపేది ప్రాణాలు తీయసాగింది ' అతనెవరు ? ' అని

"ఇది రోగం కొంప వేలమంది వస్తారు నీకెందుకు ? ' అని కసిరాను

రాత్రి అంతా వేదన ఉదయం లక్నో వెళ్ళడానికి తయారైనాను బాడుగ బండి చేసుకొని వెళ్ళిపోయాను

# 19

లక్నో వచ్చి ఖానమ్ ఇంట్లో దిగాను అదే చోటు అదే గది మనుషులూ వారే పూర్వం వచ్చేవాళ్ళలో కొందరు కలకత్తా వెళ్ళిపోయారు నగరంలో క్రొత్త ఏర్పాట్లు జరుగుతున్నాయి రోడ్లు వెడల్పు అవుతున్నాయి గొందుల్లో దాళ్ళు పడుస్తున్నారు మురికి కాలువలు శుభ్రం చేయబడుతున్నాయి చూస్తూ చూస్తుండగానే లక్నో మారిపోయింది

మూడు నాలుగు నెలలు ఖానమ్ ఇంట్లో ఉన్నాను తరవాత వేరు ఇల్లు తీసుకున్నాను కాలంతోపాటు ఖానమ్ మారింది ఆమెలో ఒక రకపు నిర్లక్ష్యం వచ్చేసింది. ఆమెనుండి విడిపోయాక వేళ్ళల సంగతి అలా ఉండగా ఆమెదగ్గర ఉన్నవారి విషయంలోనూ అట్టే పట్టించుకోవటం

లేదు. నేను విడిగా ఉండడమూ ఆమె అట్టే పట్టించుకోలేదు. రెండు, మూడు రోజులకు ఒకసారి వెళ్ళి సలామ్‌చేసి వచ్చేదాన్ని. ఆ కాలంలోనే నవాబ్ మహమూదలీఖాన్‌గారితో పరిచయం ఏర్పడింది. మొదలు మొదలు వచ్చిపోతుండేవారు. తరవాత కొలువుంచుకున్నారు. ఆతరవాత కట్టుబాట్లో ఉంచాలనుకున్నారు. లక్నోలో ఉండి పాతపరిచయస్తులను వదులుకోవడం నాకు ఇష్టంలేకపోయింది. నవాబు స్వభావం చూసి కొలువు వది లేస్తానన్నాను. నన్ను "నికా" కట్టుకున్నానని నవాబుగారు కోర్టులో కేసుపెట్టారు. వింత చిక్కుల్లో చిక్కుకున్నాను. కోర్టు ఖర్చులకు వేల రూపాయిలు వదిలాయి. మొదటి కోర్టులో తీర్పు నవాబుపక్షం అయింది. దాగిఉండాల్సివచ్చింది. చాలాకాలం చాటుమాటుగా తిరిగాను. వకీలుద్వారా అప్పీలు చేశాను. అప్పీలులో నవాబుగారు ఓడిపోయారు. హైకోర్టుకు అప్పీలు చేశారు. అక్కడా ఓడిపోయారు. అప్పుడు చంపుతాననీ, చీరు తాననీ, ముక్కు కోస్తాననీ బెదిరింపులు సాగించారు. పది, పన్నెండు మంది దుర్మార్గులవాళ్ళను కొలువుపెట్టుకోవాల్సివచ్చింది. ఎక్కడికి వెళ్ళినా వెంట మనుషులు. ప్రాణం కొసకు వచ్చింది. క్రిమినల్ కోర్టులో కేసుపెట్టాను. నవాబు దౌర్జన్యాన్నిగురించి సాక్షులతో రుజువు చేయించాను. కోర్టువారు నవాబుగారిని ధరావత్తు కోరారు. అప్పుడు విముక్తి కలిగింది. ఆరు సంవత్సరాలు కేసుల్లో తిరిగాను. ఆ పీడ అల్లా అనుగ్రహంవల్ల విరగడైంది.

కేసు నడుస్తూఉండిన రోజులలో అక్బరలీఖాను నా తరఫు పైరోకారు. ఇతరులపక్షాన పనిచేయడం వాగివృత్తి. ఆపదలు తెచ్చిపెట్టడంలో మొనగాడు. కోర్టు పనులలో నిపుణుడు. మోసగించడంలో పండితుడు. బూటకపు కేసులు బనాయించడంలో మేటి. కోర్టులో తప్పుడు సాక్ష్యాలు ఇప్పించడంలో ఘనుడు. కోర్టు పనులలో నాకు వారివల్ల చాల సహాయం లభించింది. అతను లేకుంటే నవాబు నన్ను ముంచేవాడు. నవాబు నన్ను నికా కట్టుకోలేదనేది వాస్తవం అయినప్పటికీ, కోర్టులలో నిజమైన విషయాలకుగూడ అబద్ధపు సాక్ష్యం సృష్టించాల్సిఉంటుంది. వేసింది పచ్చి బూటకపు కేసు. అయినా అబద్ధపు కేసనుకోవడానికి ఏమాత్రం అవకాశం లేకుండా తయారుచేయబడింది. నికాను రుజువుపరచడానికి ఇద్దరు మౌల్వీలు సాక్ష్యం ఇచ్చారు. వారి నొసట నమాజు మచ్చలు. తలలకు మౌల్వీల కుళ్ళాలు, చేతులలో జపమాలలు, మాటకు అల్లా స్మరణ. కోర్టువారు శంకించడానికి ఏమాత్రం వీలులేదు. వారిలో ఒకరు నికా చదివించినవారు. రెండవవారు నికాకు సాక్షులు. కాని నిజం నిజమే. క్రాసుపరీ

క్షలో తేలిపోయింది. వీరి సాక్ష్యంతోనే అప్పులులో ఓడిపోయారు నవాబు. క్రిమినల్ కేసు సాక్షులంతా అక్బరలీఖాను తయారుచేసినవారు. ఏదన్నా తప్పులేదు.

అక్బరలీఖాను నాదగ్గరికి చాలకాలంవరకు వచ్చిపోతుండేవారు. వారి స్నేహం నిస్వార్థం అయింది. నాదగ్గరినుంచి ఒక దమ్మిడీ తీసుకోలేదు. వారి వల్ల చాల కర్చైంది. వారికి నామీద ఒకరకపు ప్రేమవుండేది. నా అనుభవం ఏమంటే చెడ్డవారు అన్నం చెడ్డవారు కారు. ఎవరికో ఒకరికి మంచివారుగా ఉంటారు. పూర్వకాలపు దొంగల విషయం మీరు వినే ఉంటారు. స్నేహం చేస్తే స్నేహానికి కట్టుబడిఉండేవారు. మంచిది అనేది లేని జీవితం ఉండటం దుర్లభం. అందరికీ చెడుఅయినవాడు సహితం ఎవరినో ఒకరిని తనవారిని చేసుకుంటాడు. కేసు నడుస్తున్నంత కాలం నవాబు ఏ కొత్తవ్యక్తినీ రానివ్వలేదు. ఆ వచ్చేవాడు నవాబుకు హాని కలిగించేవాడు కావచ్చు. లేక నాకు నష్టం కలిగించినా కలిగించవచ్చు. అక్బరలీఖాను కోర్టునుంచి ఇక్కడికే వచ్చేవారు. నమాజు ఇక్కడే చేసేవారు. ఇంటినుంచి భోజనం వచ్చేది. ఇంటినుంచి భోజనం తెప్పించుకోవాల్సిన అవసరం ఏమని ఎన్నోసార్లు అన్నాను. వారు వినలేదు. చివరకు విసిగి ఊరుకున్నాను. మా ఇంటిభోజనం నిషిద్ధమని కాదు. నేనూ వారితోనే భోజనం చేసేదాన్ని. ఆ కాలంలోనే నియమంగా నమాజు చేయడం నేర్చుకున్నాను. అక్బరలీఖానుకు దానధర్మాలంటే ఎంతో ఇష్టం. రమ్జాన్, మొహర్రం నెలలలో ఎన్నో సత్కార్యాలు చేసేవారు. సంవత్సరం పొడుగునా చేసిన పాపాలు కడుక్కునేవారు. అది తప్పో ఒప్పో గాని వారి విశ్వాసం అది.

రుస్వా: ఇది ధర్మానికి సంబంధించిన విషయం. కాబట్టి నేననేదేమంటే అలాంటి విశ్వాసం తప్పు.

ఉమ్రావ్: నా నిశ్చితమూ అదే.

రుస్వా: బుద్ధిమంతులు రెండురకాల పాపాలు చేస్తారు. ఒకటి తమకు హాని కలిగించేది. రెండవది ఇతరులకు హాని కలిగించేది. నా అభిప్రాయం ప్రకారం మొదటిది స్వల్పమైంది. రెండవది ఘోరమైంది. రెండవదాన్ని నష్టపడినవారు మాత్రమే క్షమించగలరు. మీరు ఖాజాహాఫిజ్ పద్యం వినలేదా ?

మైఖుద్ మునహాఫ్ బనోజ్ ఆతిష్ అందర్ కాబజన్
సాకిన్ బుత్ ఖానా బాష్ వ మర్దుమ్ ఆజారీ మకున్

త్రాగు మధువు, కాల్చు ఖురాను
కూల్చు మక్కాను, పూజించు ప్రతిమల
హింసించకు మనిషిని మాత్రం

ఉమ్రావ్‌జాన్ : మనిషిని హింసించడం మహాపాతకం. దానికి పరిహారం లేదు. అది ఉంటే దైవం ఉంటే లేనట్లే లెక్క.

నేను : నేను ఎన్నో పాపాలు చేశాను. అయినా అవంటే వణికిపోతాను.

రుస్వా : మీరు చాలమందిని హింసించిఉంటారు.

నేను : అది మా వృత్తి. దాంతోనే లక్షలు ఆర్జించాను. వేలు పోగొట్టుకున్నాను.

రుస్వా : దానికి శిక్ష ఉండదా మరి !

నేను : శిక్ష ఉండకూడదు. మేము చేసిన మానసహింసలో ఒకరకపు ఆనందం ఉంది. ఆనందమే అందుకు పరిహారం.

రుస్వా : బాగా చెప్పారు.

నేను : ఒక మహాశయుడు విందులోనో, వినోదంలోనో మమ్మ చూచాడనుకోండి. మాకోసం పడిచస్తాడు. దగ్గర దమ్మిడీ ఉండదు. వెలలేక వెలయాలు దొరకదు. ఆతని మనసు బాధపడుతుంది. హింస పడ్తాడు. అందులో మా నేరం ఏముంది ? మరొక వ్యక్తి మాదగ్గరకు రావాలనుకుంటాడు. డబ్బుకూడా తెస్తాడు. కాని మేము మరొకరికి కట్టుబడిఉంటాం. అతనిని మన్నించలేము. అది మా ఇష్టం. వారికోసం చస్తామా ? మా ఖర్మానికి కొందరు వస్తారు. తమను ప్రేమించమంటారు. మేము ఇష్టపడం. ఇదేం వారి జాగీరా ! దాంతో వారికి బాధ కలుగుతుంది. ఇందులో మేము చేసిన పాపమేం ?

రుస్వా : అలాంటివారిని తుపాకితో కాల్చేయ్యాలి. నన్ను మాత్రం వారిలో లెక్కకట్టకండేం !

నేను : ఎందుకలా అంటారు ? మీరు విలాసప్రియులు. మీకు ఒకరిమీద

గాని ఒకరికి మీమీదగాని ప్రేమలేదు మీరు అందరినీ ప్రేమిస్తారు అందరూ మిమ్మల్ని ప్రేమిస్తారు

రుస్వా ఏమేమి? ఒకటే అవును ఒకటి కాదు ఇదెలా సాధ్యం?

నేను నేను తర్కం ఎక్కువగా చదువలేదు కాని సాధ్యమే ఒకే మాట రెండుతీర్లుగా ఉంటుంది ఒక ప్రేమ తెలివి గలది ఒకటి తెలివిలేనిది

రుస్వా ఉదాహరణకు

నేను మొదటిది మీరు నన్ను ప్రేమించడం మేము మిమ్మ

రుస్వా సరే మా ప్రేమ మా హృదయానికి తెలుసు మీరు ప్రేమించడం తమ అంగీకారంతో తెలిసింది రెండవదానికి ఉదాహరణ?

నేను నన్ను కోరకుండే నా చెరుపైనా కోరుకొందుగా రెండవదానికి ఉదాహరణ భగవత్ప్రార్థన

రుస్వా అది సరియైన ఉదాహరణ కాదు మరేదైనా చెప్పండి

నేను మంచిది మజ్నూ లైలాను ప్రేమించినట్లు

రుస్వా ఎంత పాతపురాణం వెతికితెచ్చారు

నేను కాకుంటే పకీర్

రుస్వా (మాటకు అడ్డువచ్చి) క్షమించండి ఆరోక ఉదాహరణ! ఒక పద్యం గుర్తుకు వచ్చింది వినండి

నిన్ను వలచి వెంటతెచ్చుకొంటి విపదా!
నిను వలచి చచ్చిరని ఎరిగికూడ బుద్ధిలేదు మాకు।

నేను. ఆఁ కలకత్తా విషయమా?

రుస్వా। లోకం ఎక్కడపోలేదు మీరు అక్బరలీఖాను ఇంట్లో తిష్టవేశారని విన్నామే?

నేను. చెప్పేది వినండి మొదట కోర్టులో నవాబుగారు గెలిచారా? అప్పుడు నేను రహస్యంగా ఉండాల్సివచ్చింది ఆ రోజుల్లోనే

అక్బరలీఖాను నన్ను వారి ఇంటికి తీసికెళ్ళారు. చాల సంవత్స రాలు అక్కడే ఉండాల్సివచ్చింది. అప్పుడు నేను అక్బరలీఖాను ఇంట్లో ఉండిపోయానని అపార్థం చేసుకున్నవారు ముగ్గురు. ఒకరు అక్బరలీఖాను. రెండవది వారి భార్య. మూడవవారి పేరు చెప్పను.

రుస్వా : నేను చెప్పనా? గోహర్‌మిర్జా.

నేను : కాదు.

రుస్వా : ఇంకెవరు? చెప్పండి.

నేను : మీరు చెప్పండి. ఈ జిత్తులు మాదగ్గర సాగవు.

రుస్వా : జిత్తులా? అయితే నేనొక కాగితం ముక్కమీద వ్రాసిఉంచు తాను. తరవాత మీరు చెప్పండి.

నేను : బాగుంది.

రుస్వా : రాసిపెట్టాను. చెప్పండి.

నేను : మూడవదాన్ని నేను.

రుస్వా : మీ పేరే వ్రాశాను. చూడండి.

నేను : వాహ్ మిర్జాసాహెబ్! సరిగ్గా కనిపెట్టారు.

రుస్వా : మీ దయ. ఆఁ అయితే ఏం జరిగింది?

నేను : ఏం జరుగుతుంది? వినండి.

ముందు వారు నన్ను ఒక చిన్న ఇంట్లో ఉంచారు. ఆ ఇల్లు వారి ఇంటికి కలిసిఉన్నది. మధ్యన దిడ్డి ఉంది. పెరడు, మట్టిల్లు. చిన్న గది. అందులో రెండు పొయ్యిలు. ఇదే వంట గది, పడక గది వగైరా గదు లన్నీని. ఈ ఇంట్లోకి అక్బరలీఖానుకు దగ్గరిమిత్రులు రావాలనుకునే వారు. వారిలో ఒకడు పల్లెదొర అఫ్జల్‌హుసేను. రావడం రావడమే "క్రొత్తలా" అని మొదలుపెట్టారు. బిడియం లేదు. ఒట్టి అల్పత్వం. వచ్చినప్పట్నుంచి ఆకులా. ఆకులు ప్రాణంతీసేవాడు.

ఒకటి రెండు రోజులా? ఎంతకని, విసిగి పాన్‌దాన్ ముందుకు నెట్టాను. నేను వదిలించుకున్నాను. కాతల పొమ్ములా ఆక్రమించు

కున్నారు. చూసేవాళ్ళకు అసహ్యం కలిగేటట్లు పాన్ తినేవారు. మన్నపు తబ్బాంలోనూ కాదు తబ్బాంలోనూ వేళ్ళుపెట్టి నాకేవారు. నేను వక్కలు, యాలుకులమీదనే గడపసాగాను. తుదకా మహాశయుడు వాటినికూడా వదల్లేదు. మరొక వ్యక్తి వాజిదలీ అనేవారు తరచు వస్తుండేవారు. వారికి అక్బరలీఖానుతో బంధుత్వం ఉన్నట్లుంది. ఇప్పుడు జ్ఞాపకంలేదు. వెర్రి హాస్యం చేసేవారు. హద్దుపద్దూ లేకుండా.

ఈ ఇద్దరేకాక ఇంకా అనేకమంది అక్బరలీఖాను మిత్రులు ఉండే వారు. వారు రాత్రింబవళ్ళు చట్టాలతో సతమతం అవుతుండేవారు. అంతా కోర్టుపనులే. అక్బరలీఖాను వెళ్ళిపోయినపుడు మనసుకు కాస్త శాంతి లభించేది.

కొద్దిరోజుల్లోనే ఆ ఇల్లంటే ప్రాణం విసిగిపోయింది. మరొక ఇంటికి మారుదామనుకుంటుండగానే ఒకరోజు అకస్మాత్తుగా అక్బరలీఖాను ఏదో కేసుమీద ఫైజాబాదు వెళ్ళిపోయారు. అఫ్జల్ హుసేన్ తన ఊరికి వెళ్లారు. ఇంట్లో ఎవరూ లేరు. తలుపు వేసుకొని కూర్చొని ఉన్నాను. అక్బరలీఖాను ఇంట్లోకి ఉన్న దిడ్డి తెరచుకుంది. అక్బరలీఖాను భార్య గదిలోకి వచ్చింది. ఇష్టం అయినా కాకున్నా సలాము చేయాల్సివచ్చింది. చాలసేపు మంచందగ్గర నుంచున్నారు. కూర్చోండి అన్నాను. కూర్చున్నారు.

నేను పేదదానిమీద దయ కలిగింది. ఎటు వచ్చారు?

ఆమె మీకు బాధగా ఉంటే వెళ్ళిపోతాను.

నేను ఇది మీ ఇల్లు. ఆజ్ఞాపించాల్సింది మీరు.

ఆమె ఎందుకలా అంటారు? ఈ ఇల్లు నాదెంతో మీదీ అంతే. వాస్త వానికి ఇది నాదీకాదు. మీదీకాదు. ఇల్లుగలవారిది.

నేను అల్లా మీ ఇంటివారిని అనుగ్రహించాలి. ఈ ఇల్లు మీదీ, వారిదీను.

ఆమె ఎంతరిగా కూర్చొనిఉంటారు. మేమూ మనుషులమే. ఇంట్లోకి రాకూడదూ? ఓహో! వారి ఆజ్ఞ కాలేదేమో?

నేను వారి ఆజ్ఞకు బద్ధురాలినేమీ కాను. కావలసింది మీ అనుమతి. అది లభించింది. తప్పక వస్తాను.

ఆమె    అయితే వదండి

నేను    నడవండి

ఇంట్లోకి వెళ్ళి చూచాను అల్లా అన్నీ ఇచ్చాడు ఇత్తడి గిన్నెలు. రాగిపాత్రలు ప్లేట్లు చెంబులు నవారు మంచాలు బల్లపీటలు అన్నీ ఉన్నాయి దేనికీ కొరతలేదు. అక్కడక్కడా చెత్త పడిఉంది ఎదురుగా వంటింట్లో అమీరన్ వంటచేస్తూంది ఈగలు ముసురుతున్నాయి బల్ల పీటలమీద చెత్త పడిఉంది అమ్మగారి మంచంనిండా మణుగులకొద్ది దుమ్ము అమీరన్ పాన్‌దాన్ తెచ్చి వారి ముందుంచింది దానినిండా సున్నంకాచు మరకలే నాకు అసహ్యమనిపించింది

ఆమె తాంబూలం చుట్టి ఇచ్చింది వేళ్ళసందున పెట్టుకొని మాటలు సాగించాను ఈలోగా ఆ వీధి ముసలిది ఒకతె వచ్చింది చేతితో నేల తుడిచి కూర్చుంది నావైపు సంజ్ఞచేసి ఎవరు? అని భార్య నడిగింది.

భార్య    ఏం చెప్పాలి?

నేను    మాట్లాడలేదు

ముసలిది    (అక్బరలీఖాను భార్యతో) అయ్యో! నాకు తెలియదను కున్నావా?' అన్నది

నేను    తెలుస్తే అడగడం దేనికి?

ముసలిది    నీతో మాట్లాడనమ్మా! నేనెరిగింది బేగమేను నీతో మాట్లాడ గలనే! నువ్వు పెద్దమనిషివి.

భార్య    ఏయ్ ముసలిదానా! కొత్త మాటలకు పౌరకముష్టైనావు

ముసలిది    ఎగదాన్ని అయినట్లు మాట దాస్తావేం? నేనేమన్నానని ఈమెను బుస్సుమంటుంది నామీద

భార్య    అప్పుడెవ్వా నువ్వేమీ అనలేదు సరేనా? ఈ ఇల్లు జాగీరా నీకు?

ముసలిది    నా జాగీరెందుకు అవుతుందమ్మా కొత్తకొత్తవాళ్ళు వస్తు న్నారు వాళ్ళ జాగీరుగాని

ముసలిదాని మాట విని నాకు నవ్వు వచ్చింది ముఖం తిప్పి నవ్వు కున్నాను

భార్య — నీ జాగీరుకాకేం? నువ్వు నా సవతివికావూ? (నావైపు చూచి) ఇదిగో వినండి ఈమె ఖానుగారి మొదటిపెళ్ళాం నా సవతి నేను తరవాత వచ్చిందాన్ని

ముసలిది — నాకు సవతి ఎవ్వరే? ఇదిగో ఇలాంటి మాటలు మంచివి కావు ముఖం ముందే తిట్టున్నావు రోగంముండల సావాసంలో ఇంతకంటే ఏం నేర్చుకుంటావులే అన్నాళ్ళైంది వచ్చి పెద్ద బేగం గారు (అక్బరలీఖాను తల్లి) పల్లెత్తుమాట అనలేదు చిన్న దొరసాని వాడలోఉన్న ముసలివాళ్ళందరినీ తిట్టిపోస్తూంది

భార్య — (కోపంతో) ఇదిగో చెపుతున్నా లత్తన్‌తల్లీ! నువ్వు నాదగ్గరకు రావద్దు వెళ్ళి ఆ పెద్దబేగమ్‌దగ్గరే కూర్చో

నాకూ ఎంతో కోపం వచ్చింది గయ్యాళి ఆడది దీంతో ఎవరు పెట్టుకుంటారు అని నిగ్రహించుకున్నాను

ముసలిది — ఏమి? నీ సొమ్మేమైనా పోతుందా?

భార్య — ఏం పోయేకాలం వచ్చిందే అలా వాగుతున్నావు?

ముసలిది: వాగకేం? నీ చేతికింద పడిఉన్నానా? నువ్వేమన్నా పెట్టే దానివా? పోసేదానివా? ఏదో పొద్దుపుచ్చుకోవడానికి వస్తుంటా. ఇక రానులే

భార్య — అసలు రావద్దు

ముసలిది — అలాగా! రావద్దేం? ఏం ఎందుకు రాను! తప్పక వస్తాను. చూస్తా ఏం చేస్తావో

భార్య — వస్తే చెప్పుదెబ్బలు తింటావు నెత్తి వెంట్రుకలు రాల్తాయి

ముసలిది — ఓహో హో! ఏమి అధికారం దొరసానిది చెప్పుదెబ్బలు కొడుతుందట! పాపం!

భార్య — లే ఇక్కణ్ణుంచి లేచిపో పోతావా! చెప్పించుకోవాలా?

ముసలిది — (తిట్టవేసుకొని కూర్చుంది) ఇవ్వాళ చెప్పుదెబ్బలు తినే వేళకా గొప్పఅయ్యకూతురువు కదూ!

బేగమ్ జరిగిందేమిటి?

ముసలిది ఈమె ఎవరు అని అడిగాను. ఏం పాపం చేశాను?

భార్య నాకు తెలుసునని కదా చెప్పింది పెళ్ళి అయినగానికి -

ముసలిది ఎందుకూ? ఎందుకో చూస్తూఉంటే పగ తీర్చుకోలేకపోతానా? చెప్పుచెప్పుతో కొట్టావు కదూ? చూస్తా

బేగమ్ ఏదొప్పులే పగ తీర్చుకుంటావు. మరిచిపోలేకేం

ముసలిది నిన్నేం అనను. నీ ఇష్టం వచ్చినట్లు అను. నీకు హక్కుంది

బేగమ్ నీ హక్కూ నువ్వూ నడువ్ అక్కణ్ణుంచి

ముసలిది చూడవమ్మా ఈమెగారా గెంటుతోంది. మంచిది వెళ్తాను" అని లంగా దులుపుకొని 'వెళ్ళకొట్టేది వచ్చింది పెద్ద వెళ్తున్నా వెళ్తున్నా చూస్తా ఎలా దానివ్వరో' అంటూ వెళ్ళిపోయింది

బేగమ్ (కోడలుతో) ఏమిటీ ఆ వెధవముండతో నీకు?

భార్య అత్తగారూ! మీతోడు నేనేమీ అనలేదు వచ్చింది పాపం ఈమెను వంద మాటలన్నది

నా ప్రస్తావన రాగానే బేగమ్ ముఖం చిట్లించింది. ముసలిది పిచ్చిదని తెలిసింది కాబట్టి దానిమాటలు అట్టే బాధించలేదు. బేగమ్ చిట్లింపుతో మనసు చివుక్కుమంది. లేచి దిడ్డిలోంచి ఇంట్లోకి వచ్చి కూర్చున్నాను

బేగమ్ (నేను వచ్చేసిన తరవాత కోడలుతో) ఏం పిల్లా! అనవసరంగా ఆ ముసలిముండను వాదేశావు—అదీ ఒక బజారుముండకోసం. నీకు దానితో నేంపని?

అమీరన్ దాని నోరే అంత. నోరు పారేసుకుంది. శత అనుభవించింది. కాని ఉంపుడుకత్తెతో—అదీ మొగుడు ఉంచుకున్నదానితో సహవాసం ఏమిటమ్మా! వారే తీసుకొనివచ్చి నెత్తిని కూర్చోపెట్టే మొత్తుకు నేదానిని? నువ్వే వెళ్ళి తీసుకొస్తావేటమ్మా.

బేగమ్ వాటికి గుండెలున్నాయా ఇంట్లో పెట్టడానికి—ఇల్లాలు నేనుండగా పగాళ్ళ ఇష్టం బయటనే ఇంట్లో ఆ పప్పులేమీ ఉడ

కప్ప. మావారికి చాలకాలం ఒక బంధకత్తెతో ఆతుకుండేది. వారు ఎన్నివిధాల బ్రతిమిలాడారు! నేను ససేమిరా కాదన్నాను. ఒక్కసారి అడుగుపెట్టనివ్వాసనుకో. ఇంట్లోనే తెచ్చిపెత్తే? గుండెమీద పేలాలు వేగుతాయి. తన మగడు తనచేతిలో ఉండాలి. ఈకాలపు పిల్లలు, ఏమోనమ్మా ఏదీ గ్రహించలేరు.

అమీరన్ : నిజం చెప్పారు. అసలు ఈ బజారుముండలకు సంసారులతో నేంపని? పెద్దలన్నారు మగవాణ్ణి ఇంటికి పిలువడం మేలుగాని చెడిపోయిన ఆడదాన్ని పిలువరాదని.

బేగమ్ : పెద్దలు ఊరికే చెప్పారా? మగవాడేం వచ్చి ఆడాళ్లల్లో కూర్చుంటాడా? మొన్నటి మాట. కల్లోలం జరిగిందా? హుసేన్‌ఖాను వచ్చి మా ఇంట్లో దాగిఉన్నాడు. ఉండడం ఒక్క ఇంట్లోనేఅయినా కొంగుసైతం చూచే గుండె లేకపోయింది. విన్నావా? రోజుల తరబడి ఇంట్లోనే కూర్చున్నాను. కదలలేదంటే నమ్ము. పని వాళ్ళతో సంజ్ఞలు చేసి పనులు చేయించేదాన్ని.

అమీరన్ : నువ్వు గొప్పవారింటి కోడలువు. ఇలాంటివాళ్ళతో స్నేహం చేస్తే ఎలా చెప్పు? కాచులో నుస్నంలో చేతులు పెడుతుంది. నీవు చూడనపుడు బిందెలో నీళ్ళు త్రాగేస్తుంది. వీళ్ళది ఏం నమ్మకం! ఎంతకైనా తెగిస్తారు. వీళ్ళ నీడకుసైతం దూరంగా ఉండాలమ్మా!

బేగమ్ : ఏం చెప్పగలం ఏంచేస్తారో చెడిపోయిన ముండలు. మందూ మాకు పెట్టినా పెట్టవచ్చు. మిర్జా మహమ్మదలీ కోడలుకు సవతి తెలగ తినిపించింది. పాపం మగనికికాకుండా, పిల్లలకుకాకుండా పోయింది లోకం విడిచి.

అమీరన్ : నాకేం తెలియదా?

బేగమ్ : ఎప్పుడూ వీళ్ళతో దూరంగా ఉండాలమ్మా! దూరంగా ఉన్నా ఒక్కొక్కసారి ప్రాణాలమీదికి తెస్తారు. ఆ దాసీది ఏం చేయలేదని? తా మెత్తులు, చెట్లు ఏమేమి కనిపించేవి నా దిండుకింద!

అమీరన్ : మరి దాన్ని ఇంట్లో కెందుకు రానిచ్చారు?

బేగమ్ : అయ్యో కర్మ! నేను రానిచ్చానా? దాపీది ఇలా చేస్తుందని నేనేం కలగన్నానా? మావారిని వలలో వేసిందని తెలియగానే వెళ్ళగొట్టాను.

అమీరన్ బేగమ్ సాహెబా! ఉన్నమాటంటే కోపం రాకూడదు. ఆ దాపీది పాపం మీకెంత సేవచేసింది!

బేగమ్ బాగానే ఉంది అయితే నా మొగుణ్ణి ఎలలో పేసుకోవాలని ఉందా? అంతదాకా ఎందుకూ? ఈ ముసలిదేం తక్కువ తిన్నదా? ఇదీ మావారితో ఆడిందే

అమీరన్ (పెద్దగా నవ్వి) అంతా పట్టేది

బేగమ్ అబద్ధాలనుకున్నావా? అందుకే పగతీర్చుకుంటానంటూంది

అమీరన్ కోడలుగారూ! అయితే మీరలా చేయకుండాల్సింది మామ గారి ఉంపుడుకత్తెకు చెప్పడెల్ప

బేగమ్ ఈకాలం, పిల్లలకు అంత విచక్షణా! నిజం చెప్తున్నాను నేను సహించలేకపోయాను ముఖం ముందే అంటున్నాను ఈ రోజు ఆ భోగందానిమూలాన మామగారి ఉంపుడుకత్తెను తిన్నింది రేపు అత్తనే తంతుంది

అమీరన్ కాదు ఎందుకు అవుతుంది గానీ—అయినా అనిపిస్తుంది

ఆ ఇద్దరు ముసలివాళ్ళ పాపం కోడల్ని పరామర్శం చేశారు ఆమె పెద్దగా ఏడ్పుసాగించింది నా స్థితి ఆదశక్కుండో నిప్పుల్లో పారినట్టుంది అమాంతంగా ఇద్దరి ముసలివాళ్ళ గొంతులు మలిమివేయాలనిపించింది

రుస్వా అః అః అంత కోపమా?

> శాంతి సర్వదా పరమధర్మం
> కానున్న ప్రళయం తప్పదు. నిజం!

ఉమ్రావ్ కోపం రాకేం? ఒక మనిషిని అంత హీనంగా భావించడం మానవత్వ లక్షణమా!

రుస్వా నావరకు నాకు మీకు అంత కోపం రావలసిన అవసరం లేదనిపిస్తుంది ఆ ముసలివాళ్ళిద్దరు నిజం చెప్పారు అనవసరంగా అక్బర్ తల్లికి తమ్ముల పద్దాయి మీరు మంచి అనుకున్నా చెడు అను కున్నా అది వాస్తవం

ఉమ్రావ్ వాహ్ మిర్జాసాహెబ్! ఏం న్యాయం చెప్పారండీ!

రుస్వా: చిత్రం. నాకు తోచిన న్యాయం అది. ఈ విషయంలో కొంత వరకు మీ తప్పూలేదు. తప్పంతా అక్బరలీఖాను భార్యది.

ఉమ్రావ్: పాపం ఆవిడదేం తప్పు?

రుస్వా: తప్పా. తప్పున్నర! నా భార్య అలాగే చేసిఉంటే డోలీ ఎక్కించి తల్లిగారింటికి పంపేవాణ్ణి. మళ్ళీ ఆరునెలలదాకా ముఖం చూచేవాణ్ణి కాదు. సరే. ఒక్కమాట. ఈ వృత్తాంతం తెలిసిన తరవాత అక్బరలీఖాను ఏమన్నారు?

ఉమ్రావ్: లడ్డన్ తల్లిమీద అరిచారు. కేకలు వేశారు. ఆ రాక్షసిని ఇక ఇంటికి రావద్దని హెచ్చరించారు. చాలరోజులవరకు అది గడప తొక్కలేదు. పెద్ద ఖాను వచ్చినతరవాత మళ్ళీ రావటం ప్రారంభించింది. వారికి ఈ కథ తెలుస్తే అక్బరలీఖాను భార్యను కోప్పడ్డారు.

రుస్వా: ముసలివాడు తెలివి కలవాడు.

ఉమ్రావ్: తెలివా? తెల్లసుఖమా? లడ్డన్ తల్లివారి వాళ్ళ వ్యక్తేది. దాంతో ఆమె పక్షం వహించాడు. కాకున్నా పాత ప్రియురాలు కదా?

రుస్వా: సరే. మీరే గెలిచారు. ఒక్క విషయం చెప్పండి. లడ్డన్ తల్లి, వయసులో సానియా సంసారా? అమీరన్ ఎవరు?

ఉమ్రావ్: లడ్డన్ తల్లి దబ్బున్న ముండే. వయసులో చెడిపోయింది. అమీరన్ పల్లెటూరిది. దాని ఊరు సందేలాజిల్లాలో ఉంది. కొడుకు పెద్దవాడే. వాడికి పెద్ద ఖానువద్ద నౌకరి. కూతురుకు పెళ్ళిఅయి అత్తవారింటికి వెళ్ళింది.

రుస్వా: అమీరన్‌కు పెద్ద ఖానుతో ఏమీ సంబంధం లేకుండేదా?

ఉమ్రావ్: లేదు. అబద్ధం చెపుతే అల్లాకు జవాబు చెప్పాలి. అమీరన్ శీలంగల ఆడది. వయసులో సానిఅయి ఇక్కడ కొలువుకు వచ్చిందని వాడవారంతా చెప్పుకునేవారు. కాని ఇక్కడికి వచ్చినతరవాత ఆమె చెడుతోవలు పట్టింది ఎవడూ చూడలేదు.

రుస్వా: ఇప్పుడు అన్ని విషయాలూ తెలిశాయి. ఇక అడగండి. ఏమి అడుగుతారో?

ఉమ్రావ్ — అయితే కామ వ్యాజ్యంలో తీర్పు ఇవ్వడానికి కూర్చున్నా రన్నమాట

రుస్వా — అవును చాల పెద్ద వ్యాజ్యం

ఆడవాళ్ళు మూడు రకాలు శీలం గలవారు చెడిపోయినవారు బజారుకెక్కినవారు రెండవ రకంవారిలో మళ్ళీ రెండు విధాలు చాటు మాటుగా చెడుత్రోవలు పట్టినవారు బహిరంగంగా చేసేవారు చెడుపేరు రానివాళ్ళనుకూడా శీలవతులు జాతికి చేర్చవచ్చు పాపం జీవితాంతం నాలుగుగోడల చెరలో ఉండి సీతమ్మచెరలు పడుతారు బాగున్నప్పుడు అంతా బాగానే ఉంటారు చెడురోజులు వస్తే వెంటఉండేది వీళ్ళే పాపం

మగలు వయసులో ఉన్నప్పుడూ డబ్బు చేతినిండా ఉన్నప్పుడు కేళీవిలాసాలు బయటిస్త్రీలకు కాని దారిద్ర్యంలోనూ ముసలితనంలోనూ వెంటఉండేవాళ్ళు పెళ్ళాలే వాళ్ళే అన్ని కష్టాలూ పడుతారు వారికి గర్వం ఉంటేనేం? ఉండాల్సిందే అది వారి హక్కు ఆ గర్వంలోనే వారు చెడుస్త్రీలను నీచంగా చూస్తారు నీచాతినీచులని భావిస్తారు ఇలాంటివారిని దేవుడు క్షమించవచ్చుగాని వీళ్ళు క్షమించరు మరొకటేమంటే సంసారులు తరచుగా అందమైన స్వరూప స్వభావాలు కలిగి ఉంటారు అలాంటివారికి ఆనందం ఎందుకు లభించకూడదు? కాని మగ వాళ్ళు మూర్ఖులు పెళ్ళాలకంటే కురూపులూ కుస్వభావం గలవారివెంట పడతారు పెళ్లాలను కొంతకాలానికిగాని అంత కాలానికిగానీ వదిలి వేస్తారు అందువల్ల ఆ సంసారస్త్రీలకు ఏదో మందులూ, మంత్రాలూ తమ మగల బుద్ధిని మళ్ళిస్తున్నాయని అనుమానం అది నిజంకూడా నేమో। అది వాళ్ళలోని మంచితనమే ఎందుకంటే ఆ విషయంలోనూ వారు తమ భర్తలను దోషులుగా భావించరు ఆ దుష్టస్త్రీలే అందుకు కారణం అనుకుంటారు ప్రేమకు పతిభక్తికి అది పరాకాష్ట దాన్ని మించిన ఉదాహరణ లభిస్తుందా?

ఉమ్రావ్ — అంతా నిజమే ఒప్పుకుంటాను కాని ఈ మగాళ్ళకు బుద్ధి ఎందుకుండదు?

రుస్వా — మానవునికి ఆవేశం వస్తుంది ఆవేశం అతనికి ఇష్టం ఒకే రకపు జీవితం గడపలేడు ఎంత మంచి జీవితం అయినా మొహం మొత్తుతుంది ఏదో నవత, కొత్తదనం ఎంత అపవాదం చవిచూడా లనుకుంటాడు అప్పటికి బజారు ఆడవాళ్ళనుగురించి ఊహించి

ఉండదు. భోగం కొంపకు చేరుతాడు. అక్కడ ఏదో కొత్తదనం కనిపిస్తుంది. కొత్త అనుభూతి కలుగుతుంది. కొత్త ఆనందం చవిచూస్తాడు. ఆవేశం అతణ్ణి అంతటితో ఆపదు. రోజూ ఒక కొంప వెతుకుతాడు.

ఉమ్రావ్: కాని మగాళ్ళంతా అలాంటివారు కారే!

రుస్వా: అవును. అందుకు కారణం సంఘం. సమాజం. ఆచారాలు. అలవాట్లు. చట్టాలూ శాసనాలూ దాన్ని నిషేధించాయి. అలాంటి వ్యక్తిని చుట్టుపక్కాలు, బంధుమిత్రులు, ఇరుగుపొరుగువాళ్ళు హేయంగా చూస్తారు. ఆ భయంతో ధైర్యంచేయలేడు. కాని స్నేహం చెడ్డది. విలాసపురుషుల సాహచర్యం లభిస్తుంది. వింత వింత అనుభూతులనుగురించి ప్రస్తావన వస్తుంది. మనసులో కొత్త అనుభూతినిగురించిన ఆవేశం ప్రవేశిస్తుంది. ఆవేశం భయాన్ని అంతం చేస్తుంది. తొలుత సానికొంపకు వచ్చేవాడు భయంభయంగా వస్తాడనే విషయం మీకు తెలియనిదికాదు. గోప్యంగా వస్తాడు. ఒకరు చూస్తారని భయం. ఎవరైనా వింటారని భయం. మాట కూడా గట్టిగా మాట్లాడడు. కాని క్రమక్రమంగా ఆ భయం మృగ్యం అవుతుంది. క్రమంగా కొద్దిరోజుల్లో మానమర్యాదలు వదిలేస్తారు. సిగ్గు విడిచి పట్టపగలే సానికొంపలకు చేరుతారు. బండ్లలో కూర్చొని జంటగా ప్రయాణాలు చేస్తారు. చేతులు పట్టుకొని వీధుల్లోనూ, జాతరల్లోనూ తిరగడం గర్వంగా భావిస్తారు.

ఉమ్రావ్: అది నిజమే. కాని నగరాల్లో వీటిని ఏహ్యంగా భావించరే!

రుస్వా: అవును. ముఖ్యంగా ఢిల్లీ, లక్నో నగరాలలో అవి నాశనం కావడానికి కారణమే అది. పల్లెల్లో ఇలాంటి కొంచెజనం తక్కువ. యువకులకు వారి సహవాసంగాని, ప్రోత్సాహంగాని లభించవు. రెండవది అక్కడ సానికులానికి ఇంత గౌరవం లేదు. వారు దొరల, జమీందార్ల అదుపు ఆజ్ఞలలో ఉంటారు. వారి జీవికమాత్రమే కాక జీవితం సమస్తం వారి గుప్పెళ్లో ఉంటుంది. అందుకే భయపడతారు. దొరల బిడ్డలతో చాటుమాటుగా వ్యవహారం సాగిస్తారు. నగరాలలో అలా కాదు. అంతా స్వేచ్ఛ. ఎవరు ఎవని అదుపు ఆజ్ఞలలో ఉంటారు? దాని ఫలితమే ఇది.

ఉమ్రావ్: కాని పల్లెవారు చెడిపోతే చేతికిరాకుండా చెడిపోతారు.

మియాఁ ఇర్షాదలీఖాను కథ విన్నారుగా

రుస్వా కారణం ఏమంటే వారు ఈ అనుభవాలకు దూరంగా ఉంటారు ఒకసారి రుచిచూస్తే మితిమీరిపోతారు నగరాల్లోని జనం అలా కాదు వారికి అన్నీ తెలుస్తుంటాయి వారిని అవి అంతగా ఆకర్షిం చవు వారు మితిమీరరు

# 20

రుస్వా అవును ఆఁ మీ రాసేది ఏమైంది? ఏదో మంచి పేరు

ఉమ్రావ్ అబాదీ

రుస్వా అబాదీ అందమైందే ఆమెకు పన్నెండేళ్ళు ఉన్నప్పుడు చూశాను ఈ వయసుతో అందం వికసించి ఉంటుంది

ఉమ్రావ్ మిర్జాగారూ! మీకు బాగానే జ్ఞాపకం ఉందే!

రుస్వా గుర్తుండదానికేముంది? అందమైన పిల్ల నేనూ ఆ దృష్టితోనే చూసేవాణ్ణి ఎప్పుడో పడుచుపిల్ల అవుతుంది కదా అని

ఉమ్రావ్ అయితే మీరూ అందాన్ని ఆశించారన్నమాట

రుస్వా వినండి ఉమ్రావ్‌జాన్! ఎక్కడ అందమైన అమ్మాయి కనిపించినా నన్ను గుర్తుంచుకోండి సాధ్యమైతే నన్ను అభ్యర్థిగా వ్రాయిం చండి ఆయుష్యం చాలక చచ్చిపోతే నా పేర ఫాతిహా'' చదివించండి

ఉమ్రావ్ అందమైన మగాడు కనిపిస్తే?

రుస్వా తమ పేరు అభ్యర్థినుల్లోనూ, నా పేరు అతని తోవరి అభ్యర్థు ల్లోనూ విశిష్టంగా వివక్షంలో వ్రాయించండి

ఉమ్రావ్ బాగుంది కాని ఆ షరతు ఎందుకు?

రుస్వా : షరతు లేనిది దేనికి? పైగా మీ షరతులో ఏ ఒక్క వ్యక్తినీ చెప్పలేదే?

ఉమ్రావ్ : తేటతెల్లంగా ఒక్కమాట చెప్పలేరా?

రుస్వా : అర్థం తెలుసు. తాత్పర్యం ఏదిలేం అని.

ఉమ్రావ్ : అది ఇలాంటప్పుడు చెప్పవలసింది కాదు. నాకు ఒక నియమం ఉంది. శీలవతి ఏ మతానికి సంబంధించినదైనా, తల్లిగానో, సోదరిగానో భావిస్తాను. ఈ నియమానికి విరుద్ధమైన వ్యవహారాలన్నీ బాధ కలిగిస్తాయి. అలాంటి శీలవతులను చెడగొట్టడానికి ప్రయత్నించేవారందరినీ తుపాకితో కాల్చెయ్యాలని నా అభిప్రాయం. కాని ఉదారులైన స్త్రీల ఉదారత్వంతో లాభం పొందడం నేరం కాదు.

రుస్వా : సుబహానల్లా (బాగు బాగు)

ఉమ్రావ్ : ఇప్పటి వృథా మాటలు ఎందుకుగాని అసలు విషయం చెప్పండి. మిర్జాగారూ! వయసులో ఆమెను చూచివుంటే మీరీ పద్యం చదివివుండేవారు:

పరువుపరువం పొంగిపొరలి
వింత అందాలు సంతరించ,
చూచిచూచి దీక్ష సడలి
నిగ్రహ మంతరించె నోహో!

ప్రాయంలో ఆమె రూపం చూడవలసింది. వందల సొగసులలోకూడా ఒకర్వైతే అలాంటిది కనిపించడం దుర్లభం.

రుస్వా : ఎందుకలా చంపుతారు? ఇప్పుడు ఎక్కడుంది? ఏమైంది?

ఉమ్రావ్ : మసలను పడిచింది. అహం పడిచింది.

రుస్వా : ఇప్పు డెక్కడున్నట్లు?

ఉమ్రావ్ : ఆస్పత్రిలో. ఇంకెక్కడ?

రుస్వా : యువ్వనోద్రేకమేనా?

ఉమ్రావ్ : శీమాషాఅల్లా (బాగా చెప్పారు) ముఖం వికారం అయింది.

ఇప్పుడో ఇంకాసేపటికో అన్నట్లుంది.

రుస్వా: అసలు ఏమైంది?

ఉమ్రావ్: అయ్యేదేమిటి? పట్టి పోకిరిది. కుర్రాళ్ళను కూర్చుకుంది. బాగుపడాలని ఎంతో చేశాను. కాని చెడిపోయింది. దానికోసం నేను చేయనిదేమిటి? పంతులును పెట్టి చదువు చెప్పించాను. చదువుమీద శ్రద్ధలేదు. వయసు రాగానే వేరేగది ఇచ్చివుంచాను. పట్టణంలోని ఉత్తములు కూడారు. రాత్రింబవళ్లు తిట్లు, పోట్లాటలు. కేకలు. తలప్రాణం తోకకు వచ్చింది. ఆటంకం అనేది లేదు. ఎప్పుడొస్తే వాడితోనల్లా తాగేది. నచ్చచెప్పాను. దెబ్బలు కొట్టాను. వింటేనా? చిన్నతనంనుంచే దానిదృష్టి మంచిది కాదు. ఆ రోజుల్లో ఖుదాహుసేనీ మనుమడు అబ్బాస్ వస్తుండేవాడు. వాడితో ఆడేది. పిల్లవాడు పోనీ ఆడుకుంటాడులెమ్మని ఊరుకున్నాను. కాని పిచ్చి పిచ్చి పనులు కనిపించాయి. వాడి రాకపోకలు మానిపించాను. ఒక వ్యక్తి నాదగ్గరికి వస్తుండేవాడు. వాస్త విలాసప్రియుడు. అతనితో సరసాలు మొదలైనాయి. అతడు మంచి వంశస్థుడేగాని వాస్త అల్పుడు. నన్నుగురించిగాని, అతని అంతస్తునుగురించి గాని ఆలోచించలేదు. ఒకనాటి సాయంకాలం అబాదీతో మాట్లాడు తున్నాడు.

చట్టన్: నిన్ను ప్రేమిస్తున్నాను. కాని ఆబాదీ ఏం చేయను? ఉమ్రావ్ జాన్అంటే భయం.

అబాదీ: ఇదిగో ఈ మాటలు నాకు చెప్పకు. ఎందుకు భయం?

చట్టన్: (అబాదీ మెడలో చేతులు వేసి) "అబ్బ ఎంత అందంగా ఉన్నావే" అన్నాడు.

అబాదీ: ఉంటే నీకేం?

చట్టన్: (ముద్దుపెట్టుకొని) "నాకేమి? ప్రాణాలు ఎగిరిపోతున్నాయి. చస్తున్నాను" అన్నాడు.

అబాదీ: వెధవ వాగిలా ఇవ్వలేదు. చస్తారట బాబు. మహానుభావా! చాలమంది చాలాగా చూచాను. శవం ఒక్కడినీ చూడలేదు.

చట్టన్: పాపలా! ప్రాణం అర్పిస్తాను.

అబాదీ: వెధవ ప్రాణం నేనేం చేసుకోను?

చట్టన్: నా ప్రాణం అంత చవకా? ఎందుకూ పనికిరాదా?

అబాదీ: మాటలు నేర్చావు. జేబు చూడు. పావలా ఇచ్చివెళ్ళు.

చట్టన్: అబ్బ! ఇంకా అమ్మ జీతం రాలేదంటే. ఎల్లుండి తెచ్చిస్తాగా తప్పక.

అబాదీ: అయితే ప్రాణం ఇక్కడ పెట్టి దయచేయండి.

చట్టన్: ఒక్క ముద్దు.

చట్టన్ అబాదీని దగ్గరకు లాక్కున్నాడు. అబాదీ జేబులో చేయి పెట్టింది. మూడు పైసలు దొరికాయి. కాజేసింది.

చట్టన్: నామీద ఒట్టు. పైసలు తీసుకోవద్దు. అమ్మమ్మ రంగుపొట్లాలూ, వాచనా తెమ్మని ఇచ్చింది.

అబాదీ: సెతోకు. ఇవ్వను.

చట్టన్: ఏం చేస్తావు చెప్పు. ఇదిగో ఎల్లుండి పావలా తీసుకో.

అబాదీ: ఏమి? ఖాగీనా కొనుక్కుంటా.

చట్టన్: ఖాగీనా మూడు పైసలదా? ఒక్క పైస తీసుకో.

అబాదీ: మూడు పైసల ఖాగీనా ఎక్కువైపోయింది కదూ! చాలరోజుల నుంచి తినాలనిపిస్తూంది. అమ్మగారు తిననివ్వరు. కడుపు నొప్పి లేస్తూంది అంటుంది. ఒకనాడు చాటుగా అణాది కొనుక్కొని తిన్నాను. ఏమీ కాలేదు.

నేననుకున్నాను ఇది రాక్షసిగా ఉన్నట్లుందని. ఎంత కొద్దిగా తిన్నా నాకు అజీర్ణం చేస్తుంది.

ఖుస్రో: కరువులో కొన్నారా?

ఉమ్రావ్: అవును. తల్లి ఒక రూపాయికి అమ్మిపోయింది. మూడు రోజులనుంచి ఉపవాసం ఉంది. రొట్టెలు పెట్టాను. మరొక

రూపాయి ఇచ్చాను నాకు జాలి కలిగింది నాదగ్గరే ఉండిపొమ్మన్నాను ఉండలేదు వెళ్ళిపోయింది

రుస్వా వెర్రిది మళ్ళీ ఎప్పుడైనా వచ్చిందా?

ఉమ్రావ్: చాలనాళ్లు వచ్చింది కూతురును చూచి సంతోషపడింది ఎన్నో దీవించింది ఏటా ఒకటి రెండుసార్లు వచ్చేది ఏదో నాకు తోచింది ఇచ్చేదాన్ని ఇప్పుడు చాల సంవత్సరాలైంది రాక పాపం ఉన్నదో! పోయిందో?

రుస్వా కులం?

ఉమ్రావ్ పోయింది

రుస్వా ఆ కథ సగంలోనే నిలిచిపోయింది దట్టన్ పావలా ఇచ్చాడా? ఇవ్వలేదా?

ఉమ్రావ్ దరిద్రుడు పావలా దట్టన్ వెళ్ళిపోగానే దాన్ని నా దాదాను పైసలా లాక్కొని వీధిలో పారేశాను

నా గదికి ఎదురుగా చిన్న గది ఉండేది ఏదో నెలకు రెండు రూపాయల అద్దె ఉండచ్చు అందులో ఒక సానిది దిగింది హుస్నా అప్పటికి వయసులో ఉండింది అనాటికి దానితో స్నేహం నగలంతా అక్కడే ఉండేది అనాటికి దాని లక్షణాలన్నీ అలపడ్డాయి దానికి తగిన విటులు ఒకడు పావుశేరు మాసెఫ్రూటీలు తెచ్చేవాడు మరొకడు పేదాకు వందఇచ్చే మామిడిపండ్లు యాభై తెచ్చేవాడు ఒకణ్ణి రెండు గజాల చీటి బట్ట ఇంకొకడివి మట్టిల ఘాట్లు అడిగేది తిరునాళ్ళలో, జాతరలలో సభాగురు వెంట పెద్ద తలగుడ్డలవాడు గంజిపట్టిన చొక్కాలు లేక అంగరఖాలు తొడిగి ఒకడు ధోవతి ఒకడు పైజామాలవాళ్ళు చేతుల్లో లాఠీలు మెడలో హారాలు వారివెంట హుస్నా టిక్కుటిక్కుమని నడుస్తూంది హసన్‌వాలావరా (సత్రం) లో ఒక తర్రా (కావుసారాయి) బుడ్డి ఖాళీ అక్కణ్ణుంది నోటుతూ తూలుతూ, పడుతూ లేస్తూ ఆడుతూ పాడుతూ హుస్నా కాస్సేపు వీని కౌగిలిలో కాస్సేపు ఒకని మెడలో చేతుల వేస్తుంది దారివెంట తిట్లూ పట్లూ, గిల్లుకోవడం గిచ్చుకోవడం కొట్టుకోవడం, పట్టుకోవడం ఈ దశలో ఒకరో ఇద్దరో తోపులో పడిపోయారు తిరణాలకు చేరింది ముగ్గురో ఎనుగురో అక్కడిక చరపమీద వచ్చారు వారిలో తెలివైనవారు హుస్నాను పట్టుకున్నారు మిత్రులకు మట్టి చూపిం

వాడు తాను హుస్నా గదికి వెళ్ళేవాడు. తిరనాళనుంచి తిరిగివచ్చి ఆమె గదిముందు గడబిడ కేకలు అరుపులు రాళ్ళు విసరడం. హుస్నా గదిలో ఉండనేలేదు అన్నా వలకదు. ఇంతలో తుపాకి బంటు అక్కడికి వచ్చాడు. గుంపును చెదరగొట్టాడు. ఎక్కడివా రక్కడికి వెళ్ళిపోయారు.

అలాంటివంటే ఆబాదీకి ఇష్టం. నేను సహించగలనా? నాదగ్గరకు వచ్చే ఒక నవాబు నౌకరు హుసేనలీతో లేచిపోయింది. హుసేనలీ దాని చేతి తొంగరం అయిపోయాడు. హుసేనలీ కొంపకు చేరింది. పెళ్ళాం పెద్ద గొడవచేసింది. ఇల్లు విడిచి వెళ్ళిపోయింది. మియాఁ హుసేనలీకి నిశ్చయమేం? కలిగింది ఇద్దరిది వంటపర్ధ. ఆబాదీ దొరసానికి హొయ్యిలో నిప్పువేయడమే చాతకాదు. ఎట్లాగో అట్లా కొన్నిరోజులు దొర్లాయి. ఒక పిల్లవాడు పుట్టాడు. ఆ బిడ్డ హుసేనలీకే పుట్టాడో, ఇంకెవరికి పుట్టాడో దేవునికే తెలియాలి. రెండు నెలలతరవాత పిల్లవాడు పోయాడు. అటు హుసేనలీ పెళ్ళాం తిండికి బట్టకూ వ్యాజ్యం వేసింది. నెలకు రూపాయిన్నర ఇవ్వాలని డిక్రీ అయింది. నవాబుగారు మూడు రూపాయిలు ఇచ్చేవారు. రూపాయిన్నరలో ఎలా గడుస్తుంది? పై ఆదాయం మీద వెళ్ళేది. అదీ చాల్లేదు. ఆబాదీ అలికిమిండ. చివరకు హుసేనలీ ఇల్లు వదిలి ఆ వీధికోని ఒక కుర్రానితో లేచిపోయింది. ఆ కుర్రాని తల్లి పఠానీ[1]—కుంటెనకత్తె. అక్కుఅమారి. మరో నలుగురు ముండలు ఉండే చోట ఈమెనుకూడా చేర్చింది. అక్కడే మకాం అయిపోయింది. పఠానీ ఆదాయం కాస్త పెరిగింది. కుర్రాడు పేరుకు నిలిచిపోయాడు. మియాఁ సాదత్ పఠానీ కంట్లో దుమ్ముకొట్టి లేవదీసుకుపోయాడు. తల్లిదగ్గర పెట్టాడు. అవిడకు కోళ్ళంటే సరదా. వాళ్ళ ఇంటిపక్కనే తకియా[2] ఉండేది. కోళ్ళు అక్కడ మేస్తుండేవి. ఆబాదిని కోళ్ళు కాయడానికి పెట్టింది. సాదత్ మియాఁ ఒక కార్ఖానాలో పనిచేసేవాడు. పగలంతా అతి తక్కడ. ఈమె కోళ్ళ కావలా. ఆబాదీ దొరసానికి మహమ్మద్ బక్ష్‌తో ప్రేమకలాపం ప్రారంభం అయింది. సాదత్ తల్లి చూచి కొడుకుకు చెప్పింది. అంటు చావతన్నాడు. మహమ్మద్ బక్ష్‌కు ఒక మిత్రుడు ఉండేవాడు. పేరు అమీర్ నవాబు మీర్జా కొలువుగాడు. వ్యభిచారంలో మొనగాడు. అతడు లేకపోతే ఒక ఇంట్లో ఉంటాడు. అక్కడ అతని మిత్రబృందం ఉండేది. ఆబాదీ వారికి ఆటబొమ్మ అయింది. ఆ కాలంలోనే అమ్మకు రోగాలంటుకున్నాయి. ఇక మియాఁ అమీర్‌కు ఆవిడతో నేంపని? ఆస్పత్రిలో పారేశాడు. ప్రస్తుతం అక్కడే ఉంది. పిలిపించమంటే పిలిపిస్తాను.

---

1 పఠాను స్త్రీ  2 ఫకీరుల మఠము

# 21

మనసా వాచా కోరికలన్నీ
ఇనుమిక్కిలిగా తీరిపోయినవి !

అది రజబ్ నెల. దర్గాకు వెళ్ళి దర్శనం చేసుకోవాలనిపించింది సాయంకాలం సవారీ ఎక్కి వెళ్లాను. పుష్పములుండే చోట దిగాను. ఫాస్త పచారుచేశాను. తరవాత దివ్వెలు వెలిగించి ప్రార్థించాను. ఒకరు శోక గీతం ఆలపిస్తుంటే విన్నాను. తరవాత హదిస్[1] చదివారు. సంతాప సభ జరిగింది. జనం ఇండ్లకు వెళ్ళిపోయారు. నేను జియారత్ రుఖ్సత్[2] చేసుకొని దర్వాజావరకు వచ్చాను. జనానీ[3] దర్గాకు వెళ్ళాలనిపించింది. నవాబు మలికాకిషోర్ అనుగ్రహంవల్ల చాలమంది మహిళలు వచ్చియున్నారు. ఈ నెపంతో వారిని కలుసుకోవచ్చునని సవారీ ఎక్కి పరదా వేసుకున్నాను. జనానీ దర్గా గుమ్మంవద్దరికి చేరాను. దర్గా రక్షకుడు వచ్చి సవారీ దింపాడు. లోపలికి వెళ్ళాను. నేను ఊహించింది తప్పేమీకాదు. చాలమంది కలిశారు. విజాలు, నిష్ఠురాలు, విప్లవాన్నిగురించిన మాటలు ఇంకేవేవో మాట్లాడాం. చాలరాత్రి అయింది. వెళ్లామని బయలుదేరాను. ఇంతల్లో కుడివైపునుంచి వస్తున్న కాన్పూరు బేగం కనిపించారు. అందమైన దుస్తులు ధరించి ఠీవిగా నడుస్తూంది. వెంట నలుగురైదుగురు దాసీలున్నారు. ఒకతె జారిపోతున్న ముసుగు సవరిస్తూంది. ఒకదాని చేతిలో విసనకర్ర. ఒకతె గిన్నె, మరొకతె పాన్‌దాన్ పట్టుకొనివుంది. నన్ను చూడగానే ఉరికి వచ్చి భుజంమీద చేయివేసింది.

బేగమ్ : అబ్బ! ఉమ్రావ్! బతికేవున్నావే! కాన్పూరులో మాయమై లక్నోలో కనిపించావు. అదీ ఆకస్మికంగా.

నేను : ఏం చేయను ? మీ కోటలో ఉన్నానా ఆ రాత్రి. తెల్లవారి లక్నో నుంచి మనుషులు వచ్చి నన్ను లాక్కొచ్చారు. తరవాత కల్లోలం చెలరేగింది. దేవునికే తెలియాలి ఎక్కడెక్కడ తిరిగానో ! నాకు మీ జాడగాని, మీకు నా విషయంగాని తెలియకుండాపోయింది.

---

1 హజ్రత్ మహమ్మదు చరిత్ర. 2 వెళ్ళిపోయేటప్పటి దర్శనం.
3 గోషాస్త్రీలకోసం ఏర్పాటుచేసిన భాగం.

బేగమ్ : ఇప్పుడు ఇద్దరమూ లక్నోలోనే ఉన్నాంగా.

నేను : లక్నోలో ఏమిటి? ఇక్కడే ఉన్నాం.

బేగమ్ : అదేం లాభంలేదు. మా ఇంటికి రావాలి.

చౌపేట్‌దగ్గర నవాబుగారిని ఎరగని వెవరు?

నవాబుగారంటే ఎవరు అని అడుగుదామనుకుంటుండగానే ఒక దాసీది "నవాబు మహమ్మద్ తకీఖా ఇల్లు ఎరగనివాడెవరు?" అన్నది.

నేను : రావడానికేం వస్తాగాని నవాబుగా రేమనుకుంటారో?

బేగమ్ : ఏమీ అనుకోరు. ఆయన అలాంటివారు కారు. అదిగాక ఆ రాత్రి వృత్తాంతం అంతా వారికి పూసగుచ్చినట్లు చెప్పాను. ఆయన స్వయంగా కాన్పూరులో అనేకసార్లు వెదికించారు. తరచు అడుగుతుంటారు.

నేను : అయితే తప్పక వస్తాను.

బేగమ్ : మాట ఇవ్వు. ఎప్పుడు వస్తావు?

నేను : వచ్చే గురువారం దర్శనం చేసుకుంటాను.

బేగమ్ : ఓహ్హో! ఈ గురువారపు భక్తురాల వెప్పటినుంచి అయినావు? ఇంకా ఎనిమిది రోజులుంది. ఇటునుంచే రాగూడదూ?

నేను : మంచిది. అయితే వచ్చే సోమవారం వస్తాను.

బేగమ్ : ఆదివారం రా. నవాబుకూడా ఇంట్లో ఉంటారు. సోమవారం మళ్ళీ ఏ ఇంగ్లీషువాళ్ళో కలుసుకోవడానికి వెళ్తారు.,

నేను : అలాగైతే ఆదివారమే కానివ్వండి.

బేగమ్ : ఏ సమయానికి వస్తావు?

నేను : మీరు ఎప్పుడంటే అప్పుడు. నాకు ఇంట్లో పనేమీ లేదు.

బేగమ్ : నివాసం ఎక్కడ?

నేను : చౌకులో—సయ్యద్ ఖాన్ ఫాటక్‌వద్ద.

బేగమ్ : సరే. దాసీని పంపిస్తాను. దానివెంట వచ్చెయ్యి.

ప్రేమించేది నేనంటే ఆమెకు ప్రత్యేకమైన వాత్సల్యం బిస్మిల్లా ఆమెను ఎంతో సతాయించడాన అసహ్యంలాంటిది ఏర్పడింది ఎంతైనా కూతురు కదా! విప్లవం తరవాత ఖుర్షీద్ జాన్ కూడా వచ్చేసింది ఉంతరం ఖానమ్ దగ్గరే అమీర్ జాన్ పేరేగది తీసుకుంది అయినా ఆమె వస్తూపోతూ ఉంది

ఖానమ్ నాకు ఇచ్చిన గదిని ఆమె బ్రతికున్నన్నాళ్ళూ ఖాళీచేయనివ లేదు నా సామానంతా అందులోనే ఉండేది తాళంవేసి ఉంచేదాన్ని ఎప్పుడైనా బుద్ధిపుడితే అక్కడికి వెళ్ళేదాన్ని ఏడాది మొత్తం ఎక్కడున్నా మొహర్రంలో దానధర్మాలు అక్కడే చేసేదాన్ని తాను చనిపోయేవరకు నా పేర దానధర్మాలు చేసింది ఖానమ్

గురువారంనాడు బేగమ్ కలిశారు శుక్రవారంనాడు ఖానమ్ పరిస్థితి బాగుండలేదని మనిషి వచ్చారు నన్ను జ్ఞాపకంచేస్తుందని చెప్పారు వెంటనే వెళ్ళాను ఆఖరిచూపు చూడాలని ఇంటికి తిరిగివద్దామనుకుంటుండగానే మంచి బట్టలన్నీ ఒకటి తీసికెళ్ళాలనిపించింది గది తలుపు తెరిచాను చూస్తే గదినిండా సాలెగూళ్ళున్నాయి. మంచంమీద మట్టిగుర కొద్దిపట్టి పడిఉంది దావలు తివాచీలు చిందరవందరగా పడిఉన్నాయి. చెత్తాచెదారం చూసి నాకు పూర్వపురోజులు గుర్తుకువచ్చాయి అల్లా! ఒకప్పుడు ఈ గది సర్వదా అలంకరించబడిఉండేది రోజుకు నాలుగు సార్లు ఊడ్పు జరిగేది దుమ్ము అన్నమాట ఉండేదికాదు పూరికపుల్ల కనిపించేదికాదు ఇప్పుడు ఈ స్థితికి వచ్చింది క్షణం నిలువ ఊపిరాడటం లేదు అదే మంచంలో పడుకునేదాన్ని ఇప్పుడు చూడడానికే అసహ్యంగా ఉంది వెంట మనిషి ఉన్నాడు సాలెగూళ్ళు తొలగించమన్నాను ఎక్కడ్నుంచో గడ తెచ్చి శుభ్రంచేశాడు ఈలోగా తివాచీ దులిపాను ఇద్దరం కలిసి దాన్ని శుభ్రంచేసి పరచాం తెరలు దులిపాం మంచంమీద పరుపు దులిపి పరచాము. గదిలోంచి పింగార్‌దాన్[1] పాన్‌దాన్, ఉగల్‌దాన్[2] తెచ్చాను పూర్వం ఉండినట్లుగా వాటినన్నింటినీ నా దగ్గర పరచుకున్నాను. మంచంమీద వాలిసుకు ఆనుకొని కూర్చున్నాను తాంబూలం వేసుకున్నాను ఎదురుగా అద్దం ఉంది అందులో ప్రతిబింబం కనిపించింది పూర్వపురోజులు గుర్తుకువచ్చాయి. వయసు సొగసు కళ్ళలో మసలింది ఆ కాలంలో నన్ను గౌరవించినవారి చిత్రపటాలు మనసులో మసలాయి గౌహర్ మిర్జా కొంటెతనం. రాషిద్ వెకిలితనం. ఫైజూ

---

[1] శృంగారసామగ్రి గల పెటిక. [2] ఉమ్మి పాత్ర.

ప్రేమ సుల్తాను ఎదనము. ఒక్కరేమిటి ఆ కాలంలో నారగ్గరకు వచ్చిన వారందరి గుణగణాలు గుర్తుకువచ్చాయి ఆ గది స్మృతుల పేటికగా కనిపించింది ఒక పటం కనిపించేది మాయమయ్యేది మరొకటి వచ్చేది ఇలా అందరూ అయిపోయినతరవాత మళ్ళీ ఆవర్తం అవే ముఖాలు ఒకటి తరవాత ఒకటి మెల్లమెల్లగా కదలసాగాయి వాటిని గురించి ఆలోచించే అవకాశం లభించింది ముందు ఒక్కొక్కటే కనిపించిన పటాల్లోంచి అనేకం బయలుదేరాయి స్మృతిపథం విస్తృతం అయింది జీవితం మొత్తంలోనూ జరిగిందంతా కనులముందు కనిపించింది సుల్తానుగారు స్మృతిపథంలో కనిపించారు మొదటి కచేరి—రెండోరోజు సేవకుడు రావడం—స్వయంగా వారు రావడము—తీయని మాటలు—మధుర సంభాషణ—కవితా చర్చ—ఖానుగారి గోష్ఠి, వెకిలిమాటలు—సుల్తాను పిస్తోలు పేల్చడం—ఖానుగారు పడిపోవడం—షమ్షీర్ ఖాను ప్రాణాపాయం—కొత్వాలు రావడం—ఖానును ఇంటికి పంపడం—కుర్రానిచేత చీటీ పంపడం—నవాబుగంజు జలసాలు—ఇవన్నీ నిన్న జరిగినట్లు కనిపించాయి ఇదంతా గుర్తుకువస్తున్నా మొదటి కచేరీతరవాత సుల్తానుగారి మనిషి సందేశం తేవడం దగ్గరికివచ్చి మనసు నిలిచిపోయింది ఏదో జారిపోయి వల్లెవేసింది ఇంతలో మనిషి గట్టిగా కేకపెట్టాడు

"అమ్మా! మీ ఓణిమీద తెల్ల పాకుతూంది "

"ఓయ్ అని ఓణి తీసిపారేశాను ఎడంగా జరిగాను మనిషి ఓణి దులిపాడు తెల్ల పాకుతూ మంచంక్రిందికి వెళ్ళిపోయింది మనిషి మంచం ఎత్తాడు మంచపు కోడుక్రింద ఆయిదు నవరములు పరచి ఉన్నాయి

మనిషి చకితుడై "చూడండి ఏమి ఉందో?" అన్నాడు

నేను మనసులో ఇవి ఆ నవరనులు అనుకొని "నవరనులు" అన్నాను.

"వాహ్! నవర్సు లెక్కడినుంచి వచ్చాయి? '

నేను నవ్వి "తెల్ల నవర్సులుగా మారింది తీసుకో" అన్నాను

ముందు మనిషి తప్పిచ్చారు. తరవాత అందరూ తీసి దాచు ఇచ్చాడు.

ఖుస్పా  పితూరిలో ఖానమ్ ఇల్లు దోపిడి కాలేదా ?

ఉమ్రావ్  అయింది ఎందుకు కాలేదు? మంచపుకోడు ఎవరూ ఎత్తి చూడకుండవచ్చుగా ।

ఖుస్పా  కావచ్చు

# 23

కాంత, ఈర్ష్య పీటినెలాగ జయించడం ?
చెలికాంత్ర కూడినపు తవి అనుమడించు ।

ఆదివారం ఉదయం ఎనిమిది గంటలకు బేగంగారి దాసీది మేనా తీసుకొనివచ్చి నెత్తిన కూర్చుంది అప్పుడే లేచాను ఇంకా బాగా హుక్కా కూడా పీల్చలేదు దాసీది తొందర చేయసాగింది భోజనం వగైరా చేసి వెళ్దామనుకున్నాను కాని బేగమ్ తనకు తోడుగా భోజనానికి రావలసిం దన్నారని దాసీది తెలియజేసింది నవాబుగారు ఉన్నారా ?'' అని అడిగాను ఉదయం లేచి ఊరికి వెళ్ళిపోయారని చెప్పింది ఎప్పుడు వస్తారని అడుగగా సాయంకాలంవరకు వస్తారని తెలియపరచింది బేగంతో చాలా విషయాలు మాట్లాడాలనుకున్నాను వెంటనే చేతులు, ముఖం కడుగుకొని, తల దువ్వుకొని దాసీదాన్ని వెంటతీసుకొని బయలుదేరాను

వెళ్ళేవరకు బేగమ్ ఎదురుచూస్తూ కూర్చుంది నేను వెళ్ళగానే దస్తర్ ఖాన్ పరచారు. బేగమ్‌గారితో భోజనం చేశాను భోజనం ఆనందంగా ఉంది పలావులు కూర్మా. రకరకాల కూరలు. పచ్చళ్ళు. వేపుళ్ళు. పేస్తుల మురబ్బా సోహన్ హల్వా భోజనం అయినతరవాత మెల్లగా ఆ చెవులో.

బేగమ్ ।  కరీమ్ ఇంట్లో తొమ్మరోజ్జులూ, మనసవప్పు గుర్తున్నాయా ?

నేను ।  మాట్లాడకు ఎవరైనా వినగలరు

బేగమ్  ఏంతెలియని విషయమా? నవాబు తల్లి—భగవంతుడు ఆమెకు స్వర్గం ప్రసాదించుగాక—నన్ను నవాబుకోసం ఖరీదుచేసింది

నేను  అబ్బ! మాట్లాడకు  వేరుగా వెళ్ళి మాట్లాడుకుందాం పద

తాంబూలాలు అయినాయి  దాసీది హుక్కా గొట్టం తెచ్చిపెట్టింది బేగమ్ అందరినీ అక్కడినుంచి పంపించేసింది

నేను: నన్ను గుర్తించావు కదూ!

బేగమ్  గుర్తించకేం? మొదటిసారి కాన్పూరులో చూచినప్పుడే అనుకున్నాను. చాలసేపు ఎక్కడో చూచినట్లు అనిపించింది  ఎక్కడ చూచిందీ గుర్తుకురాలేదు  ఎంతో ఆలోచించాను  అయినా గుర్తుకు రాలేదు  కరీమన్ అనే దాసీమీద దృష్టిపడింది  వెంటనే ఆ వెధవ కరీమ్‌గారి పేరు గుర్తుకువచ్చింది  అప్పుడు అనుకున్నాను కరీమ్ ఇంట్లోనే చూచివుండాలని

నేను  నాకూ అలాగే అనిపించింది  చాలసేపు ధ్యానంగా చూచాను నా తోటివారిలో ' ఖుర్షీద్ '' అనేది ఉండేది  ఆమె అచ్చం నీలాగే ఉండేది  ఆమెను చూచినప్పుడల్లా నువ్వు గుర్తుకువచ్చేదానివి

బేగమ్: ఇక నా విషయం విను

ఏరిపోయావా? నవాబుగారి తల్లి ఉమ్దతున్నిసా బేగమ్ నన్ను కొన్నది  అప్పుడు నా వయసు పన్నెండు సంవత్సరాలు ఉండవచ్చు నవాబుగారికి అప్పటికి పదహారేళ్ళు  వారి తండ్రి కాన్పూరులో ఉండే వారు  బేగమ్‌గారికీ భర్తకూ స్పర్థలుండేవి  నవాబు తండ్రి నవాబుగారి పెళ్లి తన అక్కకూతురుతో నిశ్చయించారు. బేగమ్‌గారికి ఆ సంబంధం ఇష్టంలేదు  నవాబు మేనత్త ఢిల్లీలో ఉండేది  నవాబు తల్లి తన అన్న కూతురు నిచ్చి కొడుకుకు పెళ్ళిచేయాలనుకుంది  మొదటినుంచీ ఉన్న ఆలుమగల స్పర్థలు దీనితో పెరిగాయి  ఈ తగాదా పరిష్కారంకాక ముందే నవాబుగారి తండ్రి జబ్బుపడ్డారు  వైద్యులు త్వరగా పెళ్ళిచేయా లన్నారు. అది సాధ్యపడలేదు. ఇంతలో నేను ప్రవేశించాను. బేగమ్ గారు నన్ను కొన్నారు

నవాబుగారికి నేనంటే అపారమైన ప్రేమ ఏర్పడింది. రెండు తరఫుల సంబంధాలూ తనకు ఇష్టంలేవని స్పష్టంగా చెప్పేశాడు. దూర

దృష్టవశాత్తూ బేగమ్‌గారు గతించారు. తరవాత కొద్దికాలానికి పెద్దనవాబు గారు మరణించారు. తల్లి తండ్రి ఇద్దరూ ఆస్తి గలవాళ్లే. ఒక్కరే కొడుకు. ఇద్దరి ఆస్తి వారికే చెందింది.

నవాబుగారి దయవలన బేగమ్‌ను అయినాను. హాయిగా ఉన్నాను. తాళికట్టిన భార్యకంటే మిన్నగా చూసుకుంటున్నారు నవాబుగారు. నాకు తెలిసినంతవరకు వారు మరొక ఆడదాన్ని కన్నెత్తిచూడలేదు. బయట ఎవ్వరైనా సానులున్నారేమో నాకు తెలియదు. ఎంతైనా మగవాళ్ళు గదా! వెంటఉండి చూడబోయానా!

అల్లా అన్ని కోరికలూ తీర్చాడు. ఎల్లిదా కావాలనే అభిలాష ఉండేది. భగవంతుడు ఆ కోరికకూడా తీర్చాడు. ఇప్పుడు ఉన్నకోరికల్లా కోడలును తేవడం. మనుమని ఆడించడం. నవాబుచేతిలో మట్టిఅయిపోతే ధన్యురాలిని. ఇక నీ కథ చెప్పు.

రామ్‌దేయీ తన కథ చెపుతున్నంతసేపూ నా దురదృష్టానికి మనసులో దుఃఖించాను. అదృష్టం అంటే అలా ఉండాలనుకున్నాను. నా ఖర్మ నన్ను భోగం కొంపకు చేర్చింది.

తరవాత సంగ్రహంగా నా కథ చెప్పాను. అది మీకు తెలిసిందే. ఆ రోజంతా అక్కడే ఉన్నాను. వెళ్ళిపోవడానికి తయారుఅవుతుండగా దాసీలను పిలిచి తబలా తంబూరా సితార్ వగైరా తెప్పించింది. పాటలు ప్రారంభం అయినాయి.

మేము ఇద్దరం మాత్రమే ఉండినప్పుడు ఆమె రామ్‌దేయీ. నేను అమీరన్ అయినాం. అందరి ముందు మళ్ళీ ఆమె బేగమ్ సాహెబా. నేను ఉమ్రావ్‌జాన్ అయిపోయాం. మూడు నాలుగు గంటలు గాన వాద్యగోష్ఠి జరిగింది. బేగమ్‌కుకూడా కొద్దిగా సితార్ వాదనం తెలుసు. ఒక చెలికత్తె గొంతు బాగుంది. ఆమెతో పాడించింది. సాయంకాలంవరకూ ఆనందంగా గడిచింది.

# 24

ఓసి కాంతద్వృగంచలమా ! జాగ్రత
ఎల్లవారి చూపులతూపులు నీయందె నిగిడె

సాయంకాలానికి నవాబుగారు వచ్చేశారనే కలకలం వినవచ్చింది స్వేచ్ఛావ్యాప్తికి అంతరాయం కలిగింది తబలా సితార్ తంబూరా వగైరాలన్నీ తొలగించబడినాయి గోషావారు పరదాలలోకి వెళ్ళిపోయారు అంతా ఎవరి స్థానాల్లో వారు ఉండిపోయారు నేనూ బేగమ్‌కు దూరంగా నుంచున్నాను మేము కూర్చున్న చోటునకు ఎదురుగా ద్వారం ఉంది దానికి తెరఉంది నవాబుకోసం ఎదురుచూస్తూఉండడాన చూపు పరదాకు అంటుకుపోయింది ఇంతలో నవాబుగారు విజయం చేస్తున్నారనే కేక వినిపించింది కొన్ని క్షణాలు గడిచాయి ఒక దాసీది తెర తొలగించి బిస్మిల్లా ఇర్రహమా నిర్రహీమ్ అన్నది నవాబు లోపల ప్రవేశించారు

వారిని చూడగానే మనసులో అనుకున్నాను సుల్తానుగారు ఎలాంటి సమయంలో ఎదురైనారు అని నవాబుదృష్టి నామీద పడింది క్షణం తడబడ్డారు తరవాత నన్నే చూస్తూ ముందుకు సాగారు నేనూ వారినే చూస్తూఉండిపోయాను

వారిని చూచినప్పుడెల్ల గుండె బెదురు నాకు
నా దృక్కు లతనిక ప్రళయమహోగ్రకీలలయ్యె

నవాబు నాదగ్గరికి వచ్చారు ఇంకా నన్నే చూస్తున్నారు

బేగమ్ : ఎందుకలా చూస్తారు ? ఉమ్రావ్‌జాన్ కొన్నాళ్ళలో

నవాబు (వినకుండానే) ఈమె విషయమే మీకు నేను చెప్పింది

అంతా వినయంగా లేచి నుంచున్నారు నవాబు దిండును ఆనుకొని బేగమ్‌పక్కన కొద్ది ఎడంగా కూర్చున్నారు

చీకటి పడింది దాసీది రెండు వెల్లని దీపకమలాలు తెచ్చిపెట్టింది బేగమ్ ఆకులకు సున్నం రాస్తూంది ఈలోగా నవాబు దొంగచాటుగా

నావైపు చూచారు. నా కనుపాపల్లో వారు కనిపించారు. నాలుకలు పలకవు కాబట్టి కళ్ళకే నోరువచ్చింది. కోపతాపాలు విరహప్రణయాలూ కళ్ళతోనే సాగాయి.

నవాబు (కొత్తదనం కనబరచి) ఉమ్రావ్‌జాన్‌గారూ! మీకు మేము ఎంతో ఋణపడివున్నాం. ఆ రాత్రి కాన్పూరులో తాము లేకుంటి వల్లయితే మా ఇల్లు దక్కేది కాదు.

నేను ఎందుకు నన్నిలా ముళ్ళకంచెలోకి లాగుతారు? అది కాకతాళీయం మాత్రమే.

నవాబు ఏ తాళీయం అయినా కారణం మీరే. అక్కడ ఉండినదేమీ లేదు. అయినా ముఖ్యమైన కాగితలన్నీ అక్కడే ఉన్నాయి.

నేను అడవిలో ఆడవాళ్ళను వదిలి ప్రభువులు ఎక్కడికి వెళ్ళారు?

నవాబు ఏం చేయను? పరిస్థితులు అలా వచ్చాయి. లక్నోలోని ఆస్తి పాదుషా జప్తుచేశాడు. గవర్నరుదగ్గరకు కలకత్తా వెళ్ళవలసివచ్చింది. ఆ తొందరలో వెంట ఏమీ తీసికెళ్ళలేదు. ష్షబ్బీర్‌ఖానును మరొక మనిషిని మాత్రం వెంటతీసికెళ్లాను.

నేను ఆ అడవి ఇంట్లో ఏం జరిగినా ఆశ్చర్యంలేదు.

నవాబు ఆనాటి సంఘటన తప్ప ఏదీ జరుగలేదు. పితూరి జరుగబోతూంది. గుండాలంతా తలెత్తారు. దేశంలో చీకట్లు కమ్ముకున్నాయి.

తరవాత ఆ మాటలూ ఈ మాటలూ జరిగాయి. దస్తర్‌ఖాన్ పరచబడింది. కలిసి భోజనాలు చేశాం. ఆకు తినడం, హుక్కా తాగడం అయ్యాకతరవాత నవాబు సంగీతం పాడమని ఆదేశించారు. నేను ఈ గజలు పాడినాను.

గుర్తులేదు మరణవేళ మృత్యుదేవి
గుర్తువచ్చె పదేపదే అదే చెలియ।
నీ వలపు వయ్యారాలు గుర్తులేవు
నీ చేసిన మోసమెల్ల గుర్తుకలదు।
విరహరాత్రి గడిచిపోయె—గుర్తులేదు
కుతుల వలని దిక్కులేకాల గుర్తుకలదు।

వియోగాన నీ వాకితెవె గుర్తుంటివి
నీవు రానివేళ దావాకాలె గుర్తువచ్చె।

అడుగకు నా వలపుకలత వెన్నెకలవా
స్వర్గమందుకూడ అవియె గుర్తువచ్చు।

ఓరి వైద్యుడా। గ్రుక్కెడు విషము తెమ్ము
నా అమృతమేదో ఇపుడు గుర్తువచ్చె।

ఏమి పాట। ఎవరు చెప్పిరి
ప్రాభాత మలయానిలమేల గుర్తువచ్చెనో।

*  *  *  *

వర్షకాలం వానలు జోరుగా ఉన్నాయి మామిళ్ళు కాశాయి. నా గదిలో గుంపు చేరింది సానులలో బిస్మిల్లాజాన్, బేగాజాన్, ఖుర్షీద్ జాన్, మగవారిలో నవాబ్ బబ్బన్ నవాబ్ ఛబ్బన్, గోహర్‌మిర్జా, అషిఫ్ హుసేన్, తఫజ్జుల్ హుసేన్, అష్గరలీ అక్బరలీఖాను ఉన్నారు పాట సాగుతూంది. ఇంతలో బిస్మిల్లా " పాట రోజూ ఉండేదే, మామిడు పెట్టండి పంటలు కానివ్వండి చూడండి వర్షం ఎంత అందంగా ఉందో " అన్నది

నేను: తెప్పించుకో బజారునుంచి

ఖుర్షీద్: బాగా చెప్పావు బజారునుంచి తెప్పించుకోవాలటు బజారు నుంచి పంట వేసుకొని తినాలి అందులో ఉంది మజా.

నేను: నీకు కుంతలు గోకడం ఆనందం నేను మాత్రం ఖండించేయ లేనమ్మా నీ ఇష్టం

బేగా అయితే నువ్వు బజారుదానివన్నమాట

నేను అబ్బ ఎంత ఆకలే నీకు।

బేగా నాకు కాదే ఆకలి అడిగింది బిస్మిల్లా ఆమె నను

బిస్మిల్లా: ఇవ్వాళ ఏదో ఒకటి కావాలిసిందే.

నేను: చెప్పరా। ఐక్షి చెరువుకు వెళ్దామా।

బిస్మిల్లా: ఎంత మంచిమాట చెప్పావక్కా।

ఖుర్షీద్: హాయిగా విహరించవచ్చు.

బేగా   నేనూ వస్తా

నేను   అయితే సామాను సర్దు

మాటలా మాటంలోనే మూడు బాడుగబండ్లు వచ్చాయి వంట సామగ్రి వాటిమీద వేశారు నవాబు ఛబ్బన్ ఇంటినుంచి రెండు గుర్రాలు వచ్చాయి. అంతా బండ్లెక్కాం బండ్లు కదిలాయి

గోమతి దాటింతరవాత బేగా జాన్ పాట మొదలుపెట్టింది

ఝూలా కన్ డారోరే అమిరియా౹

ఎన్ని మళుపులు తిప్పిందో। గుండె పిండేసింది

పట్నం దాటితే అడవి ఎంతో అందంగా కనిపించింది ఎటు చూచినా పచ్చదనం ఆకాశంలో మబ్బులు ఉరుకుతున్నాయి వర్షం కురుస్తోంది చెట్ల ఆకులనుంచి నీటిబిందువులు రాలుతున్నాయి వడి నదాలు నిండి ప్రవహిస్తున్నాయి నెమలి ఆడుతోంది కోకిల పాడు తోంది మాటల్లోనే చెరువుదగ్గరికి చేరాం గుర్రాలు నిలిచాయి పొయ్యిలు వెలిగాయి మూకుళ్ళు ఎక్కాయి పూరీలు తయారుఅవు తున్నాయి నవాబు ఛబ్బనుగారు వానదుస్తులు వేసుకొని వేటకు బయలు దేరారు గోహర్‌మిర్జా మామిడికాయలు తెంపాడు ఇంతలో పనివాళ్ళు తోళ్ళోంచి మంచాలు తెచ్చారు ఆనందం అంటే అది మామిడికాయలు రాలుతున్నాయి ఒక్కొక్క కాయమీద నలుగురు, పలుగురు పడు తున్నారు వానలో గంతులు వేస్తున్నారు

ఒకరు అటు పరిగెత్తుతున్నారు ఒకరు ఇటు పోట్లాటలు క్రింద పడితే అంతా బురద వానలో తడిసి ముద్దయితే చాలు మళ్ళీ శుభ్రం కాస్త జాగ్రత్త గలవాళ్ళు బాటీ బేగాజాన్‌లాంటివారు గుడారాల్లో కూర్చున్నారు

బిస్మిల్లా చాటుగా వెళ్ళి ముఖానికి మామిడిపళ్ళరసం పులిమింది వాళ్ళ కేకలు వీళ్ళ నవ్వులు చూడాలి తమాషా।

వరదలు వచ్చినట్లు వచ్చారు ఆటపాటలవాళ్ళు వాళ్ళతో పాడిం చారు వారితోతన్న ఢోంక్ వాయించేవాడు అసాధ్యుడు వాళ్ళ ఆట పాటలు మాకేం నచ్చుతాయి। అయినా ఆ పరిస్థితిలో అది బాగానే ఉంది

రెండు గడియల పొద్దుండగా మా అదృష్టానికి మబ్బు విడిపోయింది ఎండ వచ్చింది జాగ్రత్తకోసం ఇంటినుంచి ఒక్కొక్క జత బట్టలు తెచ్చుకున్నాం బట్టలు మార్చుకొని వనవిహారానికి బయలుదేరాం

నేను ఒంటరిగా ఒకవైపు బయలుదేరాను ఎదుట చెట్లు దట్టంగా ఉన్నాయి చెట్లవెనుక సూర్యుడు క్రుంగుతున్నాడు పచ్చని చెట్లమీద బంగారు కిరణాలు శోభాయమానంగా ఉన్నాయి అంతటా అడవిపూలు వికసించాయి పక్షులు గూళ్ళు వెదుకుతూ ఎగురుతున్నాయి చెరువు నీటిమీద సూర్యకిరణాలు పడడాన బంగారం కరిగిపోసినట్లనిపిస్తూంది ఆకాశంమీద సంధ్యారాగం పరుచుకుంది ఈ అందాన్ని ఆనందాన్ని వదిలి గూటిలో కూర్చోడం సాధ్యపడదు అలా చూస్తూ ఎంతదూరం నడిచానో ఒక మట్టిరోడ్డు వచ్చింది పల్లెజనులు ఆ బాటనే వెళ్తున్నారు భుజాన నాగలి వేసుకొని ఒకడు ఎద్దులు తోలుతున్నాడు ఒక చిన్నపిల్ల ఆవులను గేదెలను తోలుకుపోతూంది ఒక కుర్రాడు మేకల గొర్రెల వెనుక వెళ్తున్నాడు అన్నీ అలా కనిపించి మాయం అయినాయి మళ్ళీ ఒంటరిదాన్ని అయిపోయాను ఏ ధ్యాసలో ఉన్నానో రోడ్డువెంట సాగిపోయాను చెరువువైపు వెళ్తున్నానేమో। సూర్యుడు అస్తమించనున్నాడు కాళ్ళు వేగంగా నడిచాయి కొంతదూరం నడిచాను ఫకీర్ల స్థలం కనిపించింది కొందరు కూర్చొని హుక్కా తాగుతున్నారు చెరువుకు దోవ అడిగాను బక్నా రోడ్డుమీద నడుస్తున్నానని తెలిసింది చెరువు కుడివైపున తప్పిపోయింది రోడ్డు వదిలి కాలిబాటన సాగిపోయాను కొంత దూరంలో ఒక కాలువ కనిపించింది కాలువ అవతలిఒడ్డున రెండు మూడు చెట్లున్నాయి ఈ చెట్లక్రింద మనిషి అలికిడి వినిపించింది ఒక మురికిబట్టల మనిషి గునపంతో ఏదో త్రవ్వుతున్నాడు అతన్ని చూచాను అతడు చూచాడు ముందు సంశయం బాగా చూచాను అతడే నిశ్చయం చూపు తిప్పాలని ప్రయత్నం వెధవది కదలందే ధృవపడింది అతడే ఒళ్ళు తూలింది పడిపోయేదాన్నే ఇంతలో అక్బరలీఖాను నౌకరు సాలారుఖాను కేక చెవిని పడింది నన్ను వెదకడానికి బయలుదేరాడతను నన్ను చూచి దిలావర్‌ఖాను గునపం అక్కడే పెట్టేశాడు నేను అతనిని చూడడం అతడు నన్ను చూడడం అతడు నన్ను గుర్తించలేదని తేలిపోయింది నేను మాత్రం అతనిని బాగా గుర్తించాను.

సాలార్‌బక్ష్ మాట విని దిలావర్‌ఖాను కాలువవైపు పరిగెత్తాడు. సాలార్‌బక్ష్ నావద్దకు చేరాడు నేను భయంతో వణికిపోతున్నాను నోట

నుంచి మాట రావడంలేదు. సాలార్‌బక్ష్ నన్ను చూసి "భయపడ్డారా?" అని అడిగాడు. నేను చెల్లెవైపు సంజ్ఞచేశాను. సాలార్‌బక్ష్ అటు చూశాడు.

సాలార్ ఏముందక్కడ? గునపం పడిఉంది. వాహ్! దాన్ని చూసి ఇంత భయమా? బొంద తవ్వుతున్నాననుకున్నారా! ఏది ఆ తవ్వుతూఉండినవాడు?

నేను నోటితో చెప్పలేకపోయాను. కాలువవైపు చూపాను.

సాలార్ హుక్కా తాగడానికి వెళ్ళిఉంటాడు. నవాబు భవ్వనుగారు చాల పిట్టలను కొట్టితెచ్చారు. మీ జాడ కనిపించలేదు. వెదకడానికి వారు అటు వెళ్ళారు. నేను ఇటు వచ్చాను. నేను లేకుంటే మీకు తోవ దొరికేదికాదు.

నేను అవుననికాని కాదనికాని అనలేదు. సాలార్‌బక్ష్‌కూడా మాట్లాడలేదు. చీకట్లోంచి చెరువుదగ్గరికి చేరాం. రాత్రి అక్కడే ఉండిపోయాం. తెల్లవారు అయినతరవాత అక్బరలీఖానుకు ఆ వృత్తాంతం చెప్పాను.

అక్బరలీఖాను: బాగా చూశావా? దిలావరుఖానేనా? ఫైజాబాదువాడు గుర్తించేఉంటావు. పెదవమ వెళ్ళి పట్టుకునేవాణ్ణి. ముందే చెప్పావు కావు. పేరు వచ్చేది. ప్రభుత్వ బహుమానం లభించేది. వేయి రూపాయీలు ఇస్తామని ప్రకటించారు. ఏమి తవ్వుతూఉంటాడు?

నేను ఏమో ఎలా తెలుస్తుంది? వెధవ తన గోరీ తవ్వుకుంటున్నాడేమో!

అక్బ: వాడి పేరు చెబితే నీ ముఖం వెలవెలపోతూంది. ఇక్కడ ఏం చేయగలడు వాడు నిన్ను?

నేను (ధైర్యం తెచ్చుకొని) పితూరి సమయంలో ఏదో పాతిపెట్టి ఉంటాడు. త్రవ్వి తీసుకోవడానికి వచ్చిఉంటాడు.

అక్బ పడుపు చూతాం

నేను నేను మాత్రం రాను.

అక్బ నేను వెళ్ళడం ఖాయం. సాలార్‌బక్ష్‌ను తీసికెళ్తాను

నేను: ఎక్కడికి వెళ్తారు? ఇంకా అక్కడ ఏముంటుందని? తవ్వి తీసి తెచ్చుకుంటాడు

అక్బ: వెళ్ళడం ఖాయం

కాస్త బిగ్గరగా అన్నారు. పక్కనే నవాబు ఛబ్బనుగారి గుడారం ఉంది. బిస్మిల్లా నవాబు మెలకువతోనే ఉన్నారు.

నవాబు: ఖానుగారూ! ఎక్కడికి వెళ్ళడం?

అక్బ: నవాబుగారూ! ఇంకా మీరు పడుకోలేదా?

నవాబు: ఇంకా లేదు

అక్బ: నేను రానా?

నవాబు: విచ్చేయండి

అక్బరలీఖాను నేను డేరాలోనికి వెళ్ళాం. మొత్తం వృత్తాంతం వినిపించాను.

నవాబు: ఆ దుర్మార్గుడు మీకెలా తెలుసు?

నేను: నా కథంతా వారికేం చెప్పను? "తెలుసు బాగా తెలుసు. నేను ఫైజాబాదు దాన్నేకదా?" అన్నాను

నవాబు: ఏమీ! మీరు ఫైజాబాదువాళ్ళా?

అక్బ: ఇక్కడే ఎక్కడో ఉంటాడు దుర్మార్గుడు. వాణ్ణి పట్టాలి

సాలార్‌బక్షను పిలిచి చీటి వ్రాసి దగ్గరేఉన్న పోలీసు ఠాణాకు పంపారు. కొద్దిసేపటిలోనే ఠాణాదారుడు పది పన్నెండుమంది పోలీసు లను తీసుకొనివచ్చారు. చూచింది చెప్పాము. ముందు ఆ స్థలానికి వెళ్ళి వెదికారు. పక్కీర్ల స్థావరంలో కొద్దిగా జాడ తెలిసింది. ఒక పోలీసుకు రాజులకాలపు వరహా దొరికింది. అది తెచ్చి ఠాణాదారునికి ఇచ్చారు. "దేవుడు తలచుకుంటే సౌమ్యయుక్తంగా పట్టువడతాడు" అన్నాడు ఠాణా దారుడు.

ఠాణాదారు గట్టి బందోబస్తు చేశారు. పోలీసులుకూడా శ్రమపడ్డారు. రాత్రి మూడు గంటలకు ముక్కాగంజ్‌లో పట్టుబడ్డారు. తెల్లవారుతుండగా

చెరువుదగ్గరికి తెచ్చారు 24 నవరసుల దొరికాయి గుర్తించడానికి నన్ను పిలిచారు నేనుకాక ఇద్దరు పోలీసులుకూడా గుర్తించారు ఉదయం పది గంటలకు లక్నో తీసికెళ్ళారు

రుస్వా ఇంతకూ వాణ్ణి ఏంచేశారు? త్వరగా చెప్పండి

నేను ఏమి అవుతుంది? రెండు నెలలతరవాత తెలిసింది ఉరితీశారని

# 25

బ్రతుకు వ్రాత నా కనులముందు వ్రేలె!
స్వీయకథయం దరి చదివి కుంగిపోతి!

మిర్జారుస్వాగారూ! మీరు నా ఆత్మకథ చిత్తుప్రతి చూడవలసిందని నాకు ఇచ్చినప్పుడు మండిపోయాను ముక్కలు ముక్కలుగా చించేదా మనుకున్నాను ఈ బ్రతుకులో ఏం పాడుబడిందని! చచ్చినతరవాతకూడా చదివి జనం తిట్టడానికి కథ రాయడమా అనిపించింది మీరు చేసిన శ్రమను చూసి చేయి నిలిచిపోయింది

నిన్న రాత్రి పన్నెండు గంటలకు ఎందుకో మెలకువ వచ్చింది గదిలో ఒంటరిగా ఉన్నాను అది మామూలే పనివాళ్ళంతా క్రిందిగదిలో పడుకున్నారు దీపం వెలుగుతూంది ముందు పడకలో అటూ ఇటూ పొర్లాను. నిద్రపోవడానికి ప్రయత్నించాను నిద్ర రాలేదు చివరకు లేచాను పాన్ తిన్నాను దాసీదాన్ని పిలిచి హుక్కా వెలిగించాను మంచంమీద పడుకొని హుక్కా పీల్చాను పుస్తకం చదవాలనిపించింది అలమరాలో చాల కథల గాథల పుస్తకాలున్నాయి ఒక్కొక్కటే తీసి పుటలు తిప్పసాగాను అన్నీ ఇదివరకు చదివినవే మూసిపెట్టేశాను ఈ చిత్తుప్రతి కనిపించింది రక్తం వేగంగా ప్రవహించింది. చించేయాలని నిశ్చయించుకున్నాను ఇంతలో ఎవరో చెవిలో చెప్తున్నట్లు అనిపించింది—"ఉమ్రావ్! ఇప్పుడు దీన్ని చించుతావు తగలేస్తావు బాగానే ఉంది కాని భగవదాజ్ఞతో దేవదూతలు నీ కథనంతా వ్రాసిపెట్టారు కదా! దాన్ని ఎవరు చెరపగలరు? ఎవరు కాల్చగలరు? ఎవరు చింప గలరు?"

ఈ అదృశ్యవాణి ఏవి కావు చేతులు వణకాయి  చిత్రప్రతి కారి పరేంత పని అయింది  ధ్వంసం చేసే ఆలోచన పూర్తిగా మాయం అయింది  ఎక్కడినుంచి తీశానో అక్కడే పెట్టేదామనుకున్నాను  కాని ఒకసారి చూడాలనిపించింది  ఉసురుపోశకు చదవసాగాను  మొదటి పుట పూర్తిగా చదివాను  పుట తిప్పాను  నాలుగు అయిదు పంక్తులు చదివాను  నా ఆత్మకథలో నాకే ఆసక్తి ఏర్పడింది  చదువుతుంటే చదవాలనిపించింది  ఇతర కథలు చదవడంలో ఇంత ఆనందం కనిపించలేదు. ఎందుకంటే అవన్నీ కల్పనలనీ వాస్తవాలు కావనీ తెలుసు  అలా చేయడంలో ఆసక్తి చచ్చిపోతుంది  ఈ కథ అలా కాదు  ఇది నా స్వంత కథ మీరు వ్రాసింది  అన్ని సంఘటనలూ నా జీవితంలో జరిగినవి  అన్ని విషయాలు నా కళ్ళముందు కనిపిస్తున్నాయి  వీటిలో కల్పన లేదు  అన్నీ వాస్తవాలు  ప్రతి సంఘటన ప్రతి అంశం నా మనసుమీదా మెదడుమీదా ఎలాంటి ప్రభావం వేశాయో తెలియపర్చడం కష్టం  ఆ దశలో నన్ను ఎవరైనా చూచిఉంటే పిచ్చిదానికింద లెక్కకట్టేవారు  ఒకప్పుడు పిచ్చిగా నవ్వేదాన్ని  మరొకప్పుడు కన్నీటిజాలు ప్రవహించేవి  అవసరం అయినచోట సవరించమని తాము కలిపిచ్చారు  కాని అంత స్పృహ ఏది? చదువుతుండగానే తెల్లవారింది  చేతులు ముఖం కడుక్కొని నమాజు చేశాను  మళ్ళీ పడుకున్నాను  ఎనిమిది గంటలకు లేచాను  చేతులు ముఖం కడుక్కొని చదవసాగాను  సాయంకాలంవరకు పూర్తిచేశాను

కథ మొత్తంలోనూ తాము శీలవతులనుగురించి దుష్టస్త్రీలనుగురించి చెప్పి వారి వ్యత్యాసం చూపిన ఉపన్యాస భాగం నాకు ఎంతో నచ్చింది శీలవతులకు గర్వం ఉందంటే అది వారికి అలంకారం  నాలాంటి బజారు స్త్రీలు వారి గర్వాన్ని చూచి సిగ్గుపడాలి  కాని ఆకస్మిక సంఘటనలను గురించి తమ ఉపన్యాసంలో ఎక్కడా చెప్పలేదు  నేను చెడిపోవడానికి దిలావర్ ఖాను వైరమే కారణం  వాడు నన్ను ఎత్తుకువెళ్ళకుండి ఉన్నట్లయితే, ఖానుమకు అమ్మకున్నట్లయితే నా జీవితం ఎలా ఉండేదో? ఈ దుష్టవాతావరణంలో చిక్కిపోయాననడం నిస్సందేహం. అందుకే బాల్యకాలంనుంచి నాకు విసుగు విద్యాలత కలిగాయి  ఆ కాలంలో ఈ సిగ్గుసత్యాలు నాకు తెలియవు  నేను చేస్తున్నది శాసన వ్యతిరేకకార్యం అని కాని, శిక్ష విధించడానికి ఒక శాసనం ఉందనిగాని నాకు తెలియదు. నేను ఖానమును నా స్వామినిగా భావించాను. ఆమె ఇష్టానికి విరుద్ధం అయిన పని చేయలేదు. చేసినా ఆమె దెబ్బలూ, తిట్లూ తప్పుకోవడానికి

రహస్యంగా చేశాను. ఖానమ్ ఖాను బ్రతికి ఉన్నంత కాలం నన్ను ఏమీ అనలేదు. అయినా భయం అలా ఉండేది.

నేను ఎలాంటి జనులమధ్య పెరిగి పెద్దదాన్ని అయ్యానో వారి రీతులు రివాజులు నాకూ అలవడ్డాయి. ఆ కాలంలో నేను మతాన్నిగురించి గానీ అల్లానుగురించి గాని ఆలోచించలేదు. ఆ వాతావరణంలో ఎవరూ ఆలోచించలేరని నా అభిప్రాయం.

ఆకస్మిక సంఘటనలు హృదయంలో ఉత్పాతాలు కలిగిస్తాయి. మేఘగర్జన మెరుపు తుఫాను భూకంపం సూర్య చంద్ర గ్రహణాలు. కరువులు అన్నీ భగవంతుడు కల్పించిన ఉత్పాతాలని విశ్వసిస్తారు. కాని వీటిలో కొన్నింటిని దూరంచేయడానికి ఉపాయాలు మార్గాలు నేను చూశాను. అయితే కొన్ని పీడలు దీవనలు తాయెత్తులు మందుమాకులతో దూరం కావు. వాటిని భగవదిచ్ఛగా భావించి అంతా భగవదధీనం అంటారు. మతాన్నిగురించిగానీ పాపపుణ్యాలనుగురించిగానీ మాకు ఎవరూ చెప్పలేదు. కాబట్టి అవేమిటో నాకు తెలియలేదు. ఆ కాలంలో నాకొక మతం లేదు. అందరిని చూచి వారు ఏది చేస్తే నేనూ అదే చేసే దాన్ని. ఎక్కువగా అదృష్టం మీదనే ఆధారపడేదాన్ని. నా సోమరితనం వల్లనో బుద్ధితక్కువతనంవల్లనో చెడిపోయిన పనిని దురదృష్టానికి అప్ప గించేదాన్ని. పారసీక గ్రంథాలు చదవడంవల్ల ఆకాశాన్ని తిట్టడం అల వాటు అయింది. నేను ఓడిపోయినపుడు లేదా నా లక్ష్యం చేరలేనపుడు అదృష్టాన్ని నిందించేదాన్ని.

స్వేచ్ఛారీతులమని ప్రగల్భములు పలికి పలికి
అదృష్టము తొలగువేళ నిందించెరి పరతంత్రులం॥

మౌల్వీగారూ బువాహుసేనీ పూర్వకాలపు విషయాలు చెప్పేవారు. అవి ఎంతో బావుండేవి. నాకూ గతాన్ని కీర్తించడం వర్తమానాన్ని దూషించడం అలవాటు అయింది. ముసలివారు పూర్వకాలాన్ని కీర్తించ డానికి కారణం వయసురసపు కాలం అందరికీ అందంగా ఉండడమేనని అప్పటికి అర్థం కాలేదు. లోకం తప్పుతోవ తాను చస్తే లోకం చస్తుంది తాను బ్రతుకుతే లోకం బ్రతుకుతుంది. ముసలివాళ్ళను చూచి వయసు వాళ్ళు అదేపాట ప్రారంభించారు. ఈ అలవాటు మొదటినుంచీ వస్తూంది కాబట్టి ఇప్పుడు అందరికీ అది మామూలు అయిపోయింది.

ప్రాయం వచ్చినతరవాత విలాసాల్లో పడిపోయాను. ఆ కాలంలో పాట పాడి పురుషులను రంజింపచేయడం నా వృత్తి. అందులో నా తోటి

వారితో గెలిచినపుడు ఆనందమూ ఓడినప్పుడు దుఃఖమూ కలుగుతుండేవి ఇతరులతో పోల్చినపుడు నేనేమంత అందమైనదాన్నేమీ కాదు కాని సంగీత సాహిత్యాలలో నాకున్న ప్రావీణ్యం నాకు ప్రత్యేకస్థానాన్ని, గౌరవాన్ని ఇచ్చాయి దానితో నాకు కొంత నష్టంకూడా కలిగింది గౌరవంతోపాటు గర్వం పెరిగింది మిగతా సానులు ఎవరితోనైనా తమ పనులు వెళ్ళదీసుకునేవాళ్ళు నేను ముఖాలు చూస్తూఉండిపోయేదాన్ని ఉదాహరణకు ఎవరు వచ్చినా ఏదో ఒక కోరిక కోరడం వారి రివాజు నేను అలా కాదు సిగ్గయ్యేది అడిగితే లేదంటాడేమో ననిపించేది నా తోటి వారిదగ్గరికి ఎవరైనా వచ్చినపుడు అతడు ఎంత ఇవ్వగలడు వారెంత పుచ్చుకోగలరు అనే ఆలోచన ఉండేదికాదు నాకు నచ్చినవాటి మనస్తత్వం నీతి నియమాలు, ఆచార వ్యవహారాలు పరిశీలించడంతోనే సరిపోయేది అడగడం హేయంగా భావించేదాన్ని అంతేకాదు వేశ్యలకు ఉండవలసిన లక్షణాలు నాలో లేవు అందుకే నా తోటివారు నన్ను పిచ్చిదానికింద లెక్కకట్టేవారు

తరవాత వేశ్యావృత్తి నీచమైందని అర్థం చేసుకున్నాను వదిలేశాను ఆటపాటలతో కాలం గడపసాగాను అమీరు ఎవరైనా కొలువుంచుకుంటే ఉండేదాన్ని క్రమంగా అదీ వదిలేశాను

అలాంటి పనులన్నీ చెడ్డవని తెలుసుకొని వదిలివేసినతరవాత ఎవరో ఒక పురుషునిదగ్గర ఉండిపోవాలనిపించింది కాని లోకం "కఫన్[1]" కోసం కట్టుకుంది అని అనుకుంటుందని మానుకున్నాను

మిర్జాగారు! బహుశః ఈ సామెత మీకు అర్థంకాదు వయసు మళ్ళిన భోగముది ఎవరి ఇంట్లోనైనా స్థిరపడితే అనుభవం గల వెలయాలు కఫన్‌కోసం కట్టుకుంది అంటారు అంటే ఉత్తరక్రియలకు ఏర్పాటుచేసుకుంది అని అర్థం ఈ సామెత అక్షరాలా వాస్తవం నాకు వింతగా విరక్తి కలిగింది. ఇప్పుడు ఎంతో నీతిగా ఉంటున్నాను అయినా భగవంతునికి తప్ప నా నిజాయితీమీద నమ్మకం ఎవరికీ ఉండదు ఈ పరిస్థితిలో నేను ఒక వ్యక్తిని ప్రేమించాననుకోండి అది ఎంత నిస్వార్థమైంది అయినా, ఎంత నిష్కళంకం అయింది అయినా ఆ మనిషి నమ్మడు. పైగా నవ్వుతాడు. ఆలాంటప్పుడు నేను ప్రేమించడం నిష్ప్రయోజనం నాదగ్గర డబ్బు ఉంది కాబట్టి జనం నేనంటే పడిచస్తున్నారనుకుంటుంది లోకం. జనం నన్ను మోసగించడానికి చూస్తారు ఒక మహాశయుడు నా సౌందర్యాన్ని

1 పీనుగుమీద కప్పే గుడ్డ.

కీర్తిస్తాడు నాకంటే ఎన్నోరెట్లు అందమైన ఆడవాళ్ళతో పరిచయం ఉండి కూడా నన్నే పొగడుతాడు ఇంకొకడు తనకు రాగతాళాలతో పరిచయం లేకున్నా నా సంగీతాన్ని శ్లాఘిస్తాడు జీవితాంతం ఒక్క పద్యం వ్రాయడం గాని, చదవడంగాని తెలియని కవిపుంగవుడు నా కవితాశక్తిని కొనియాడుతాడు మరొక వ్యక్తి తాను స్వయంగా పండితుడై నా పాండిత్యప్రకర్షను గురించి ఉపన్యాసం దంచుతాడు తనకేమీ తెలియనట్లు నిత్యకృత్యమైన నమాజు వగైరాలనుగురించి కూడా నన్నే అడిగి తెలుసుకుంటాడు మరొక ప్రేమికుడు నా ధనాన్నిగురించి పట్టించుకోనట్లు నా ఆరోగ్యాన్ని గురించి ఎంతో శ్రద్ధ తీసుకుంటాడు నాకు రొంపవిడితే వారికి తలనెప్పి చేస్తుంది నాకు తలనెప్పిలేస్తే వారికి జ్వరం వస్తుంది ఒక వేదాంతి వైరాగ్యం బోధిస్తాడు ఇహపరాలను వివరిస్తాడు నన్ను పట్టి వెర్రి దానిగా లెక్క కట్టి పది పన్నెండేళ్ళ పిల్లతో మాట్లాడినట్లు మాట్లాడుతారు.

పలుప్రాంతాలు తిరిగి ఆరితేరినదాన్ని ఎవరెలా అనుకుంటే అలా అయిపోతాను వాస్తవానికి వాళ్ళనే పిచ్చివాళ్ళను చేస్తాను నిజమైన ప్రేమతోనూ అభిమానంతోనూ కలుసుకునేవాళ్ళు ఒకరిద్దరు ఉన్నారు. ఎట్టి స్వార్థం లేకుండా వచ్చిపోతుంటారు కవితాగోష్ఠి, సంగీతం సంభాషణలలో వారికి అభిరుచి వారితో నాకుగాని నాతో వారికిగాని ఎలాంటి నిమిత్తం లేదు అలాంటివారంటే నాకు ఎంతో ఇష్టం ఆ నిర్నిమిత్తత క్రమంగా నిమిత్తంగా మారింది వారులేక నేనుగాని నేనులేక వారు గాని జీవించడం కష్టం అయిపోయింది కాని వీరిలో ఎవరూ నన్ను ఇంట్లో ఉంచుకోవాలనుకునేవారు లేరు అలా ఉంటే ఎంతో బాగుండేది ఈ కోరిక పడుచుదనం తిరిగి రావాలనే కోరికలాంటిది స్త్రీ జీవితం యవ్వనాంతం యవ్వనంతో జీవితంకూడా అంతం అవుతే ఎంతో బాగుండేది ఎందుకు అవుతుంది? వార్ధక్యం అందరికీ బాధాకరమే ఆడదానికి మరీను ముఖ్యంగా భోగందానికి అది నరకప్రాయం ఎన్నో సందుగొందులలో తిరిగే చాలమంది బిచ్చపుకత్తెలు భోగంవాళ్ళే పడుచుదనంలో అడుగు క్రింద పెట్టనివాళ్ళు వేలకొద్దీ పచ్చని సంసారాలకు చిచ్చుపెట్టినవారు వందలమంది యువకులను అకారణంగా హత్యచేసినవారు ఎక్కడికి వెళ్ళినా అడుగులకు మడుగులొత్తేవారు ఇప్పుడు ఒక్కడూ కనీసం కన్నెత్తి చూడడు పూర్వం ఎక్కడ కూర్చున్నా జనుల గుండెలలో మల్లెలు కురిపించేవారు ఇప్పుడు వారిని చూచి అంతా దూరంగా ఉంటున్నారు పూర్వం అయాచకంగా ముత్యాలు లభించేవి ఇప్పుడు బిచ్చమెత్తినా గింజలు దొరకడంలేదు

వీరిలో చాలమంది తమ గోతులు తాము తీసుకున్నవారే. మా ఇంటికి ఒక అవ్వ వచ్చేది—ఒకనాటి ప్రఖ్యాత వేశ్యలలో ఒకత్తె. వయసులో ఉన్నప్పుడు వేలు సంపాదించింది. ఉదార హృదయం గలది. వయస్సు మళ్ళింది. ముసలిది అయింది. డబ్బంతా విటులకు పెట్టింది. ఒక యువకుడు ఆమెను ఇంట్లో పెట్టుకున్నాడు. వయసులో చిన్నవాడు. అందంలో మిన్నవాడు. ఆ ముసలితొత్తును పట్టుకొని ఉండాల్సిన పని ఏమి? భార్య మాట విరిచింది. జగడాలు పెట్టింది. అసలు విషయం బోధించాడు. ఆవిడ మౌనం దాల్చింది. డబ్బున్నంతకాలం ముసలిదాన్ని ముద్దాడు. తరవాత ఎవరికి కావాలి? ఇంట్లోంచి గెంటేశాడు. సందుగొందుల్లో తిట్లూ, తన్నులూ తింటూ తిరుగుతోంది.

కొందరు నాలాంటి మూర్ఖులైన సానులు ఎవరి కూతురినో తెచ్చుకొని పెంచి పెద్దదాన్ని చేశారు. దాన్ని తన ప్రాణంగా భావించారు. దానికి వయసు వస్తే ఎవనితోనో లేచిపోయింది. అథవా ఉండిపోయినా ఆ స్త్రీపోషకులు హస్తగతం చేసుకొని పెంచి పెద్దచేసినదానిని దాసీదాని క్రింద కట్టివేస్తుంది.

అటారి నన్ను మోసగించింది. దాని వేషం మొదటే తెలిపోయింది. కాబట్టి సరిపోయింది. కాకుంటే నన్నే దోచుకొంటుండేది. ఆడదైతేనేం? మగవాడైతేనేం? భోగం కులమే అంత. అది ఎంత నీచం అయిందంటే ప్రేమ అనేది అక్కడ సాధ్యపడదు. సానిది ఏ ఒక్కరిదీ కాదని తెలుసును కాబట్టి తెలివికలవాడెవడూ దాన్ని హృదయపూర్వకంగా ప్రేమించడు. ఆడదానికి అలాంటి ప్రేమ ఉండనే ఉండదు.

తొలుత ప్రేమించినవారు అందం క్షీణించగానే అటు రావడం మానేస్తారు. ఖుష్క ముఖస్తుతులకు అలవాటుపడిపోతారు. ఇప్పుడు ముఖస్తుతికి ముఖం వాచిపోతారు.

మగవారికి విశ్వాసం ఉండదనే కథ ఎన్నో మొదలుమొదలు సానుల ద్వారా విన్నాను. బుద్ధిలేక వారు అన్నదానికల్లా ఊ, అనేదాన్ని. గోహర్ మిర్జా నా విషయంలో ఎలా ప్రవర్తించాడో మీకు తెలుసు. పెళ్ళి నేరంమోపిన నవాబు సంగతి మీకు తెలియనిది కాదు. అయినా మగవారిని విశ్వాసఘాతకులు అనలేను. స్త్రీలు—ముఖ్యంగా బజారు ఆడవాళ్ళు—వాళ్ళకంటే ఏమాత్రం తీసిపోరు. ప్రేమ విషయంలో కరకుగా పురుషులు బుద్ధిహీనులూ, స్త్రీలు చతురులూ అయుంటారు. ఎక్కువమంది మగవాళ్ళు

హృదయపూర్వకంగా ప్రేమిస్తారు ఆడవాళ్ళు బూటకపు ప్రేమ కనబరుస్తారు పురుషుడు ఆడదాని అందానికి అనురాగానికి త్వరగా లొంగిపోతాడు ఆడది అలా కాదు అంత త్వరగా ఆమె ప్రభావితురాలు కాదు ఈ విషయంలో స్త్రీలు చాల జాగ్రత్తగా ఉంటారు పురుషుల ప్రేమ స్త్రీల ప్రేమంత తేలికగా క్షీణించదు కాని ఉభయుల అన్యోన్యతను బట్టి విశేష అనురాగం ఉద్భవించే అవకాశం ఉంది అందుకు పరస్పరం అర్థంచేసుకునే సామర్థ్యం కలిగిఉండాలి కనీసం ఒక్కరిలో ఆ లక్షణం ఉండాలి

వలపు లోకంలో పురుషుడు ఉదారత కనబరుస్తాడు స్త్రీకి కంత ఎక్కువ ఆడదాని మంత్రం మగవానిమీద త్వరగా పారుతుంది పురుషుని మాయకు స్త్రీ త్వరగా లొంగదు నావరకు ఇది ప్రకృతికి సంబంధించిన విషయం వార్ధక్యంతోపాటు స్త్రీ బుద్ధి క్షీణిస్తుంది చతురత నశిస్తుంది ఈ లోపానికి అనుగుణంగా కొన్ని యోగ్యతలు ఇచ్చాడు. ఈ లక్షణం జంతువుల్లో కూడా కనిపిస్తుంది తరచుగా ముసలి జంతువులకు బుద్ధి ఉండదు

పురుషులు స్త్రీలను సుందరాంగులంటే నేను ఒప్పుకోను వాస్తవానికి స్త్రీకిగాని పురుషునికిగాని సౌందర్యం స్వతహాగా లేదు ఒకరు మరొకరికి అందంగా కనిపిస్తారు అందంగా ఉన్నవాళ్ళను స్త్రీ పురుషులు పసందు చేస్తారు కాని వాస్తవంగా స్త్రీ అందాన్ని పురుషుడు పురుషుని అందాన్ని స్త్రీ ఆనందిస్తారు ఒక సుందరాంగికి వేరొక సుందరాంగి సౌందర్యం వాసనలేని చక్కని రంగుపూవులాంటిది వికారమైన పురుషుడు అందమైన స్త్రీ అభిప్రాయంలో చక్కని పూవులాంటివాడే పూవు మనసుకు నచ్చుతుంది. అయితే దాని రంగు ఆకారం మరీ అసహ్యంగా ఉండరాదు వలపు లోకంలో తప్పు ఏ ఒక్కరితోనూ జరుగదు అయితే ఉభయులూ ఈ సూక్ష్మాన్ని గ్రహించలేరు వారిరువురి ప్రేమభావనలో వ్యత్యాసం ఉంటుంది పురుషుడు స్త్రీని ఏ దృష్టితో చూస్తాడో స్త్రీ పురుషుని ఆ దృష్టితో చూడదు స్త్రీని ప్రేమించే లక్షణం పురుషునిలో కొంతవరకు ఉంటుంది అతడాన్ని ధనాన్ని చూచి ఒక చిన్నవాడు ఆమెను ప్రేమించినప్పుడు వయసుమళ్ళిన స్త్రీ అతనిని ఎందుకు ఎలా ప్రేమిస్తుంది?

వృద్ధులకంటే యువకులనే స్త్రీలు ఎక్కువగా ప్రేమిస్తారు అది వారి అందచందాలను చూచి కాదు స్త్రీ ఎల్లప్పుడూ తన వార్ధక్యాన్ని గురించి జాగ్రత్తపడుతుంది ఒక రక్షణ. ఆశ్రయం కావాలని ఆమె

సంకల్పం వృద్ధులకంటే యువకులనుండి అలాంటి ఆశ్రయం లభించే అవకాశం ఎక్కువ ఉంటుంది ఆశ్రయంతోకూడా రూపురేఖలు కలిస్తే బంగారానికి మెరుగుపెట్టినట్లు అవుతుంది

పురుషుని ప్రేమకు లక్ష్యం ఆనందం మాత్రమే స్త్రీ ప్రేమకు ఆనందంతోపాటు అవలంబన కూడా లక్ష్యం అవుతుంది ప్రేమకు ప్రయోజనంగాని స్వార్థంగాని ఉండరాదంటున్నారు స్త్రీ ప్రేమలో చాలవరకు అవి ఉంటాయి ఆమె వాటిని దాచడానికి ప్రయత్నిస్తుంది

నేను చెప్పిన విషయాల పరిజ్ఞానం స్త్రీలకుగాని పురుషులకుగాని తరచుగా ఉండదంటే నేను అంగీకరిస్తాను వాస్తవం ఏమంటే స్త్రీ పురుషులలో ప్రకృతిసిద్ధంగా ఈ లక్షణాలు ఉంటాయి వారికి తద్విషయ జ్ఞానం ఉండాల్సిన అవసరం లేదు

జీవితాంతపు అనుభవంతో ఈ విషయాలు నేను గ్రహించాను. నావలెనే ఈ విషయాలను ధ్యానంగా పరిశీలించిన వ్యక్తికి అర్థం అవుతుంది.

చాలమంది స్త్రీలు వివేకశూన్యులైన పురుషులు వీటినిగురించి ఆలోచించక జీవితంలో అనేక స్పర్ధలకూ, తగాదాలకు ఆలవాలం అవుతుంటారు

స్త్రీ పురుషులు తమతమ అంతస్తులను, ప్రయోజనాలను లక్ష్యాలను గుర్తించినట్లయితే అనేక ఇబ్బందులు దూరం అవుతాయి కొన్ని రానే రావు. కాని వీటినిగురించి వివరించినప్పుడు తరచుగా ఈ సమాధానం వస్తుంది :

"అయ్యా! తలరాత తప్పదు" అంటే ఏం చేయదలచింది చేస్తాం. మమ్మల్ని అడ్డగించవద్దు అసలు మనిషి ఏం చేయగలడు? జరగవలసింది ఏమో అవుతుంది! నేను దుష్కార్యాలు చేస్తాను వాటి పర్యవసానం అదృష్టం ఎలా తిప్పితే అలా జరుగుతుంది అంతా భగవంతుడు అనుకున్నట్లే జరుగుతుంది అని అర్థం. దీన్ని పూర్వకాలానికి వర్తింపచేస్తే కొంత అర్థం ఉంది. పండితులంటే ఆ కాలంలో అకస్మికంగా కలంలో బండ్లు ఓడలు, ఓడలు బండ్లు అయిపోయేవి. ఇది తలుచుకుంటే ఆనాటి కాలం గుర్తుకు వస్తుంది. ఆ కాలంలో ఇట్టే మార్పులు జరిగేవి. మనిషి పరిస్థితి అమాంతంగా మారిపోయేది

ఒకనాటి వృత్తాంతం ఒక సిపాయి అలసి సొలసి మోతీమహల్ గేటుపక్కన ఉన్న అరుగుమీద పడుకొని నిద్రపోయాడు ఉదయపు నమాజు పూర్తిచేసుకొని పాదుషావారు పచారుచేస్తూ అటు విచ్చేశారు వెంట ఎవరూ లేరు వారికి ఏమనిపించిందోగాని పడుకున్నవాణ్ణి లేపారు-సిపాయి కళ్ళు నలుచుకుంటూ లేచాడు పాదుషావారు కనిపించారు ముందు భయపడిపోయాడు తరవాత సర్దుకొని తనదగ్గరఉన్న కరవాలం సమర్పించాడు పాదుషా స్వీకరించారు ఖడ్గం లాగారు తుప్పు పట్టి ఉంది ఒరలోంచి కష్టంగా బయటికి వచ్చింది కత్తిని చూశారు తొగి చారు మళ్ళీ ఒరలో పెట్టి నడుముకు తగిలించుకున్నారు తమవద్దఉన్న రాజకరవాలం సిపాయికి ఇచ్చేశారు ఈలోగా అలీనకీఖా ప్రధాని విచ్చేశారు జహాంపనా (చక్రవర్తి) ఆ యువకుని అతడు సమర్పించిన ఖడ్గాన్ని కీర్తించారు

పాదుషా చూచావా ఇతణ్ణి యువకుడు వీరుడు (ఒరలోంచి కత్తి లాగి) చూచావా దీని పదును. దీని అందం!

ప్రధాని మహాప్రభూ! బళి బళి గుణాన్ని గ్రహించే తమవంటి ప్రభువులున్ననే కదా ఇట్టి విచిత్రవస్తువులు లభించునది

పాదుషా: అయితే నా ఖడ్గం బాగాలేదంటావా?

ప్రధాని ఎంత మాట! ఎంత మాట! ప్రభువుల కరకమలాన్ని అలంకరించే కరవాలం బాగులేకపోవడమా?

పాదుషా కాని ఇతని దుస్తులు నా కరవాలానికి తగినట్లుగా లేవు.

ఈలోగా వందిమాగధులు, రాజసేవకులు, అంగరక్షకులు వచ్చారు, పెద్ద గుంపు కూడింది.

ప్రధాని ప్రభువులు బాగా శలవిచ్చారు

పాదుషా అయితే నా దుస్తులు అతనికి వేయండి

రాజుగారి అధరం కదిలిందో లేదో జనం పరిగెత్తారు రాజుగారు తొడుక్కొనిఉన్న విలువైన దుస్తులు, రత్నఖచితమూలైన ఆభరణాలు సిపాయికి వేశారు అలంకారం పూర్తి అయింది.

పాదుషా: ఇప్పుడు చూడండి

ప్రధాని అల్పః రూపమే మారిపోయింది

వందిమాగధులు సైతం కీర్తించారు

పాదుషావారు కొంతసేపు అక్కడ నిలిచారు ఈలోగా వాహనం వచ్చింది వాహనం ఎక్కి వాహ్యాళికి వెళ్ళిపోయారు

సిపాయీ పొంగిపోయాడు ఇంటికి వచ్చారు ధనాఢ్యుల సాహూకార్లు వెంటనే వచ్చారు ఖరీదు కత్తే యాభై అరవై వేలకు తేలింది

ఇక సిపాయి కథ వినండి సైన్యంలో మూడు రూపాయిల కొలువు రాత్రిపూట ఇంటికి వెళ్తే తిండిగురించి పెళ్ళాంతో తగాదా జరిగింది అలిగి ఇంటినుండి వెళ్ళిపోయాడు రాత్రి అంతా ఎక్కడెక్కడ తిరిగాడో భగవంతునికే తెలియాలి తెల్లవారుతుండగా మోతీమహల్ ముందరి అరుగుమీద పడిపోయాడు నిద్రపోయాడు ఉదయం పాదుషావారు తట్టి లేపారు ఎంత దృశ్యం కనిపించింది క్షణంలో దరిద్రుడు మహాధనికుడు అయిపోయాడు

రాజుల కాలంలో ఇలాంటివి చాల జరిగేవి ఆ కాలంలోనే ఇలాంటివి సాధ్యం కూడా ప్రభుత్వం ఒక్కని చేతిలో ఉన్నప్పుడూ అతనికి నియమాలు దట్టాలూ ఏమీ లేనపుడు, రాజ్యాన్ని అతని స్వంత సొక్కసంగా భావించినప్పుడూ ఇలాంటివి జరిగే అవకాశాలు ఉంటాయి

ఇంగ్లీషువారి ప్రభుత్వంలో వృథా ఖర్చులకు అవకాశం లేదు ఒక వ్యక్తికి అకారణంగా పెద్ద మొత్తాలు ఇవ్వడం అన్యాయంగా భావించబడుతుంది ఈ ప్రభుత్వంలో పాదుషానుంచి ఫకీరువరకు అందరికీ శాసనం ఒకటే అందరూ ఆ శాసనానికి బద్ధులే ఈ కాలంలో అదృష్టపు బలం తక్కువ అన్నీ పనులూ ఆలోచనతోనూ. ఉపాయంతోనూ జరుగుతాయి

నవాబు ఛబ్బసుగారి వృత్తాంతం వినండి ఆత్మకథలో ఉత్తరభాగం చెప్పలేదు వాస్తవానికి వారు ఏటిలో మునగడానికి వెళ్ళారు మళ్ళీ తేలకూడదని దుమికారు ప్రాణం అతిప్రియమైంది కొంతసేపు నీటిలో ఉండేవరకు ఊపిరి ఆడలేదు కాస్త శ్వాస పీల్చుకుందామని పైకివచ్చారు. నీళ్ళమీదికి రాగానే శ్వాస, చేతులూ ఆడాయి మళ్ళీ బతకాలనిపించింది మళ్ళీ మునిగారు మళ్ళీ అలాగే జరిగింది. అలా మునుగుతూ తేలుతూ ఛత్తర్ మంజిల్ వరకు చేరారు అనుకోకుండా యువరాజుగారు తమ పరి

వారంతో విహారానికి అటువైపే వచ్చారు  వారికి ఎవరో మునుగుతున్నట్లు కనిపించింది  బయటికి లాగవలసిందని సరంగులకు ఆజ్ఞాపించారు  వారి నుండి విడిపించుకోవడానికి ఖన్నుసుగారు చాలా ప్రయత్నించారు  బెదిరి పోయారనుకున్నారు సరంగులు  బలవంతంగా లాక్కొనివచ్చారు  యువరాజాగారు పిలిపించారు  విషయం తెలుసుకోగా అమీరు కొత్త అని తెలిసింది  బట్టలు ఇవ్వబడినాయి  వెంట రాజప్రాసాదానికి తీసికెళ్లారు

ఖన్నున్‌గారు యువకులు  విలాస ప్రియులు  రీతులు రివాజులు తెలిసినవారు  వినయవంతులు  విద్యావంతులు  హాస్యప్రియులు  యువ రాజుకు నచ్చారు  చెలికాళ్ళలో చేర్చారు  దాసదాసీజనం  వాహనాలు ఏర్పాటు అయినాయి  ఖర్చులకు డబ్బు మంజూరైంది  పూర్వంకంటే అట్టహాసం ఎక్కువ అయింది

చౌకుకు వచ్చేసినప్పటి పరిస్థితే వేరు  ఏనుగ మీద వచ్చారు  వెంట యాభైమంది మనుషులు పరిగెత్తివస్తున్నారు  బిస్మిల్లా నేనూ చూచాం  నమ్మకం కలుగలేదు  వెంట మద్దుంబక్ష్‌ను చూచి పిలిచాం  అతడు జరిగినదంతా చెప్పారు

తరవాత దొరాయిని కలుసుకున్నారు  పెళ్ళి అయింది  పెళ్ళికి మమ్మల్నికూడా పిలిచారు  ఖానమ్‌కు ఖరీదైన కానుకలు ఇచ్చారు  కాని అనాటినుంచీ మళ్ళీ మా ఇంటిగడప తొక్కలేదు. బిస్మిల్లాతో సంబంధం తెగిపోయింది  ఖానమ్ మరొక ఎత్తు వేసింది  అది పారలేదు. అంతా తలక్రిందులైంది

సంగ్రహంగా చెప్పాలంటే రాజుల కాలంలో ఇలాంటి వింతలు, విచిత్రాలు ఎన్నో జరిగేవి  ఇంగ్లీషువారి కాలంలో అవేవీ! ఖలీల్‌ఖాను పావురాలు ఎగరేశారని వింటాం  డబ్బు గుడ్డిదనగా విన్నాం  కాని ఇప్పుడు అది కళ్ళు తెరిచిందనిపిస్తోంది  అదీ యోగ్యులను కనిపెట్టోంది

రాజుల కాలంలో అక్షరాలు రాని అధికారులు ఉండేవారు  పెద్ద పెద్ద పదవులపైన ఉండే వీరు రాచకార్యాలు ఎలా నిర్వర్తించేవారో తెలి యదు  ఇదంతా అపహాస్యంగా కనిపిస్తుంది

అదృష్ట, దురదృష్టాలు అనే చక్రంలో చాలకాలం నలిగాను  చివ రకు ఈ పదాలకు అర్థం లేదని. వట్టి మోసమనీ అర్థం చేసుకున్నాను అల్లా మనం చేసేపాపాలన్నింటినీ గ్రహిస్తుంటారనడంలో ఎలాంటి

సందేహం లేదు. ఆ విషయంలో సందేహం గలవాడు కాఫిర్. కాని తమ చర్యల పర్యవసానం దుష్ఫలితాన్ని దుర్వ్యసనపు దాన్ని కర్మకు అంటగట్టడం భగవంతునిపై నేరం మోపడంలాంటిది. ఇది నాస్తిక వాదం.

ఇప్పుడు తెలిసిన విషయాలు నాకు ముందే తెలిసి ఉంటే ఎంతో బావుండేది. వివరించి చెప్పేవారు లేరు. నాకు స్వయంగా అర్థంచేసుకునేంత అనుభవం లేదు. మౌల్వీగారు రెండు అక్షరాలు కుక్షిలో వేశారు. అవి ఎంతో ఉపకరించాయి. వారికి భగవంతుడు ఉత్తమ గతులు ప్రసాదించుగాక. ఆ కాలంలో నాకు వాటి విలువ తెలియలేదు. సోమరితనం, హాస్యాపేక్ష తప్ప వేరే ప్రపంచం తెలియదు. వచ్చేపోయేవారితో విరామం లేకుండేది. వారు ఒక్కొక్కరే జారుకోగా పుస్తకాలమీద ధ్యాస కలిగింది. చదవడం ఒక వ్యసనం అయిపోయింది.

ఆ వ్యసనమే లేకున్నట్లయితే నేను ఇంత కాలం బ్రతకలేకపోయేదాన్ని. వయసు వళించింది. పూర్వపు విటులు జారుకున్నారు. ఈ దుఃఖంతో కుమిలి కుమిలి చచ్చిపోయేదాన్ని. కొంతకాలం కథల పుస్తకాలతో కాలం గడిపాను. ఒకనాడు పుస్తకాలు సర్దుతుండగా పూర్వం మౌల్వీగారిదగ్గర చదివిన "గులిస్తాఁ" కనిపించింది. పుటలు తిప్పాను. పూర్వం అదంటే అసహ్యం వేసేది. అవి చదువుకొనే రోజులు. విషయ విశేషాలు తెలియని రోజులు. రెండవది అనుభవం లేదు. అందువలన అర్థం చేసుకోలేకపోయాను. ఇప్పుడు చదువుతుంటే ప్రతి పదంలో ఏదో ప్రభావం కనిపిస్తుంది. ప్రతిపదాన్నీ హృదయంలో భద్రపరచుకుంటున్నాను. మొదటినుంచి చివరిదాకా అనేకసార్లు చదివాను. ఒకరు "అఖ్లాకే నాస్రీ" (నీతిశాస్త్రం) ని గురించి ఎంతో పొగిడారు. చదవాలనిపించింది. వారితోనే పుస్తకం తెప్పించుకొని చదివాను. పుస్తకం చాల కఠినం. అరబ్బీ పదాలు ఎక్కువ ఉన్నాయి. అర్థం చేసుకోవడం కష్టం అయింది. కొద్దికొద్దిగా చదివి చాలరోజులకు పూర్తిచేశాను. "దానిష్‌నామా" ఆ రోజుల్లో అచ్చయింది. దాన్ని చదివాను. "సద్రా దక్బరా" స్వయంగా చదివాను. అర్థం కానివి అడిగి తెలుసుకున్నాను. ఈ పుస్తకాలు చదివినతరవాత ప్రపంచ రహస్యాలు ఒక్కొక్కటే వెల్లడి అయినట్లు అనిపించింది. ఆ తరవాత ఉర్దూ, పారసీక గ్రంథాలు ఎన్నో స్వయంగా చదివాను. "ఖసాయద్ అన్వరీ", "ఖాఖానీ" మెల్లి మెల్లిగా పూర్తిచేశాను. కాని నాటకపు పొగత్తలంటే నాకు గిట్టదు.

అందుకే వాటిని అలమరాలో పెట్టి మూసేశాను ప్రస్తుతం నాకు ఎన్నో వార్తాపత్రికలు వస్తాయి వాటివల్ల ప్రపంచంలోని వార్తలన్నీ తెలుస్తాయి పొదుపుగా వ్యవహరిస్తే జీవితం గడపడానికి సరిపోయే డబ్బుంది అల్లా ఉన్నాడు ప్రస్తుతం నాది నిష్కల్మష హృదయం రోజా నమాజు చేస్తాను వావడం పెళ్ళను అల్లా కొట్టినా చంపినా పరదాలలో ఉండే ఆడది వావడం నాకు చేతకాదు అయినా పరదాలలో ఉండేవారి మాంగల్యం చల్లంగా ఉండాలని అల్లాను ప్రార్థిస్తుంటాను లోకం ఉన్నంతకాలం వారి పరదా ఉండుగాక

ఈ సందర్భంలో సానివృత్తివాళ్ళకు ఒక నీతి చెప్తాను వారి హృదయఫలకాలపై చెక్కుకొనవలసిన వరాలవి

ఓ బుద్ధిలేని వేశ్యల్లారా! ఎవరైనా మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నారనిగానీ మీరంటే చస్తున్నారనికాని మరిచికూడా అనుకోకండి ఇది మూణ్ణాళ్ళ ముచ్చట తరవాత అతని దోవ అతనిది ఆతడు నిన్ను కట్టుకోలేడు నీకు ఆ అర్హతలేదు వాస్తవప్రేమ శీలవతుల సొత్తు వారు ఒకరిని కట్టుకుంటే పరాయివారిని కన్నెత్తి చూడరు వారు ప్రేమమూర్తులు వారికి ఆ హక్కు ఉంది మీలాంటి బజారుముండలకు భగవంతుడు అది ప్రసాదించడు

నా జీవితం ఎలాగో గడిచిపోయింది రోజులు లెక్కపెడ్తూ కాలం గడుపుతున్నాను భూమ్మీద నూకలున్నన్నాళ్ళు బ్రతుకుతాను నా మనసుకు నేనే సమాధానం చెప్పుకున్నాను నా కోరికలన్నీ పూర్తిఅయినాయి మిగిలింది ఒకే కోరిక అది మృత్యువుతో తీరేది నా ఆత్మకథ ఏదో విధంగా ప్రయోజనకారి అవుతుందని ఆశిస్తున్నాను నా ఉపన్యాసాన్ని ఈ పద్యంతో పూర్తిచేస్తూ అందరి ఆశీస్సులు ఆశిస్తున్నాను

ఓ జీవితమా! మరణ మాసన్నమైనదే!
నీవన్న మాకిపుడు విసుగు పుట్టెనే!